*Janmabhūmi*

*The Motherland- An epic in Telugu*

*By*

*Nayani Subba Rao*

*Birth Centenary Publication (1899-1999)*



Title page: Shilavi

Price Rs. : 195/-
Publication : Nayani Subba Rao Trust
Laser typeset : Haripriya Pulikonda
Printed at : Dynamic Offset Printers, Panjagutta, Hyderabad.
For copies : (1) 898/2, Nagarjuna Nagar, Hyderabad. Tel:3747133
(2) VISHALANDHRA Book House, Hyderabad.



వితతవినయభావాన్వీత నైజానుజన్మ
త్రితయ సతత సేవా తృప్తిమ న్నవ్యరామా

# విన్నపము

నేను పుట్టి పెరిగిన పొదిలె, నెల్లూరు జిల్లాలోనిది. ఇప్పుడు వంగవోలు జిల్లాలో చేరినది. వంగవోలు కూడా పూర్వము నెల్లూరు జిల్లాలోనిదే. పొదిలె, వంగవోలు-కంభం బాటపై, వంగవోలుకు పడమరగా ముప్పదిమైళ్ళ దూరమున నున్నది.

నా జన్మభూమి వస్తువుగా నొక కావ్యము వ్రాయవలెనను తలంపీవాటిది కాదు. పద్యరచన ఆరంభమైనప్పటినుండియు నది నా మనోవీధిని కుదురుకొనియే యున్నది. నేను హైదరాబాద్ అకాశవాణిలో నున్నప్పుడు ప్రియమిత్రులు కీ.శే. త్రిపురనేని గోపీచంద్, అయన పర్యవేక్షణలోనున్న యొక మాసపత్రికకు నెలనెలా పద్యములు వ్రాయవలయునని నన్ను

కోరెను. ఆ సహృదయుని కోరిక కాదనలేక నా 'జన్మభూమి' కావ్యమునకు శ్రీకారము చుట్టితిని.

ఇందలి ప్రకృతి వర్ణనలు నా బాల్య స్మృతుల నుండి చేదుకొన్నవి. ఇప్పుడు కొన్ని మార్పులు కలిగినవి. ఉదాహరణకు, అప్పటి తాటితోపు ఇప్పుడు లేదు. చిన్నప్పు డాయూరి గాథలు లీలగా వినుటయే కాని వానిని క్షుణ్ణముగా తెలిసికొన్నది లేదు. ఇప్పుడాయవసరము కలుగగా, కీ.శే శ్రీ వేమూరి విశ్వనాథ శర్మగారి 'పొదిలెసీమ దండకవిలె' యన్న వ్యాసము (భారతి- సంపుటి 3, సంఖ్య 10 పుటలు 92-99) గుర్తుకు వచ్చెను. ఆ దండకవిలె కొఱకు పొదిలె వెళ్ళితిని. అచ్చట పొదిలె పంచాయత్ సమితి అప్పటి ప్రెసిడెంటు శ్రీ యం. రామిరెడ్డి తోడ్పాటుతో, మాధవరాయని పాలెము కరణమైన ఎల్లంరాజు వంశస్థుని యింట నా తాటాకు పొత్తము చూడగంటిని. కాని తాళపత్ర గ్రంథములు చదువుటలో ననుభవములేని నాకు దానిని చూచియును చూడనట్లేయైనది. అప్పుడే అచ్చట నా చిన్ననాటి మిత్రుడును సహాధ్యాయియు నైన శ్రీ పంచాగ్నుల అంబా శంకరయ్యను కలసికొనుట తటస్థించెను. విశ్వనాథ శర్మగారి మేనల్లుడాయన. తన వ్యాసమునకై ఎల్లంరాజు వారినడిగి మామ తెచ్చుకొన్న దండకవిలె నుండి అల్లుడు కొన్ని భాగములెత్తి వ్రాసికొనెను. నా ప్రయత్నమునకు సంతోషించి ఆయన కాగితములను నాకిచ్చెను. అవి నా కెంతో యుపకరించినవి.

అంతకు ముందే హైదరాబాదులోనే, పొదిలెనుండి వచ్చిన శ్రీ చీమలమర్రి సీతారామయ్యను కలసికొనుట తటస్థించినది. ముంగమూరి మహాజనుల కథను, ఉద్దండ నృసింహభారతి కథను, ఆయన నాకు వివరించి చెప్పెను. నా యింకొక చిన్నాటి స్నేహితుడును, సహాధ్యాయియు నైన శ్రీ గంటా వెంకట నరసయ్య (ఇప్పుడు వంగవోలు మకాము)ను వెంటబెట్టుకొని తరువాత మరల పొదిలె వెళ్ళితిని. అప్పుడు శ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి నాకు పంచాగ్ని కథ చెప్పెను. పొదిలెసీమ దండకవిలె ప్రతినొక దానిని ఆయన చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో చూచెనట. దండకవిలెను వెలుగులోనికి తెచ్చుట పొదిలెసీమ పెద్దల కర్తవ్యము కాదా! పొదిలెమ్మ కథను ఆమె పూజారి చెప్పెను. నిమ్మవ్వ కథను నిర్మమేశ్వరాలయార్చకుడైన మూలంరాజు

వంశ్యుడు చెప్పగా వింటిని. నా కోరికపై శ్రీ గంటా వెంకట నరసయ్యా మఱల నొకసారి పొదిలెకు పోయి అచటి దేవస్థానముల వివరములు సేకరించి తెచ్చి నాకిచ్చెను. కీ.శే శ్రీ దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి సంబురాయల వంశము. వారి శాసనములు కొన్ని నేనర్థించగా వ్రాసి పంపెను. ఈ విధముగా విషయ సేకరణలో తోడ్పడిన పై వారికందరికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణమునకు ద్రవ్య సాహాయ్యా మొనర్చిన నరసరావుపేట మిత్రులకు, అభిమానులకు కృతజ్ఞడను. వారి పేర్లిందు ప్రచురించలేక పోయినందులకు చింతించుచున్నాను.

దీని ముద్రణమునిట్లు తీర్చిన రచయితల దాయి (Writers Anvil) ముద్రణాలయ నేత శ్రీ పెద్దిభొట్ల పూర్ణానందమును శంసింతును.

నాకు పీఠికా రచన కోపికలేని స్థితిలో తానై పూనుకొని దీనికి పరిశోధనాత్మకమైన పీఠికను వెలయించిన మా పెద్దమ్మాయికి నా ఆశీస్సులు.

చదువరుల కీకావ్యము సమగ్రమైనదిగనే భాసించవచ్చును. కాని నా దృష్టిలో మాత్రమిది సమగ్రము గాదు. దీని కింకొక ఖండము (బాలకేళీ ఖండము) చేరవలసియున్నది. అది వ్రాయుట కొంచము సాగి నిలిచి పోయినది. దానిని పూర్తి చేయగలిగినచో ధన్యుడనే!

నాయని సుబ్బారావు

# పీఠిక

మా నాన్నగారి జన్మభూమి పొదిలె చాలా ప్రాచీనమైన ఊరు. దీనికి పృథుల అనే సంస్కృతీకరణ నామం ఉంది. కాని 'పొదిలె' ద్రావిడ మూలం కలదిగా కనిపిస్తుంది. 'పొదుళ్' అనే ద్రావిడ ధాతువుకు - పెద్ద, గొప్ప, క్రిక్కిరిసిన, చిక్కని అభివృద్ధి చెందే అనే అర్థచ్ఛాయలు చాలా ఉన్నయ్.[1] ఇందులో ఏ అర్థమైనా స్థలవాచకమైన 'ఇల్' అన్న దానికి విశేషణంగా ఉండవచ్చు. ఈ అభిప్రాయానికి ఉపబలకంగా, తమిళ దేశంలో 'పొదియల్ కొండ' అనే శబ్దం, స్థలసూచకమై, 'సంఘ' సాహిత్యంలో ప్రసక్తమై ఉంది. దక్షిణ దేశం మీదికి మౌర్యులు దండెత్తిరాగా, వారి రథచక్ర ఘట్టనచే పొదియల్ కొండ సంకులమై ఉన్నట్లుగా ఇక్కడ వర్ణింపబడ్డది. అదే సంఘ సాహిత్యంలో మరొక చోట పొదియల్ యుద్ధరంగంగా వర్ణితమైంది.[2]

తన కన్న తల్లి వంటి జన్మభూమి పొదిలెను మిక్కిలి ఆప్తితో వర్ణించి, తద్గతమైన భావగాఢతకు అమరమైన రూపకల్పన చేసి, కవి ధన్యత్వాన్ని చెందారు. ఆయన అలంకరించగా ప్రకృతి నైపథ్య రచనానుషంగ రమణీయ రూపిణియైన పొదిలె, తనకున్న చారిత్రక మహత్వంచేత పరమోదాత్తయై, చిద్విలాసయై, సహృదయ హృదయారామాల్లో, నృత్య సుందరంగా చిందులు తొక్కింది. రసజ్ఞుల గుండె ఝల్లుగా, కవిత్వపు జల్లు కురిపించింది.

ఈ కావ్యాన్ని తీర్చిన తీరులో ఒక క్రమం, పూసలలో దారం మాదిరి అంతర్నిహితంగా ఉన్నది. తన జన్మభూమిని చెప్పదలచుకున్న కవి, తన జన్మనూ, బాల్యాన్నీ, తనవంశాన్నీ కావ్యగత కథా వస్తువుతో ఐక్యాన్ని సంధిస్తూ వివరించడం వల్ల వస్తువుకు, ఉదాత్తతా, వైపుల్యమూ, కలిగి, శోభాయమానం కాగలిగింది. ఈయన

---

[1] Dravidian Etytmological Dictionary (D.E.D) 3683; p.297

[2] Dr. S. Krishnaswamy Iyyengar- Ancient India and South Indian History & Culture. Vol. 1.

కావ్యపుత్రిక చిన్న చిన్న చేతులు చాస్తూ, కేరింతలు కొడుతూ దోగాడుతూ, తన పెద్దతండ్రి ఒడిలోకి పాకజూచిన కారణాన ఆ పాపను రెండు చేతులా ఎత్తుకుని ఎదకు హత్తుకున్న కవి అన్నగారి జీవిత క్రమం కూడా, కవి బాల్యంతో, వంశ కథనంతో కలగలిసి, కావ్య వస్తువుకు మరింత ఔచిత్య సంపాదన చేసిపెట్టింది.

అవతారికలో నాయని వంశోద్భవ వృత్తాంతం, అన్నదమ్ముల ఒద్దిక వారి బాల్య జీవనోదంతం, స్వోత్కర్షకూ, అతిశయలక్షణానికీ చోటు ఇవ్వని పద్ధతిలో, సహజ రమణీయంగా సాగింది.

మొదటి ఖండమైన ప్రకృతి ఖండం, పొదిలె నైసర్గిక స్థితిని వర్ణించిన కళాఖండం. అక్కడ చుట్టుపక్కల పారే, ముసి మొదలైన తొందరకత్తెలైన సెలయేళ్ళు, మెట్టసాగు, ఆకుతోటలు, నాగజెముడు కంచెలు, వాగులు, జంగాలు- ఒకటనేమిటి, తెలుగు సీమలోని ఏ గ్రామాన్నయినా సమృద్ధం చేసే ప్రకృతి సంపదంతా, పక్కున నవ్వుతూ, పులకరింతలు కలిగిస్తుంది. హరివంశ కావ్యరచనా పరిణత ప్రజ్ఞుడైన ఎఱ్ఱయామాత్యుడు, ఎనలేని సంతోషం చేత విప్పారిన వదన కమలంతో, ఇక్కడ అడుగడుగునా, పరితలను కవ్విస్తూ వారితో దోబూచులాడుకుంటున్నట్లు అనిపిస్తుంది, నాకు.

తరువాతి నాలుగు ఖండాలలోని కథలకూ, పొదిలె సీమ దండ కవిలె, పొదిలెను గురించి స్థానికులు పరంపరగా చెప్పుకునే స్థల మహత్త్వపు గాథలూ, ముఖ్యాధారాలు.

ఇప్పుడు లభ్యమయ్యే పొదిలె సీమ దండ కవిలె, శా।। శ।। 1609 (1687 AD)న, అంతకు ముందు రెండు వందల యేండ్లుగా ఉన్న కవిలెను చూచి, ఎల్లమరాజు ముద్దప్ప అనే కరణం వ్రాసుకున్న నకలు, కవిలె కథనం ప్రకారం, పొదిలె సీమలోని గ్రామాలకు ఆయకట్టు గుడికట్టు హద్దులు రమారమి అంతకు వెయ్యి సంవత్సరాలముందు నిర్ణయమైఉన్నవి. మొదటినుండి పొదిలెను పాలించిన ప్రభుపరంపర అందులో ఈ విధంగా కనిపిస్తుంది.

> "కలియుగ ప్రవేశం ప్రభవ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి ఘుడియలు పన్నెండు మీద ఆయెనుగనుక, పాండవులు కలిప్రవేశం ఆయెనని పరీక్షిత్తును పట్నంగట్టి వనవాస గతులైరి. ఆయన కుమారుండు జనమేజయుండు నాలుగు వందల యేండ్లు ఏలెను. భల్లాణుడు, శూద్రక మహారాజు, విష్ణువర్ధనుడు, చంద్రగుప్త మహారాజు, నాలుగు వందల అరవైయేండ్లు ఏలెను.(రి?) ఈయన కుమారుడు విక్రమార్కుడు రెండు వేల యేండ్లు ఏలెను. శాలివాహనుడు ఇరవై అయిదేండ్లు ధర పాలించెను. ఆ వెనుక భోజరాజు 108 యేండ్లు, కడవారు ఆర్గురు 2496

యేండ్లు ఏలిరి. మాధవవర్మ, కోటసకేతనుడు, ముకుందరాయలు, తిరుకాముడు, కరికాలచోడుడు మయిలం భీముడు, చోడెగంగాధరుడు, గుండప నరేంద్రుడు, రామదేవరాయలు, జయదేవుడు, కాకతి రుద్రుడు, వోరుగంటి మంకట్ని, ప్రతాపరుద్రుడు, అనవేమారెడ్డి, అను పదునలుగురు వెయ్యేండ్లు ఏలిరి" -

ఈ పట్టికలో సూచింపబడ్డ కాలానికీ, వ్యక్తులకూ, ఏదో ఒక సంబంధాన్ని సాధించడం కానిపని ఇందులో ప్రసిద్ధనామాలు కొన్ని ఉన్నా వాటికి, అందులో పేర్కొబడ్డ వరుసలో స్థిరమూ సముచితమూ అయిన స్థానం లేదు. సాధారణంగా, ఏ గ్రామానికి సంబంధించిన కవిలెలోనైనా రాజవంశానుక్రమణికకు సంబంధించినంత వరకు మనకు దొరికేది ఇటువంటి తాడూ బొంగరం లేని చారిత్రక ఆధారాలే.

***శాసనాలూ, రాజకీయ చరిత్ర:-*** కాని కవిలెలో అక్కడక్కడ ఉటంకింపబడిన కొన్ని శాసనాధారాలవల్లా, ఆయా ప్రదేశాలలో దొరికే యితర శాసనాలవల్లా ఈ పొదిలె సీమకు సంబంధించిన ప్రాచీన రాజకీయ చరిత్రను రూపొందించడం కొంతరకూ సాధ్యంకావచ్చును. ఇందువల్ల సుస్పష్టమైన రూపం ఏర్పడినా, ఏర్పడకపోయినా, ఉన్నంతలో సత్యదూరంగాని స్వరూపం లభిస్తుంది.

ఈ దండ కవిలెలో పొదిలె ప్రాచీనతను చెప్తూ ఇది కృత త్రేతా ద్వాపరాలలో వరుసగా శివపురి, గణపాలపురం, హలాయుధపురం, అని పిలబవడినదనీ కలియుగంలో పొదిలె అనే నామాన్ని వహించిందనీ వ్రాయబడింది. ఈ కవిలెలో చరిత్రాంశాలూ, శాసనాల నకళ్ళూ చాల ఉన్నవి. ఈ సీమనేలిన రాజులు తాము చేసిన దానధర్మాలకూ, సంప్రోక్షణలకూ, తటాక ప్రతిష్ఠలకూ, ప్రతి కార్యానికీ శాసనాలు వేయించారు. పొదిలె రాజకీయ చరిత్ర, కవిలెలో ఉటంకింపబడిన విషయాన్ననుసరించి స్థూలంగా ఇలా వుంది. ఇక్కడ విజయ నగరాధీశులూ, సంబువరాయల వంశంవారూ పరిపాలన చేశారు. గజపతుల ప్రభామూ, గోల్కొండనవాబుల అధికారమూ, ప్రసరించింది. వెలుగోటి వంశస్థుల అధికారాన్ని కూడా పొదిలె సీమ చవిచూచింది. ఈ విధంగా కవిలెలో నియతమైన వివిధ రాజవంశస్థుల ప్రభుతను శాసనాధారాలుకూడా స్థిరపరుస్తున్నట్లు శాసన పరీక్షవలన తేలగలదు- వెనుకటి కాలాన కంభంసీమకు తొండమారయగుళ్ళు అనే ప్రతినామం ఉండేదనీ అప్పుడు నెల్లూరి సీమలోని కొన్ని భాగాలు ఈ "తొండమారయగుళ్ళు" సీమలోనివిగా పేర్కొనబడేవనీ పొదిలె సీమ దండ కవిలె చెప్తున్నది. ఈ సీమలో ఏ గ్రామాన్ని గురించి చెప్పవలసినా ముందిలా ఉంటుంది- "మూగచింతల సముదు పెదారికట్ల పరగణీ మహల్ పొదిలె సర్కారు ఖమ్మం"- దీనిని బట్టి మొగలాయీల పాలనలో కూడా పొదిలె ఖంబం సర్కారులోనే అంతర్భాగంగా కనిపిస్తుంది.

పొదిలె కమ్మనాటిలోనిది. మొత్తం కమ్మనాడులో 2-16 శతాబ్దాల నడుమ

నడిచిన రాజకీయ చరిత్రను సమీక్షించగలిగితే పొదిలె రాజకీయ చరిత్ర కూడా అంతర్గతంగా అందులోనే ప్రత్యక్షం కాగలదు.

కమ్మనాటిలో, చాళుక్యులు, చోళులు, తెలుగుచోడులు, పొత్తపిచోడులు, కాకతీయులు, రెడ్లు, గజపతులు, గోల్కొండ సుల్తానులు, విజయనగరరాజులు, వెలుగోటి వంశస్థులు, తమ అధికారం నెరపగలిగారన్నది ఈ సీమలోని శాసనాలవల్ల స్పష్టమవుతున్నది.

కమ్మనాడు అనగా నెల్లూరు, ఉదయగిరి, ఒంగోలు, కందుకూరు, పొదిలె మొదలైన విషయాలను పొదుపుకున్న ప్రదేశం. ఇదంతా 7వ శతాబ్దం నుండి ఏక ఖండంగా, ఒక రాజకీయ విభాగంగా ప్రకటింపబడుతూ తరచుగా ఒక పరిపాలన క్రింద ప్రవర్తితమవుతున్న సీమ.

ఈ సీమలో లభించిన శాసనాలలో మంగి యువరాజు సోదరుడైన తూర్పు చాళుక్య ప్రభువిచ్చిన దాన శాసననం, మొదటిది. దీని కాలం ఏడవ శతాబ్ది ఉత్తరార్థం (664-680). అప్పుడు కమ్మ రాష్ట్రంలో ఉత్తర భాగం తూర్పు చాళుక్యుల వంశం కాగా, దక్షిణం చోళుల అధీనంలో ఉండేది. పొదిలె సీమలో చోళశాసనాలు కూడా కనిపిస్తున్నాయ్. అందులో ప్రముఖమైనది కులోత్తుంగ చోళుడిది. తరువాత వెలనాటి చోళులూ పొత్తపి చోళులూ కొన్ని శాసనాలు వెలయించారు. ఆపైన కాకతీయ గణపతి, వీర ప్రతాప రుద్రదేవుల పాలన ఈ రాష్ట్రంలో ప్రసరించినట్లుగా శాసనాధారాలున్నాయ్.

గణపతి దేవచక్రవర్తి శాసనాలు, విస్తారంగా, ఒంగోలు, పొదిలి, దర్శి తాలూకాలలో కనిపిస్తున్నాయ్. అలాగే ప్రతాపరుద్రదేవుడి పేర శాసనాలు, ఆత్మకూరు, దర్శి, కందుకూరు, కావలి, నెల్లూరు, ఒంగోలు, పొదిలి, ఉదయగిరి సీమల్లో విరివిగా కనిపిస్తున్నాయ్. నెల్లూరి సీమకు మరీ దక్షిణాన కాకతీయుల శాసనాలు లేకపోవడంవల్ల అక్కడ వారి అధికారం విరళంగా ఉండి ఉంటుందనుకోవచ్చు.

కాకతీయులకు సామంతులై ప్రభుత నెరపిన రాజులు చాలామంది ఈ సీమలో కనిపిస్తున్నారు. పొదిలె సీమ దండ కవిలెలో ఒక రామదేవరాయల ప్రసక్తి ఉన్నది (శా॥ శ॥ 1045-1123 A. D) శాసనాల్లో కాకతీయ సామంతుడైన రామదేవరాయల ప్రసక్తి గోచరమవుతున్నది.

కాకతీయుల తర్వాత అంత అధికంగా కమ్మనాట ప్రభుత్వం నెరపిన వారు విజయనగర రాజులు. ఆ రాజ్య స్థాపకుడైన మొదటి హరిహరుడి శాసనాలు ఈ ప్రాంతంలో దొరుకుతున్నాయ్. నెల్లూరి సీమలో కొంత భాగం విజయ నగర రాజ్యభాగంగా ఏర్పడినట్లు తార్కాణ చూపించవచ్చును. కంపరాయల కొడుకూ, బుక్కరాయల సోదరుడూ అయిన ప్రభువు నెల్లూరిని పరిపాలించినట్లుగా శాసనాధారం ఉంది.

రెండవ హరిహరరాయల కాలంలో ఉదయగిరి సీమ చుట్టుపట్ల ప్రదేశాలు విజయనగర రాజ్యంలో చేరి అవి కర్నాటక సీమలోనివిగానూ, అక్కడి తెలుగు భాష కర్నాటభాషగానూ, పేర్కొనబడటం జరిగింది. శ్రీనాథుఁడు, 'నాకవిత్వంబు నిజము కర్నాటభాష' అనడంలో 'కర్నాటభాష' అన్న వాడుకకు కర్ణాటాంధ్రమనేదే అర్థం. మొదటి దేవరాయల కుమారుడు రామచంద్రుడు యువరాజై ఉదయగిరికి ఆధిపత్యం వహించాడు. ఇతడే బహమనీ సుల్తాన్ ఫిరోజ్‌షాను తరిమివేసిన వీరుడు. ఆ తరువాత కమ్మనాటిని రెండో దేవరాయలు, విరూపాక్షరాయలు ఏలినట్లు నిదర్శనలున్నాయ్.

ప్రౌఢదేవరాయలు సామంతులలో ప్రముఖులు పొదిలె సీమను ఇన్నూరేండ్లపాటు మారుతోరణ పడకుండా రాజ్యంచేసిన సంబురాయల వంశస్థులు. కవిలెలో సంబువరాయలవారికి అహోబల నృసింహస్వామి ప్రత్యక్షమైన వృత్తాంతం ఉంది. స్వామి పొదిలె కొండమీదికి వేంచేసిన తరువాత సంబువరాయలు కేవలం గర్భగృహం మాత్రం కట్టించి ఒక కోనేరు త్రవ్వించాడట.

స్వామి నివేశనం పొదిలె సరిహద్దుల్లోనూ, ఆయనకని నిర్దేశించిన కోనే రు పొదిలెకు సమీపానఉన్న మట్టిపూడి పొలంలోనూ ఉన్నవి.[3] తరువాత జయ సంవత్సరం, భాద్రపద సోమవారంనాడు, మహర్నిశివేళ, మహాద్భుతమైన 'నేల అదురు' (భూకంపం) ఉరిమి' మహాదేవళాలు పడిపోయినవి. మల్లరథినీనాథుడు కట్టించిన చదలువాడ రఘునాథ నాయకుల దేవాలయం కూడా నేలమట్టమై అందులో చాలామంది హతమయ్యారు. అప్పుడు చదలవాడకు పూర్వాన నడిచే గుండ్లకమ్మ దక్షిణదిశగా తన గతిని మార్చుకోవలసి వచ్చింధి. సంబరాయలు కట్టించిన నరసింహస్వామి కోవెలకూడా దెబ్బతిన్నదో యేమో, స్వామికి పూజానైవేద్యాలు లేకుండా పోవడం జరిగింది. తరువాత కొంత కాలానికి పొదిలెలో ఉన్న కమ్మ కులస్థుడు కర్లపూడి వెంగన్న ఆలయ పునరుద్ధరణకు పూనుకొన్నాడు. స్వామికి, గాలిగోపురం, మంటపాలు, ఏర్పడ్డవి. కర్లపూడి వెంగన్న, స్వామికి పూజాదికాలు నెరవేరడానికి గొట్టిపాళ్ళ మాధవయ్య అనే పూజారిని కట్టడ చేశాడు. మట్టిపూడిలో, గోపాలస్వామి పూజారి పరాశరుని సంజీవి అనే భక్తుడు పొదిలె కొండ నృసింహస్వామికి చెందిన కోనేరు మట్టిపూడి పొలంలోది కాబట్టి, తమకు 'మిరాశి' కల దని ఊరి పెద్దల ముందు సవినయంగా మనవి చేసుకున్నాడు. పెద్దలు, రచ్చతీర్చి, న్యాయ విచారణ చేసి స్వామికి పూజా నైవేద్యాలు నెరపుటకు, పొదిలె నంబినీ, శఠకోప ప్రసాదాలు ఇచ్చుటకు మట్టిపూడి సంజీవినీ నియమించి తగువు తీర్చగలిగారు.[4] దండ

---

[3] గ్రామ దక్షిణాన కొండమీద నరసింహులు సంబరాయనికీ ప్రసన్నులయినారు. దేవళం పొదిలె పొలంలోనిది. కోనేరు మర్రిపూడి పొలంలోనిది.

[4] వారితో చెప్పుకుంటేను, దేవుండు ఉండే స్థళం, పొదిలెస్థళములోది గద, మిరాశి

కవిలెలో తెలుగు రాయల వంశావళి ఇట్లా ఉంది.




ఇక్కడ తెలుగు రాయలతో ఈ వంశ క్రమం ఆగిపోయింది. ఆ తర్వాత ఆ వంశీయుల ఉదంతం క్రీ|| శ|| 1425 నుండి 1543 వరకు గల కాలవ్యధిలో సింహాచలంవద్దా, పొదిలె సీమలోని, ఆంధ్రకొండ రామలింగస్వామి దేవాలయం వద్దా, తిప్పలిదేవి పల్లెలోనూ, బాపట్ల తాలూకా నూతల పాటిలోనూ, లభించిన శాసనాలలో దొరుకుతుంది.[5]

---

పొదిలె వారిదే అని కోనేరు మర్రిపూడి పొలంలోది అని సవుకర్యం పక్షం చేసిన వివరం, పూజా నైవేద్యాలు చేసేటందుక్కు పొదిలె నంబులున్ను శఠగోప ప్రసాదాలు మాత్రం ఇచ్చేటందుక్కు మర్రిపూడి సంజీవిని ఏర్పాటు చేసి (రి)- పొ. కవిలె.

[5] 1. 1425 A. D- సింహాచల శాసనం,

2. 1426 A,D- ఆంధ్రకొండ రామలింగస్వామి శాసనం.

3. 1438 A.D- తిప్పలదేవి శాసనం- తిప్పలదేవి పల్లె.

కవిలెనుబట్టి సంబురాయల కుమారుడు తెలుగురాయలు, అని స్పష్టమవుతున్నది. మనకు దొరికిన అన్ని శాసనాలనూ తైపారువేసి, తెలుగురాయల వంశక్రమాన్ని ఈ క్రిందివిధంగా నిర్ణయించడానికి వీలున్నది.




ఈ వంశానికీ, రెండవ విజయనగర నంశానికీ ఉన్న సంబంధాన్ని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు చర్చించి ఉన్నారు.(1Epigraphica Indica Vol. V11.p.74.)

---

4. 1442 A.D- నూతలపాడు (కుమార) తెలుగురాయని అధికారి చెరువు తవ్వించినప్పటి శాసనం
5. 1542 A.D- కుమార తెలుగురాయని కుమారుడు తిరుమల దేవయ్య శాసనాలు- నూతలపాడు. ఇవన్నీ నెల్లూరి జిల్లా శాసన సంపుటిలో లభిస్తయ్.
6. 1543 A.D.)

ఈ సంబువరాయులు గజపతుల సంబంధులని (సామంతులు) కవిలెలో పేర్కొనబడ్డది.[6] వారికి గజపతులతో ఉన్న సామంతత్వాన్ని, నిర్ధారించవలసి ఉన్నది. - ఇంతేకాక మైసూరులోని 'తేకలి' అనే ప్రదేశంలో దొరికిన ఒక శాసనం, ఒక సంబురాయల్ని పేర్కొంటూ అతణ్ణి స్థాపించినవాడు గోపరాజని చెప్తున్నది.[7] ఆ సంబంధాన్ని విచారించవలసి ఉన్నది. మరొక చోట 'ఏడైవీడు' అనే ప్రదేశానికి చెందిన సంబువరాయ వంశస్తులు మూడవ భల్లాణుని సామంతులుగా ఉన్నట్లు విదిత మౌతున్నది.[8] ఈ విషయాలన్నీ జిజ్ఞాసువులైన చరిత్ర పరిశోధకులు చర్చించి తేల్చవలసినవి-

మరో ముఖ్యవిషయం. శ్రీనాథుని ' సాంపరాయని తెనుంగాధీశుడూ, మొదటి తెలుగురాయలూ ఒకరేమో స్థాపింపవలసియున్నది.

1424లో కొండవీటి రెడ్డిరాజ్యంలో కల్లోలాలు తలెత్తినవి. రాజమహేంద్రవరపు రెడ్లకు తోడుగా ప్రౌఢదేవరాయలు తెలుగురాయని .గజపతుల మీదికి పంపి ఉంటాడని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారూ, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారూ అభిప్రాయపడ్డారు. అప్పుడే సింహాచలంలో తెలుగురాయల (I) శాసనం వెలియడానికి అవకాశం కలిగిందని వారి ఊహ. ఈ తెలుగురాయలు చిన సంబురాయల కుమారుడైన రెండవ తెలుగురాయలు అనడానికి ఆస్కారం ఉన్నదా, లేక ఇతడు పెదరాయ విభాళుని అన్నగారూ, చిన సంబురాయల పెద తండ్రీ అయిన గుండ భూపగోవింద తెలుంగు రాయలేశుడా? (తిప్పలి దేవిపల్లె శాసనం) ఆలోచించవలసి ఉన్నది.

కస్తూరి కోసం శ్రీనాథుడు ప్రస్తుతించిన తెలుగురాయలెవరు? పెదకోమటి వేమారెడ్డి క్రీ.శ. 1420 లో కాలధర్మం చెందగా, తర్వాత 3,4 సంవత్సరాలకే కొండవీటి రాజ్యం కూలిపోయింది. ఆసమయంలో అనగా 1419-16 సంవత్సరాల మధ్య కర్ణాటక, సామ్రాజ్యాన్ని ఏలినరాజు ప్రౌఢదేవరాయలు. ఈయన కర్ణాటాంధ్ర సంస్కృతాది భాషాపోషకుడూ, అభిమానీ కాబట్టే కొండవీటి రెడ్ల ఆశ్రయాన్ని కోల్పోయిన శ్రీనాథుడు ఈయన ఆస్థానంలో మన్ననలందుకోగలిగాడు. అంతేగాక, ప్రౌఢదేవరాయల ఆస్థానం వైపుకు శ్రీనాథుడు ఆకృష్టుడు కావడానికి మరో కారణం

---

6 గజపతివారి సంబందులు నంబుపాయనివారు తెలుగురాయండు మొదలుగా ఇన్నూరేండ్లు మారుతోరణ పడకుండా సీమ చేస్తున్ను వుండిరి-కవిలె.

7 Epigraphica Carnatica- Vol. I, P.208.

8 తెలంగాణా రాజ్య పర్యవేక్షకుడు మల్లక్ మక్బూల్ నోడించిన, కాపయ నాయకుడూ, మూడవ భల్లాణుడూ కలిసి, ముస్లిం ప్రాతినిధ్యాన్ని కూలద్రోసి సంబువరాయల పరిపాలనను తొండైమండలంలో ప్రతిష్ఠించినట్లు చరిత్ర చెప్తున్నది.

తెలుగురాయలు. తెలుగురాయలకూ శ్రీనాథునికీ బాల్య పరిచయం ఉన్నట్లుగా కనిపిస్తుంది. శ్రీనాథుని దృష్టిలో అవచి తిప్పయసెట్టి ఎట్టివాడో, మొదటి తెలుగురాయలూ అట్టివాడే. ఈ బాల్యసఖ్యం, ఆయనను, తెలుగురాయల ప్రభునైన ప్రౌఢదేవరాయల ఆస్థానం వైపుకు దృష్టి మళ్ళించడానికి దోహదం చేసింది. ఈ విషయాన్ని పటిష్ఠంగా స్థాపించడానికి ఇక్కడ కొంత చర్చకు తావివ్వడం, అప్రస్తుతం కాదు. ఈ జన్మభూమి కృతినందుకున్న మాపెదనాన్నగారు, నాయని నరసింహారావుగారు, ఆంధ్రసాహిత్యాన్ని అమూలాగ్రంగా పారణచేసిన పండితులు. ఆయన తిక్కన రచిత భారతానికి వ్యాఖ్యానం చెబుతుంటే ఏ సభ అయినా పరవశమై వినేది. కేవలం తెలియనితనంవల్ల కొందరిముఖాన కొన్ని తెలుగు పదాలు ఎటువంటి అవరూపాలను పొందుతున్నాయో ఆయన వివరిస్తుంటే సభ విస్మయచకితమై వినేది. తెలుగు కవుల జన్మస్థానాలను గురించి పుట్టుపూర్వోత్తరాలను గురించీ ఆంధ్రసాహితీరంగంలో ఉన్న వాదప్రతివాదా లన్నిటితోటి ఆయనకు క్షుణ్ణంగా పరిచయం ఉన్నది. శ్రీనాథుని జన్మస్థానాన్ని గురించి పలువురు పండితులు చేసిన చర్చలకు భిన్నంగా ఆయన ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. శ్రీనాథుడు తనతాత అధికారం నెరపిన "వారిధితటి కాల్పట్టణా" న్ని పేర్కొన్నాడు. ఈ కాల్పట్టణాన్ని కందుకూరివారు కొత్తపట్టణమనీ, చిలుకూరి వీరభద్రరావుగారు కృష్ణాపట్టణమనీ, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కాశీపట్టణమో, కలపటమో అనీ వేరువేరు తీరులుగా ప్రతిపాదించారు. మా పెదనాన్నగారు అందుకు భిన్నంగా కాల్పట్టణాన్ని, ఒంగోలుకు తూర్పుగా సుమారు పదిమైళ్ళ దూరంలో సముద్రతీరాన ఉన్న 'పాదర్తి' గా నిర్ణయించారు. దీనికి దక్షిణపు సరిహద్దే శ్రీ వీరేశలింగం పంతులుగారు ప్రతిపాదించిన కొత్తపట్టణం. పాదర్తికి చాలా ప్రాచీన చరిత్ర ఉంది. ఇక్కడ ఉండే వ్యాపారకుటుంబాలవారు, చీనా, సింహళం, తవాయి మొదలైన ద్వీపాలలో వాణిజ్యం నెరిపేవారట. వెనుకటికాలాన, ఆ ఊర అటువంటి కుటుంబాలు దాదాపు 800 వరకూ ఉండేవట. 18వ శతాబ్ది మధ్యభాగాన (1750-ఆప్రాంతాలు) అక్కడ ఉండే బలిజనాయకుల ఒత్తిడి అధికంకాగా, దాన్ని సహించలేక, ఆ కుటుంబాలన్నీ స్వగ్రామాన్ని విడిచిపెట్టవలసి వచ్చిందట. కొందరు, దక్షిణదేశపు రేవుపట్టణాలను చేరుకొని స్థిరపడడం జరిగిందట. (ఇప్పటికి తమిళసీమలో ఉన్న చెట్టియార్ల కుటుంబాలతో సంబంధం ఉన్నవాళ్లు చాలామంది కొత్తపట్నంలో కనిపిస్తుండడం, ఈ అంశాన్ని నిర్ధారిస్తుంది.) మరికొందరు, ఆకాలాన (1750. A.D.) ఏలికైన మందపాటి రామచంద్రరాజుగారి ప్రాపున, వారిపాలనలో ఉన్న, అల్లూరు పొలిమేరలో, ఒక పట్టణాన్ని నిర్మించుకుని తమ వ్యాపారాన్ని యథాముఖంగా సాగిస్తుండేవారట. ఆ పట్టణమే కొత్తపట్టణం. ఈ విషయం పాదర్తి, కొత్తపట్టణాలకు సంబంధించిన స్థానికమైన రికార్డులు పరిశీలిస్తే స్పష్టమవుతుంది. దీని జన్మం 18వ శతాబ్దం కాబట్టి, ఇది శ్రీనాథుని జన్మస్థానం కావడానికి వీలుకుదరదు. అందువల్ల శ్రీనాథుడు పేర్కొన్నది 'కాల్పట్టణమే' ( పాదర్తి ) కాని, 'క్రాల్ పట్టణం' (కొత్తపట్టణం) కాదు.

ఇంతకూ ఈ కొత్తపట్టణానికీ, పాదర్తిలో చేరిన రంగరాయపాలెమునకూ, మధ్య ఒక బజారు మాత్రమే అడ్డంగా ఉంది, ఈ గ్రామనామంలో ఉన్న 'పాద' శబ్దం శ్రీనాథుని కాల్పట్టణంలోని 'కాలు' శబ్దానికి సమానార్థకం అని, మా పెదనాన్నగారి, సోపపత్తికమైన అభిప్రాయం. ఇందుకు ఆయన చూపించిన ఉపపత్తులు కొన్ని చాలా బలమైనవి. అందులో ఒకటిగా, తెలుగురాయలకూ, శ్రీనాథునికీ ఉన్న అనుబంధాన్ని నిర్ధారించడం జరిగింది. అది ప్రసక్త విషయానికి సంబంధించిది కాబట్టి, దాన్ని విడమర్చి చెప్పడం భావ్యం అనుకుంటున్నాను.

కర్ణాటరాజప్రతినిధిగా, తెలుగురాయలు పొదిలె సీమను పరిపాలించిన సామంతుడు. అందువల్ల ఒంగోలు, పొదిలె, కందుకూరు వరకు ఉన్న తూర్పుసముద్ర తీరస్థ దేశమంతా, పాకనాడు, పాకినాడు అని వ్యవహరింపబడేది. గుండికానదికి (గుండ్లకమ్మ) ఇరువైపులా పశ్చిమాన శ్రీపర్వతం మొదలు తూర్పు సముద్రం వరకూ వ్యాపించి ఉన్న దేశాన్ని పూగినాడుగా వ్యవహరించేవారని, ప్రోలయ వేమారెడ్డి మల్లవరపు శాసనం తెలియజేస్తున్నది. పాకనాడన్నది, పూగినాడు అంతర్భాగంగా ఉన్న పెద్దమండల మని కొందరి అభిప్రాయం. పూగినాడే పాకనాడని మరికొందరి అభిప్రాయం. ఏది ఏమైనా, కావలి, కందుకూరి, ఒంగోలు, పొదిలె తాలూకాలు కల సీమ పాకనాడుగా పరిగణింపబడేదన్న విషయం నిస్సంశయమైనది. శ్రీనాథుడు ఈ పాకనాటికి చెందినవాడు.[9] అందులోని గ్రామమైన పాదర్తిని జన్మస్థలంగా కలగినవాడు- మరోవిషయం:- "నా కవిత్వంబు నిజము కర్నాటభాష"- అన్న శ్రీనాథుని వాక్కును ఆధారంగా చేసుకొని, ఆయన కన్నడిగుడని నిర్ధారించినవారున్నారు. అనగా కన్నడ భాషాప్రాంతమైన పశ్చిమసముద్రతీరంలోని దక్షిణ కనరా జిల్లాకు చెందిన ఒక గ్రామం శ్రీనాథుని జన్మస్థానమనికూడా సిద్ధాంతీకరించారు. ఇక్కడ కర్నాటభాష అన్నా కర్నాటదేశమన్నా గ్రహించవలసిన అర్థాలు వేరు. కర్నాటదేశమనగా, కర్నాట ప్రభువులగు విజయనగరాధీశులకు లోబడి ఉన్న దేశమనీ, కర్నాటభాష అనగా, వేంగినాడులోని (రాజమహేంద్రవరసీమ) స్వచ్ఛమైన తెలుగు భాషకు భిన్నంగా, అక్కడి పండితుల చిన్న చూపులకు లోనవుతూ వచ్చిన పాకనాటి సీమయందు ప్రవర్తితమయ్యే తెలుగు భాష అనీ అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది. కర్ణాటాధీశుల అధీనంలో ఉండడంవల్ల, ఆసీమలోని భాష కావేర్పాటు కలగడమూ, ఆపేరు నిలవడమూ సమంజసమే[10] ఈ చిన్నచూపువల్ల రెచ్చిపోయిన శ్రీనాథుడు,

---

[9] "పాకనాటింటి వాడవు బాంధవుడవు. కమలనాభుని పౌత్రుడవమలమతివి".

[10] సర్కారాంధ్రుల దృష్టిలో, నిజాము రాష్ట్రంలోని తెలుగు, "తౌరక్యాంధ్రగా" నిలవడం సరిగా ఇటువంటిదే..

"ఎవరేమన్న నంద్రు నాకేమి కొఱఁత నాకవిత్వంబు నిజము కర్ణాటభాష"- అని అనుకోవలసిన అవసరం వచ్చిఉంటుంది.

ఇంతకూ, తెలుగురాయలూ శ్రీనాథుడూ ఒకే సీమకు చెందినవారవడంవల్లా, ఒకేవయస్సువారవడంవల్లా, వారిద్దరిమధ్యా బాల్యమిత్రత్వం ఉండిఉండవచ్చుననే ఊహకు ఆస్కారం ఉంది. శ్రీనాథుడు తన బాల్యసుఖుడైన అవచి తిప్పయను సంబోధించినట్లే ప్రభువైన తెలుగురాయనికూడా సంబోధించగలిగాడు. ఆ సంబోధన చూస్తే, ఒక కవి పద భ్రష్టుడై, రాజుల్ని వెతుక్కుంటూ వచ్చి వచ్చి, చివరకు అంతకుముందు పరిచితుడుకాని రాజు ఆస్థానంలో ప్రవేశాన్ని సంపాదించి, అతణ్ణి సంబోధిస్తున్నట్లుగా కనిపించదు.[11]

శ్రీనాథుడు తన బాల్యమిత్రుడైన అవచి తిప్పయను సంబోధించినపుడు కూడా, ఇదే ధోరణిని అవలంబించినట్లు కనిపిస్తుంది.[12] కవిసార్వభౌముడు తనకు కొత్తవారైన ప్రౌఢదేవరాయులనుగాని, పెదకోమటి వేమారెడ్డిని గాని సంబోధించినప్పుడు, ఇందుకు భిన్నమైన ధోరణి కనిపిస్తుంది.[13] ఈసంబోధనలను పోలిస్తే తెలుగురాయలకూ శ్రీనాథునికీ ఉన్న సన్నిహితత్వం తెలుస్తుంది. ఇది పొదిలె సీమనేలిన సాంపరాయని తెనుంగాధీశుడికీ, శ్రీనాథుడికీ మధ్యనున్న సాన్నిహిత్యాన్ని, సంబంధాన్ని, సూచించడానికి చేసిన ప్రసంగం.

శ్రీనాథ విరచితమైన పల్నాటివీర చరిత్రలో పొదిలెరాజుల ప్రసక్తి కనిపిస్తుంది. నలగాముడు యుద్ధసన్నాహాలను చేసుకుంటూ నానాదేశాధీశులనూ తనకు సహాయులుగా రమ్మని వ్రాసి పంపించే సందర్భంలో, పొదిలె రాజులకు కూడా లేఖలు పంపడం కనిపిస్తుంది.[14] పొదిలె ప్రసక్తి ఇక్కడ కనిపించడం చేత, పల్నాటి

---

11 a. "కర్ణాటాంధ్రాదిప సాంపరాయని తెనుంగా నీకు బ్రహ్మాయువౌ".
b. "ఆక్షయ్యంబుగ సాంపరాయని తెనుంగాధీశ కస్తూరికా బిక్షాదానము సేయరా!"

12 ఖుసిమీరన్ సురతాణి నిండుకొలువై కూర్చున్నచో నీకరాభ్యసనంబున్ నుతియించురా, అవచితిప్పా!'.

13 జననాథోత్తమ దేవరాయనృపతీ చక్రేశ శ్రీవత్సలాం
ఛన సంకాశ మహాప్రభావ హరిరక్షాదక్ష నాబోటికన్
కునృపస్తోత్ర సముద్భవం బయిన వాగ్దోషంబు శాంతంబుగా
కనకస్నానము చేసిగాక పొగడంగా శక్యమే దేవరన్.

14 కపట కంఠీరవాకార నారాయ క్ష్వేళా నినాదంబు గేలిసేయు / కల్పాంత దుర్దాంత కాల భైరవ రీతి ఢమరుకోన్మాదం బడంగ జేయ / ప్రళయ కాలాభీల పటుఘోర నిర్ఘాత పటు పుటారంబు జటిలపరచు / కుహనా మహాకాళ కోలాహలోత్తాల పాతాళ

యుద్ధకాలానికి పొదిలెరాజులు ప్రసిద్ధులైనవారని అనుకోడానికి ఆస్కారం ఉంది. లేదా, శ్రీనాథునికి పొదిలె సీమతో ఉన్న సంబంధంవలన సంబువరాయ వంశస్థుడైన తెలుగురాయలతోగల అనుబంధంవలన, నలగాముడు పిలిచే అందరిరాజులతోపాటు "పొదిలెరాజుల" జ్ఞాపకం మదిలో మెదిలి, ఆ పట్టికలో వారిని చేర్చాడనైనా అనుకోవచ్చును.

తర్వాత దాదాపు యాభై యేండ్లపాటు ఈ సీమలో శాసన ప్రాకట్యం సన్నగిల్లినట్లు కనిపిస్తుంది. తర్వాత శ్రీకృష్ణదేవరాయల ప్రభుత ఈ సీమపై ప్రవర్తించడంతో మళ్ళీ మనకిక్కడ కుప్పతిప్పలుగా శాసనాలు కనిపిస్తాయి. రాయలు ప్రతాపరుద్రగజపతిని జయించి కొండవీటిని స్వాధీనం చేసుకోవడం, గజపతి పినతండ్రి అయిన కాంతరాయల్ని ఓడించి ఉదయగిరి దుర్గాన్ని పట్టుకోవడం, తెల్లమవుతుంది. ఉదయగిరిసీమ మొదట, మొదటితరపు విజయనగరాధీశుల చేతుల్లో ఉండి ఆపైన గజపతుల ఆధీనంలోనికి వెళ్ళింది. మళ్ళీ దాన్ని రాయలు చేజిక్కించుకోగలిగాడు. ఈ ఉదంతం కవిలెలోకూడా పేర్కొనబడ్డది.[15] ఉదయగిరి మొత్తం కమ్మనాటికంతటికీ రాజధాని ఇది శ్రీకృష్ణదేవరాయ రాజ్యానికి ముఖ్యమైన కోట.

ఉదయగిరిలో, రాయలకు ప్రాతినిధ్యం వహించి పాలించిన అధికారులలో ఎన్నదగ్గవాడు రాయసం కొండమరుసయ్య. ఈయన, పొదిలెసీమకు స్థలకరిణీకాన్ని నడిపిన పెమ్మయ సింగధీమణి వంశానికి చెందినవాడని కవిలెలో ఉటంకింపబడింది. ఇతనిపేర దాదాపు 18 శాసనాలు ఉదయగిరి, ఆత్మకూరు, కందుకూరు, కనిగిరి, పొదిలి, రావూరులలో కనిపిస్తున్నయ్. ఇవన్నీ ఉదయగిరి కేంద్రంగా కలిగి రాయల ఆధీనంలోనికి వచ్చిన ప్రాంతాలే. కొండమరుసయ్య ఉదయగిరిలో రాజవ్యవహారాలు నడిపిన మొదటి రాజప్రతినిధి. ఈయన కృష్ణదేవరాయల 'కార్యకర్తగా'

---

నినదంబు భంగపరచు/ గండుమెరసినరిపుకోటి గుండెలవియ చండగతి మ్రోయు నీరణోద్దండ భేరి/ జయరమాసంగ రాయవేశ్యాభుజంగ/ అతులబలధామ పెదకోమటన్నవేమ!).

ఏడు మాడెములేలు ఎరుకు కామునికి పొన్నాళ్ళ భూపతి పొదిలెరాజులకు కటకాధిపతికిని కల్వరాయునికి.......... వ్రాయించిపంపిన--" - పల్నాటి వీర చరిత్ర. P.26

[15] కృష్ణరాయలుగారు శా|| శ|| అగు నేటి భావ సంవత్సరాన, అనేక దళాలు కూర్చుకొని పొట్లూరి సింహాద్రి పర్యంతం పోయి జయస్తంభం వేయించి, గజపతివారి రాజ్యం కట్టుకొని విద్యానగరం తిరిగి వస్తున్న ఉదయగిరి కట్టుకుని రాజ్యం ఆక్రమణ చేసి రాజ్యం చేస్తూ ఉండిరి. - పొదిలెదండకవిలె.

పేర్కొనబడ్డాడు. ఈయన పొదిలెలోని భీమేశ్వరస్వామికి కలిపి ఉమ్మడిగా, పొదిలెకు తూర్పున ఉన్న చిలమకూరు అగ్రహారాన్ని 1515. A. D. లో దానం చేసినట్లుగా ఉన్నది.[16]

మరొకటి పొదిలెలోని దూడల మల్లికార్జున స్వామికి అంగరంగ వైభవాలకై కిరళ్ళపల్లి అనే గ్రామాన్ని సర్వాగ్రాంతగా ధారాదత్తం చేసినట్లు రాయసం కొండమరుసయ్య పేర కనిపిస్తున్నది.[17] కవిలెలో లేకపోయినా శాసనాలు పరిశీలిస్తే సదాశివరాయల పరిపాలనా కాలంలో, ఆయనకు ప్రతినిధిగా ' జిల్లెళ్ళ రంగపతిదేవ మహారాజు" - పొదిలెసీమను పాలించినట్లు తెల్లమవుతున్నది. ఆయన శాసనాలు A.D.1551, A.D. 1547, లలో కనిపిస్తున్నవి.[18](

తరువాత పొదిలె పాలకులలో చెప్పుగోదగ్గవారు వెలుగోటి వంశస్థులైన వెం క టగిరి సంస్థానాధీశులు. వీరికి మూడవ విజయనగర రాజవంశంతో ధృఢమైన

---

16 "స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా।।శ।। వర్షంబులు 1437 అగు నేటి భావ సంవత్సర శ్రావణ బహుళ 30 అగు అందు సూర్యగ్రహణ పుణ్యకాలమందు, వీరప్రతాప శ్రీకృష్ణదేవరాయలకు పుణ్యంగాను , రాయసం కొండమరుసయ్యగారు పొదిలె భీమేశ్వర మహాదేవునికిన్ని కైలాస, (నాథ) మహాదేవునికిన్ని ఇచ్చిన ధర్మశాసనము-- పూర్వాన దేవళ్ళ కిద్దరికిన్ని చెల్లేటి పొదిలె సీమలోని తూర్పు ముసికి పడమటిగడ్డ చిలమకూరి గ్రామము సర్వాగ్రాంతముగాను దేవళ్ళకు ఇద్దరికిన్ని అంగరంగ వైభవాలకున్ను భీమేశ్వర దేవునికి నాలుగు పాళ్ళున్ను అరా న్ను (4 ½) కైలాసనాథునికి రెండు పాళ్ళున్ను అరాన్ను (2 ½) నడిచితిమిగాను పూర్వం సాగించిఇస్తిమి."

Nellore Dist. Inscriptions-

17 స్వస్తిశ్రీ శకవరుషంబులు 1437 అగునేంటి యువసంవత్సర మాఘ శు. 15 సోమ, సోమగ్రహణ పుణ్యకాలమందు...... శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణదేవ మహారాయలు రాయసం కొండ మరుసయ్యంగారు, పొదిలెదూడల మల్లిఖార్జుని కిచ్చిన ధర్మశాసనం-- పూర్వాన దేవునికిం జెల్లి గ్రామము పొదిలెసీమలో ముసికి దక్షిణపు గడ్డ కిరళ్ళపల్లి గ్రామము సర్వాగ్రాంతముగాను అంగరంగ వైభవాలకును నడిచియట్లుగాను పూర్వం సాగించి యిస్తిమి-

18 నెల్లూరుజిల్లా శాసనములు- (i) పొదిలె (24) కాశీపురం తెలుగు--వేణుగోపాలస్వామి దేవాలయ శిల మీద.(ii) పొదిలె (35) A.D. 1547-48. ఆంజనేయస్వామి దేవాలయంలో.

సంబంధం ఉన్నది. గోల్కొండ సుల్తానులలో కొంతకాలం వైరమూ కొంతకాలం సామంతత్వమూ ఉండేది. వీరిలో తిమ్మానాయని మనుమడు రేచర్ల చినతిమ్మానాయుడు, పొదిలె సీమలో బ్రాహ్మణులకు అగ్రహారాలు దానం చేసినట్లుగా శాసనాధారాలు లభిస్తున్నవి.[19]. ఈ వంశానికే చెందిన కుమార యాచమ నేడు, కర్ణాటకాధీశ్వరులలో చివరి వాడైన మూడవ రంగరాయల కాలంవాడు.

శ్రీరంగరాయల పాలనలో ఉన్న ఉదయగిరి కోటను పట్టుకోవడానికి గోల్కొండ సుల్తాను సేనలు పంపించాడు. శ్రీరంగరాయలకు, బిజాపురం సుల్తాను సహాయంగా, రాయలతరఫున వెలుగోటి సింగన పోరాడి, గోల్కొండసేనల్ని తిప్పికొట్టడం జరిగింది.

తరువాత రాజకీయం చకచకా రంగులు మార్చుకున్నది. ఎడతెగని మహమ్మదీయ దండయాత్రలవలనా, తన సామంతుల్లో చాలా మంది తన పక్షం చేరడం వలనా, శ్రీరంగరాయలు పెనుగొండను వదలి, మైసూరులోని, తన సామంతుడైన చెప్పనాయకుని అండన తలదాచుకోవలసి వచ్చింది. అప్పుడు రాయలపక్షంనుండి తిరిగిపోయిన వారిలో కుమార యాచమనేడు కూడా ఒకడు. అతడు గోల్కొండ ప్రభుత్వాన్ని ఆమోదించి, అప్పటి సుల్తాను అబుల్ హసను పంపిన సేనను పెనుగొండ మీదికి నడిపించాడు.[20] ఈవిధంగా మహమ్మదీయుల అధికార ప్రాబల్యమూ, దండయాత్రలూ, కమ్మనాడులో కూడా కనిపించడం అధికమైనట్లు తోస్తుంది. ఆయా సందర్భాలలో, కుమారయాచమ, బంగారుయాచమలు, గోల్కొండ సుల్తానుల ప్రతినిధులుగానే ఈ సీమలో పర్యటించి, వెనుక పేర్కొన్న నిర్మాణాదిక కార్యక్రమాన్ని కొనసాగించి ఉండవచ్చును.- వెంకటగిరి పరిపాలకుల కాలంలోనే సంస్థానమంతా ఉత్తర, దక్షిణ ఖండాలుగా, విభజింపబడింది. అందులో ఉత్తర ఖండానికి సంబంధించిన అయిదు తాలూకాలలో పొదిలె ఒకటి. పొదిలె ఆ అయిదు తాలూకాలకూ కేంద్రంగా ఉండేది. వీటికి అధికారి పేష్కారు.

పొదిలెసీమ అనేక మహమ్మదీయ దండయాత్రలను రుచిచూచిం దనడానికి కవిలెలో ఎన్నో ఆధారాలు లభిస్తాయి. శ్రీరంగరాయల బలం క్షీణించడమూ, గోలుకొండ వారికి పొదిలెసీమ లభించడమూ గూర్చిన సూచన కవిలెలో ఉంది.[21]

---

[19] నెల్లూరి జిల్లా శాసన సంపుటి- పొదిలె (34) 1583-84 A.D. మహమ్మదీయుల దర్గా దగ్గరి రాతిమీది శాసనం.

[20] వెలుగోటి వారి వంశావళి. Intro. by N.V.Ramanyya p.60.

[21] ఇటీవలి వ్యయసంవత్సరాన మహాక్షామమై రాయవేలూరు, విజాపురమువారు చట్టుకొనిరి. గనుక ఆనాటినుండి రాయలవారి రాజ్యం ఖిలపడి. తురకలు

అంతేకాక పొదిలెలో ఉన్న నంది విగ్రహాలను, మహమ్మదీయులు భిన్నంచేసిన ఉదంతం ఉంది.[22] ఏ సందర్భంలోనో పొదిలెను ముట్టినడిచిన మ్లేచ్ఛసేన అక్కడి నందులను భిన్నంచేసి ఉండవచ్చును. అంతేకాక కవిలె కథనం ప్రకారం మహమ్మదీయులు చేసిన అత్యాచారాలు చాలా రకాలుగా ఉన్నవి. పొదిలె గ్రామపు ఉత్తరవీథిన వైకుంఠనాథుని దేవాలయముండగా, దానిని తీయించి షేర్ మహమ్మద్ ఖానుడు మసీదు కట్టించాడు. ఈతడు కొండవీటిలో నెలకొన్న గోల్కొండ ప్రతినిధి.

ఊరికి తూర్పుభాగాన యల్లంరాజు పెదకోనమ రాజనే స్థలకరణం వేయించిన "అంజని" హనుమంతుని విగ్రహం ఉండేది. దానిని తురకలు కొట్టివేశారు.

అక్కడే తూర్పున ఉన్న నగరేశ్వరస్వామి దేవళం పడగొట్టించి అల్లీ అదీశారు ఖానుడు (?) మసీదు కట్టించాడు. అందుకు ఊరికోమట్లు అభిమానపడి నగరేశ్వరస్వామిని నిర్మమేశ్వర దేవాలయంలోనే ప్రతిష్ఠించుకున్నారు.

కొండరామస్వామి ఆలయంలో విగ్రహం లేదు. దానిని తురకలు పాతివేసినారు.-

కవిలెలో వెలుగోటి వారి ప్రసక్తితోపాటు "రావేలి" వారుకూడా ప్రసంగింపబడ్డారు.[23] ఈ ప్రసంగం, సభలో "సభతాంబూలాలు" ఇచ్చే క్రమాన్ని తెలియజేసే సందర్భాన్ని సూచిస్తుంది. ఈ "రావేలి" శబ్దం, రాయలపదానికి వికృతరూపమో, లేక శ్రీరంగరాయలతో సఖ్యం నెఱపి, గోల్కొండ బలాలను తిప్పికొట్టడానికి సహాయపడిన "రావెల లింగని" గానీ అతని వంశస్థులనుగానీ సూచించే పదమో, ఆలోచింపవలసిన విషయం.

ఈ విధంగా ఇతరాధారాలను బట్టి, కవిలెలో వివరింపబడిన విషయాలను కలుపుకుంటూ, పొదిలె రాజకీయచరిత్రకొక స్థూలరూపమివ్వడానికి ప్రయత్నం ఇక్కడ జరిగింది. దాని సమగ్రతను దర్శించే భారాన్ని విజ్ఞులైన చారిత్రకులకు

---

గోలుకొండవారు, వందవాసిదనుకా ఆక్రమించి మీరు మహమ్మదు సయీదు పేరు తీసి నవాబు రాజ్యం చేస్తూ ఉండెను.

22 అక్కడ శిథిలమైన నంది, కైలాసనాథునికి తూర్పున మంటపంలో నంది, భీమేశ్వరుని తూరంప్పభాగాన శిలాస్తంభం తూర్పున నంది- ఈమూడు నందులు మహాఉన్నతమైనవి. ఢిల్లీ సుల్తాను శ్రీరంగం పోతూ పొదిలెకు వచ్చిన మ్లేచ్ఛులు దుర్మార్గులైనందుల భిన్నం చేసినారు.

23 తబుకులలో సరిగా వక్కలాకులు ఇచ్చేది. తర్వాత పంచాగ్నుల వారికి, తర్వాత దొరలు రావేలివారు, స్తలకరణాలకు ఇచ్చేది.

వదిలిపెడుతున్నాను.

***పొదిలె స్థల పురాణం:*** జన్మభూమిలో రసమహితంగా తీర్చిదిద్దిన ఎన్నో సుందర చిత్రాలకు కవిలెలోని స్థలపురాణ కథా శరీరాన్ని అందించింది. పొదిలెసీమలోని ఆయకట్టు గుడికట్టు హద్దులు దాదాపు వెయ్యి సంవత్సరాల క్రిందట నిర్ణయించబడ్డవి. ఈ సీమ కరణీకం పెమ్మయ సింగధీమణి వంశం వారిది. పెమ్మయ సింగధీమణి వంశం నాలుగు కుదుళ్ళుగా వ్యాపించింది అవి, ఎల్లంరాజువారు, పోలమరాజువారు, అన్నంరాజువారు, శివరాజువారు. వీళ్ళు సగోత్రీకులు. వీళ్ళకు పురుషుడు పుణ్యములు కలవు. ఇందులో ఎల్లంరాజు కుటుంబం వారివద్దే ఇప్పటికీ దండకవిలె ఉన్నది. ఈ వంశంలో వాడైన యల్లమ రాజు కొండమరాజు పింగళి సూరన రచించిన "నిర్మమా పురాణ"మనే కావ్యాన్ని కృతినందుకున్నట్లు కవిలె చెబుతుంది.[24] ఈ యల్లమరాజు కొండమ రాజే, రాయలచేత బహుమానాలంది, ఉదయగిరి రాజ్యప్రతినిధిగా రాజ్యవ్యవహారాలు, నడిపిన (రాయసం) కొండ మరుసయ్య.

కవిలెలో పొదిలె సరిహద్దుల వివరం ఉంది. పొదిలెకు పడమర సూర్యవీథి దక్షిణాన అంగడి వీరభద్రుడు ఉత్తరాన గౌరీశ్వరుడు. తూర్పున అల్లీ అధీశారుఖానుడు (ఆలీ అదిల్‌షా) కట్టించిన మసీదు. గ్రామపు ఉత్తర వీథిన వైకుంఠనాథుని దేవాలయం, బావి ఉండగా వానిని షేర్ మహమ్మద్‌ఖానుడు తీయించి మసీదు కట్టించెను. గ్రామపు ఊర కోట బయట కంబాల చెరువు. తూర్పున మామిడితోపులో ముత్యాలమ్మ గుడి, పెద్దచెఱువు మీద పోతరాజు. ఇక్కడి పూజార్లు ఉప్పర్లు.

ఊళ్ళో ఉన్న నిర్మమేశ్వర స్వామికి తూర్పుభాగాన మంటపంలో పెద్ద బసవన్న విగ్రహం ఉంది. దానికి అటూ ఇటూ చిన్న సందులున్నవి. అ బసవన్నకు సెనగల బసవన్న అని పేరు.

సుంకర చెన్నబసమ్మ అనే భక్తురాలు ఈ నంది చేత సెనగలు తినిపించినట్లుగా కథ ఉన్నది. ఈమెనే అముదాలపల్లి బసవమ్మ అని కూడా అంటారు.

---

[24] పెమ్మయ సింగధీమణి వంశంవారికి పొదిలె కరణీకం ఇప్పిస్తే, గజపతివారి నాండున్ను, ఆతర్వాత ఇమ్మడి రాయలు, రామదేవరాయలు, అంబ్బదేవరాయలు, ప్రౌఢదేవరాయలు, దనకా పెద్దమిరాశి అనుభవిస్తూ ఉండి రామరాజు యల్లమరాజు కుమారుడు కొండమరాజుగారు సాళువ నరసింహరాయలు, కృష్ణరాయలు, అచ్యుతరాయల గారిచేత తాళిచౌకట్లు పచ్చల కడియాలు, అందలము, మొదలైన సకల బహుమానములు అంది పింగళి సూరన్న చాత నిర్మమా పురాణమనే ద్విపదకావ్యము కృతి అంది, వారి బంధువులు మనుబోలి చాళుక్యుడు రాయలవారికి విన్నపంచేసి తొండమారయగుళ్ళకు ప్రతినామమైన కంభంసీమకు స్థళకరిమీకెమిరాశి యిప్పిస్తే పలుదినములు అనుభవిస్తూ ఉణ్ణంగా......

ఆమెకు తెలుగు రాయని సుంకర చెన్న అగ్రహారం యివ్వగా ఆమె దానికి శివపురమనే పేరు పెట్టుకుని శివభక్త పూజనంచేస్తూ, బహుదినాలు నడిపించుకుని వచ్చింది. ఈ వివరాలు నిర్మమేశ దేవలాలయ మంటప శిలాస్తంభంమీద ఉన్నవి. ఆలయంలోని ధ్వజస్తంభాన్ని ముసల్మాన్ హవల్దార్ మహమ్మదిన్‌బేగ్ అనేవాడు ప్రతిష్ఠించినట్లుగా కవిలెలో ఉంది. స్వామి అతనికి కలలో కనిపించి అట్లా చేయమని ఆదేశించాడట.

నిర్మమేశ్వరస్వామి దేవాలయానికి దక్షిణాన నిమ్మవ్వగుడి ఉంది. దీనిని కృష్ణరాయల ప్రతినిధి యల్లంరాజు పెదకొండమరాజు నిర్మించాడట. ఇతడే రాయసం కొండ మరుసయ్య. ఇక్కడ నిమ్మవ్వవిగ్రహంతోపాటు కింద ఆ శిలలోనే దూడలమల్లయ్య విగ్రహం కూడా చెక్కబడి ఉంది. నిర్మమేశాలయానికి దక్షిణంగా నగరేశ్వర దేవాలయమూ, అక్కడికి తూర్పుగా గణాధిపతీ, పోలేరమ్మా నెలకొని ఉన్నారు. నిర్మమేశ్వరునికి ఉత్తరాన పార్వతీ స్థానం. ఇక్కడ మొదట తామస ప్రకృతి అయిన బగళా యంత్రం ఉండగా, దానిని పంచాగ్ని[25] తండ్రి యజ్ఞేశ్వర చయనులు, ఊడబెరికించి అక్కడ శ్రీ విద్యాచక్రాన్ని నెలకొల్పాడు. ఈ వంశానికి చెందిన మరో యజ్ఞేశ్వర చయనులు, తమకు పరంపరగా వస్తున్న దొండ్లేరు అగ్రహారానికి వ్యాఘాతం వస్తే తన యిద్దరు అన్నలతో కృష్ణదేవరాయలను దర్శించి, రాయలను మెప్పించి దానిని నిలవబెట్టుకున్నాడు. అంతేకాక రాయలు, వారికి దొండ్లేరుతోపాటు, మైలవరం, పోలవరం, తిప్పలదేవి పల్లె, ఉదయగిరి తాలూకాలలో మరో రెండు అగ్రహారాలు ఇచ్చి సత్కరించాడు. ఈ వంశంవారు తొలుత సత్తెనపల్లివారు. ఈ వంశంలో ఉద్భవించిన పంచాగ్ని పేరనే పంచాగ్నుల వంశంగా అది వ్యవహరింపబడ్డది. పంచాగ్ని పొదిలెమ్మ భక్తుడు. ఆవిడ చేయగా మహాపండితుడై తన తండ్రి పూర్తిగా వ్రాయక విడిచిన జంబూ భారతాన్ని పూర్తిచేశాడని ప్రతీతి.

పొదిలెకు దైవ మాన్యాలు చాలా ఉన్నవి. నిర్మమేశ్వరస్వామికి నిమ్మవరం, సెనగల బసవన్నకు నందిపాలెం, కైలాసనాథునికి భీమేశ్వరునికి చిలమకూరు, దూడల మల్లప్పకు కోరళ్ళవల్లె, వెలుగొండ్రాయ స్వామికి గార్లదిన్నె, కత్తి రాళ్ళ గుంపు, దత్తం చేయబడినవి.

పొదిలె గ్రామానికి సూర్యవీథులు రెండు, సోమవీథులు రెండు. ఇక్కడ "రెడ్లవారు చతురస్రంగా పెట్టించిన భూమికోట" ఉండేదని కవిలెలో పేర్కొనబడ్డది. నంబురాయల వంశస్థులు రెండువందల యేండ్లు పొదిలెసీమను పాలించిన కాలాన, గ్రామ దక్షిణాన కోట కట్టించారట. అది చుట్టూ ప్రహరీ తీర్చిన కోట. ఆ కోటలో తూర్పున కస్తూరి కేళాకూళి ఉండేది. ఇందులో తెలుగు రాయలు[26] కస్తూరి గోనెలతో తెప్పించి వేయించి రాణులతో జలక్రీడలాడేవాడు. పొదిలెలోని కోటకు పడమరి

[25] 'పంచాగ్నుల' వంశానికి మూలపురుషుడు. Text - page 148.

[26] శ్రీనాథుని సాంపరాయని తెనుంగాధీశుడు.

గవునులు రెండు తూర్పున ఒకటి, దక్షిణాన మరొకటీ ఉండేవి. గ్రామ మధ్యన ఉన్న పేటలో కోమట్లు, సాలెవారు ఉండేవారు. తరువాత కాలాన "మహమ్మద్ శరీఖు మీరు మామద్ సాయిబు" ఊళ్ళో నవాబుపేట కట్టించాడు.

పొదిలె తూర్పుభాగాన కాశీబుగ్గ అనే ఉదకస్థానం ఉంది. ఇది మహావైశాఖాన మహా ప్రవాహమై వచ్చి ఆకుతోటలను, అరటి, పసుపు తోటలను, కందచేను చిరగడల (చిలగడదుంప) తోటలను తడుపుతుంది. పొదిలె పెద్ద చెరువుకు రెండు తూములు. తరువాత వేమరసు అనేవాడు, అందులో ఉత్తరాన ఉన్న తూమును ఎత్తివేసి బుఱ్ఱుతూము కట్టించాడు. ఆ చెరువుకు దక్షిణపువైపున్న తూముమీద సానివాండ్లు లంజమందు (వశీకరణలేపనం) నూరేవాళ్ళట. అక్కడికొక మొసలివచ్చి, ఆ బండపై పండుకుని, ఔషధ ప్రభావం వల్ల మరులుకొని ఆ మందు నూరిన సాని మంచం కిందికి వచ్చి చేరిందని ఒక కథ. ఈ చెరువు కింద పూర్వం నిమ్మ, అరటి తోటలుండగా, తర్వాత ఒక కాలాన, అప్పటి స్థలకరణమైన యల్లమరాజు అన్నమరాజు, ఖరాపాడి మామిడి విత్తనం తెప్పించి అక్కడ మామిడితోట వేయించాడట. ఈ తోట, శకవరుషంబులు అగునేటి 1646 శ్రీముఖ సంవత్సర జ్యేష్ఠశుద్ధ విదియ (1724 A.D.) నాడు వేయబడిందని కవిలె వర్తమానం అందిస్తున్నది.

***పొదిలె దేవస్థానాలూ, వాటి కథలూ:-*** సాధారణంగా ఏ గ్రామ చరిత్ర పరికించినా, అక్కడ నెలకొని ఉన్న దేవతల చుట్టూ చిత్రవిచిత్రాలయిన కథలు ప్రచారంలో ఉండడం కనిపిస్తుంది. ఈ కథలన్నీ, కొన్ని రకాల మూసలలో బిగించడానికి వీలుగా కనిపిస్తయ్. జాతికి అతి ప్రాచీనమైన, పరంపరగా, నేటికవరకూ వస్తున్న కొన్ని కతల్ని పురా గాథలుగా (Myths) పేర్కొనవచ్చు. ఈ పురా గాథల్ని గురించి చెప్పేదే Mythology - సాధారణంగా ఈ కథల్లో ఉండే అంశం, మనుష్యుడి తొలి ఊహలకు, అర్థంగాని అతిమానవశక్తిని గురించీ, ఆ శక్తివల్ల కల్పిత మవుతున్నట్లుగా అతడు తలచే జననం, మరణం, సృష్టివిస్తరణ, వివిధ వస్తువుల ఆవిర్భావం, దైవసాక్షాత్కారం, వంటి విషయాలను పొందించుకుని కనిపిస్తుంది. ఈ విషయాలమీద ప్రాచీన మానవుడి మేధ రూపు కట్టించిన ఊహలే పురాగాథలై, ఈ నాటికీ మన పురాణాల్లోనూ, జానపద సాహిత్యంలోనూ నిలిచి ఉన్నాయి. అవే కథలుగా, గ్రామ గ్రామానా ప్రచారం పొంది కవిలల్లోనూ, గ్రామ కైఫీయతు (Village Records)ల్లోనూ నిలిచి ఉన్నాయి. అందువల్ల ప్రతి గ్రామానికి ప్రత్యేకమని ఆయా గ్రామస్థులు చెప్పుకునే యిటువంటి కథలు, పరిశోధకుల దృష్టికి పోలికలు కలవిగా, ఒకేరకం మూసలలో బిగించిన జానపద నిర్మాణాలుగా (Folk Motifs). కనిపించడానికి ఆస్కారం ఉంది. పొదిలె స్థానికులు చెప్పుకునే సమాచారంలో నిర్మమేశ్వరస్వామి ఆవిర్భావాన్ని గురించీ పొదిలెమ్మ గ్రామదేవతగా వెలసిన

ఉదంతాన్ని గురించీ, కథలున్నాయి. నిర్మమేశ్వర భక్తురాండ్రైన నిమ్మవ్వ, సుంకర చెన్నబసవమ్మల కథలు, పొదిలెమ్మ, పండితుణ్ణిగా మార్చిన పంచాగ్నికథ ఉన్నవి. ఈ కథల నన్నిటినీ కావ్యంలో రసరమ్యంగా తీర్చడం జరిగింది.

అవతారికలో కవి వంశోత్పత్తి వర్ణనలో కొన్ని కథలు తడవ డం జరిగింది. వెలమకుల చరిత్రను ఆరంభిస్తూ ఆ కులంలో ఆది పురుషులైన భద్రపద్ములు బ్రహ్మ వెంట, శ్రీహరి నాభి సరసీజాన్నుండి ఉద్భవించారన్న కథ, ఏ కుల చరిత్రకు సంబంధించి అయినా సర్వసాధారణంగా కనిపించే కథలను పోలిందే.

చాళుక్యులు, బ్రహ్మ చుళుకాన్నుండి పుట్టారన్నా, సూర్యవంశస్థులు సూర్యుని నుండీ, చంద్రవంశస్థులు చంద్రునినుండీ, అగ్ని కులోద్భవులు అగ్ని నుండీ జనించారన్నా ఈ కథలన్నీ సృష్టిని గురించి అతి ప్రాచీనమైన మనుష్యుని ఆలోచనా విధానానికి సంబంధించిన పురాగాథలు (Myths).

భద్రపద్ముల వంశాలకు చెందినవవారే, అది పద్మ వెలమలయ్యారని వెలమకుల చరిత్ర చెబుతున్నది.[27] ఈ ఆది వెలమలు ఎక్కడో సమూహంగా ఉండి, కారణాంతరాలవల్ల పన్నెండు ఓడలలో ఎక్కి తూర్పు సముద్రతీరానగల రేవు పట్టణాలలో అక్కడక్కడా నివాసా లేర్పరచుకోవడం జరిగిందట-- ఆది వెలమకులానికి చెందినవారు సాధారణంగా, తూర్పుతీరపు రేవుపట్టణాలలోనే ఎక్కువగా ఉండడం ఇప్పటికీ మనం గమనించగల సత్యం. వీళ్ళ నందరినీ, జాలరివాళ్లు తమ పడవలలో ఎక్కించుకొనడంవలన ఆ కృతజ్ఞతను సూచించడానికై ఇప్పటికీ ఈ కులంలో, వివాహ సందర్భంలో, స్తంభ ముహుర్తాన పాతిన పాలకొమ్మకు వలగుడ్డ కట్టే ఆచారం ఉంది--

నాయని వంశ కథనం చేస్తూ కవి, నాయని వారి యింటి ఆడపడుచై వెలసిన నాగారపమ్మ కథను మనోజ్ఞంగా మలచడం జరిగింది. ఈ కథ వేటపాలెములో ప్రచారంలో ఉన్న గాథ. అక్కడి నాగారపమ్మ గుడిలో, నాయని వంశంవారు మొక్కులు చెల్లించుకుంటూ ఉండడం ఇప్పటికీ ఉంది. ఆ ఊరి కరిణీకం ఇప్పటికీ నాయనివారిదే. సాధారణంగా, గ్రామదేవతల గాథల్లో, కనిపించే నమూనా (Motif) ఇక్కడా కనిపిస్తుంది. ఒకదేవత, రాయిగానో, మరే రూపంలోనో, ఒక వ్యక్తి వెంటపడి ఒక గ్రామానికి రావడం, తనకు కోడి కూతా, రోకటిపోటూ వినిపించనిచోట గుడికట్టించి మొక్కులు చెల్లించమనడం సర్వసాధారణంగా గ్రామదేవతా కథనంలో కనిపించే అంశమే. ఇటువంటి కథలన్నీ పురాగాథలవల్ల (Myths) ప్రభావితాలై రూపుచెందిన జానపదగాథా విశేషాలు. ఈ విధంగా కవి, అవతారికలో తాను మలచిన కథలకు

---

[27] శ్రీమదాది వేల్మి కుల చరిత్ర- నాయని శంభులింగం నాయుడు.

ఆధారాన్ని జన ప్రచారంలో ఉన్న స్థానిక గాథలనుండీ, కులచరిత్ర నుండీ గ్రహించడం జరిగింది.

ఇవికాక కవి అక్కడక్కడా ప్రసంగావశాత్తూ తన వంశంలో జరిగిన కొన్ని విషయాలను తడివిన సందర్భాలున్నాయ్. అందుకొక ఉదాహరణ, ఆయన అవతారికలో పేర్కొన్న కాకరకాయమాన్యం.[28] కవి బంధువుల్లో ఆయన మేనత్త భర్త వంశంలో పూర్వీకులకు ఈ కాకరకామాన్యం చిత్రంగా లభించిందట. ఒకానొకప్పుడు మండలాధిపతిఅయిన ట్రావెర్స్‌దొర అల్లూరు ప్రాంతానికి ముసాఫర్ (camp) రావడం జరిగింది. ఆ అల్లూరు గ్రామం చుట్టుపట్ల ఉన్న చెఱువుల కట్టలు వర్షాధిక్యంవల్ల తెగి, అక్కడ సపరివారుడై, గుర్రమెక్కి తిరుగుతున్న దొర, ఆ ప్రవాహంలో చిక్కుకుని ఏకాకి కావడం తటస్థించిందట. అప్పుడు ఆకలివల్లా, చలివల్లా, నిస్సహాయుడైన కలెక్టర్‌గారికి ఆతిథ్యం నెఱపే అవకాశం, ఇమ్మానేని వంశం వారికి కలిగింది. ఆ యింటి కోడలు అప్పటికప్పుడు, భోజన సన్నాహం చేసి, పెరటిలో, చెట్టుకు కాకరకాయ ఉండగా, దానిని, కుంపటి ఎత్తి పట్టి, మసాలాలు నింపి, చెట్టునుండి తెంపకుండానే వండిందట. ఆకాయను, ఆపళంగా, ఆకులతో సహా కోసి వడ్డించగా, ఆ దొర ఆవిడ చాతుర్యానికి ముగ్ధుడై, పేర్నమెట్ట అనే గ్రామంలో నూరు గొర్ల భూమిని మాన్యంగా బహూకరించాడట. అదే కాకరకాయమాన్యమై ఆ వంశీకులకు అనుభవయోగ్యమైంది.

ఇంతకూ ఈ పీఠిక పొదిలెకు సంబంధించిన రాజకీయ చరిత్రనూ, స్థానిక గాథలనూ, కవిలెలో ఉన్న విషయాలనూ కలగలుపుకుని, ఒక స్థూలరూప సముపార్జన చేయడానికి మాత్రమే ఉద్దేశించబడ్డది.

ఈ కావ్య మహత్త్వాన్ని గురించీ, కవి ప్రతిభా వ్యుత్పత్తులను గురించీ, కావ్యరమ్యత్వాన్ని గురించీ చెప్పడానికి ఉద్దేశించిందికాదు. ఆ పని చేయడానికి నా శక్తి చాలదేమోనని సవినయంగా మనవి చేసుకుంటున్నాను. రసగ్రహణ పారీణులైన సహృదయ పాఠకులకీ కావ్య మాధుర్యం హృదయైకవేద్యమవుతుంది. పాఠకుని హృదయానందాన్ని పారదర్శకంగా ప్రతిఫలించే శక్తి ఈ కావ్యానికున్నది. అద్దానికీ, ముఖానికీమధ్య మరేమీ అక్కరలేదుకదా!

నాయని కృష్ణకుమారి

---

[28] జన్మభూమి పేజీ.21

# మరోమాట

ఇది శ్రీ నాయని సుబ్బారావుగారి శతజయంతి ప్రచురణ. 1973 లో మొదటిసారి ముద్రింపబడిన ఈ జన్మభూమి కావ్యం తిరిగీ ఇరవై యేడేండ్ల వ్యవధానం తరువాత ఇప్పుడు రెండవ ముద్రణ పొందుతున్నది. దీన్ని తొలుత Writer's Anvil ముద్రణశాలలో, దాని అధిపతి శ్రీ పెద్దిభొట్ల పూర్ణానందం అచ్చువేశారు. అయితే కవి వెయ్యికాపీలకు సన్నద్ధులై ఎదురు చూడగా, ఆయన చేతికి 500 కాపీలు మాత్రమే వచ్చి చేరాయి. ఈ 27 సంవత్సరాలనుండీ గ్రంథాలయాలలోగాని సాహిత్యాభిమానుల దగ్గరగానీ, దగ్గరి బంధువుల, మిత్రుల దగ్గరగానీ ఉన్నవి ఆ 500 కాపీలు మాత్రమే. ఇప్పుడీ శతజయంతి ప్రచురణ పనులకు అదనపు కాపీలను సేకరించడం నాకు బ్రహ్మ ప్రయత్నమైపోయింది.

ఈ కావ్య ప్రశస్తిని గురించి మరొకరు ప్రత్యేకించి చాట వలసినఅవసరం లేదు. చెఱుకు గడ నములుతున్నప్పుడు, రసం మింగుతున్నప్పుడు ఆ మధురిమను అనుభవించేవారే అప్పటికప్పుడు అవగతం చేసుకోగలరు. ఇదీ అటువంటిదే.

ఒక్కొక్కసారి ద్రాక్షపండ్లు తింటునట్లు, మరొకసారి కదళీ ఫల సేవనం చేస్తున్నట్లు, ఇంకొకసారి పుట్టతేనెను ప్రాశిస్తున్నట్లు అంతా తియ్యదనమే! అది అనుభవైక్య వేద్యమౌతుంటుంది.

ఈ కావ్యం ఒకరకంగా అసంపూర్ణం. బాల కేళీఖండంలో ఉండవలసిన వృత్తాంతమేమిటో నాకు కూడా తెలియదు. ఆయన చిన్ననాటి చేష్టలు ప్రసంగవశాత్తు చెప్పినవేగాని ప్రణాళికా బద్ధంగా ఇదీ అని తెలియజేయలేదు.

అందుకు నేనే క్షంతవ్యురాలిని. పట్టు వదలకుండా నేను వెంటబడి ఉంటే బాలకేళీఖండం అసంపూర్ణంగా ఉండేది కాదు. ఏదైనా చేయిజారిపోయి, మననంలో రాపిళ్ళు పొందిన తరువాతనే, కోటి రెట్ల ప్రకాశనాన్ని ఆవిష్కరిస్తుంది.

ఈ కవికి హృదయపూర్వక నమస్కారం, ఇంతటి గొప్ప కావ్యాన్నందించి నందుకు


కవి పుత్రిక

నాయని కృష్ణకుమారి

8-3-898/2

నాగార్జున నగర్

హైదరాబాదు - 73


1-3-2000

# విషయసూచిక

భీమేశ్వరాలయము - ఉద్దండ నృసింహభారతి కథ -
కైలాసనాథాలయము - నిమ్మవ్వగుడి - నిమ్మవ్వకథ -
నిమ్మయ్య దేవళము - శ్రీ నిర్మమేశ్వరావిర్భావము.

# అవతారిక

శ్రీమంతమ్ము సనాతనమ్ము ప్రకృతిక్షేత్రమ్మునన్ జన్మభూ
మీ మర్యాదగ విశ్వరక్షణచణామేయావతారమ్ములం
దామోదించు పురాణపూరుషుడు క్షేత్రజ్ఞుండు క్షేత్రజ్ఞగో
త్రాముష్యాయణుడౌ నృసింహునకు నిత్యామోదముల్ గూర్చుతన్. 1

ఉ. భిన్న విభిన్న వస్తు సమవేతము రమ్యపదార్థభావని
ష్పన్నము మాటికిన్ శబలవర్ణమనోరమమైన సృష్టిలో
నన్నిట నన్నిరైయె మఱల నన్నిట నొక్కటిరైయె వెలుంగు సం
పన్న రసైక తత్వము కృపన్నరసింహు ననుగ్రహించుతన్. 2

ఉ. కోరిక లీరికల్ పొదిలెకొండపయింగొనలొత్తజేయు ల
క్ష్మీరమణుం డహోబలనృసింహుడు నంబునృపాలభక్తిగం
డారము స్వీయనామయుతుడై తగు నాయనివంశకీర్తిభం
డారము నస్మదగ్రజుఁ గడల్కొననేలుత సౌఖ్యసంస్థితుల్. 3

చం. పొదిలె పొలమ్మునం జదిసిపోవుట ధారుణి నింకునె త్తు ర
య్యెదుటను చింతకాయలకునెక్క నదొక్క విచిత్రలీలరైయె
యదుకగ గ్రామశక్తియగు ఖాదిమశక్తి సమస్తశక్తిస్వర
పదలు కదించి నిర్భరకృపామతిఁ బ్రోచుత నారసింహునిన్. 4



మ. మమతాగోచర మావుపాలకని కౌమారస్థితిన్ వచ్చి గో
ష్ఠములోఁపెట్టిన పుట్టఁజొచ్చి యొకవెంటన్నచ్చి కైలాటముల్
యముడౌ కావరి దండమున్ విసరివేయన్ పుచ్చెపెచ్చూడి ని
ర్మముడై నిల్చిన యీశ్వరుండు కరుణన్మాయన్న నీక్షించుతన్. 5

ఆ. వె. తండ్రి వెనుక తండ్రి తా నగ్రజన్ముండు
తండ్రి వెనుకనుండి తనయనుజుల
పలుకు వెలది కృపకు పాత్రులుగా సమ
ర్థించె నగ్రజన్మదీప్తి యతడు. 6

సీ. లక్ష్మీకటాక్షసోల్లాసుడై బహుముఖ
ప్రీణితసావిత్రి యైనవాడు
న్యాయవాదిత్వ విజ్ఞానపూర్ణుడయి ప్ర
జ్ఞానామృతసముద్రు డైనవాడు
దేశచారిత్ర విద్యాశేఖరుండై స
మారాధ్య కవితాత్మ యైనవాడు
పరహృద్భిదాభిధా నరసింహుడై సంత
తాసన్న నరసింహు లైనవాడు

నవనవోన్మేషబుద్ధి విన్యాస విభవ
చాతురీమాధురీవాక్య సంప్రయోగ
సత్వరాకర్షిత శ్రోతృజన కుతూహ
లాంతరంగుండు మామకీనాగ్రజుండు. 7

సీ. తన నికేతనము యాతాయాతబంధు సం
తతికి నిత్యాన్నసత్రమ్ము గాగ
తనమాట మృదువయ్యు తనవారికెటు త్రో
యగరాని సుగ్రీవునాజ్ఞ గాగ
తనయొక్కచేయీవి తనయొండు చేయెఱుం
గని గుప్తదాన మంగళము గాగ
తనసేవ పూజ్యుడౌ తండ్రికి వైకుంఠ
ధామార్చనా మహోత్సవము గాగ

తనరె నెవ్వాడు పొదిలెభూధర శిఖాస్థ
లీ వస న్నరసింహ సమ్మాననీయ
పరమపావనాహ్వయ సముద్వహుడు నిర్మ
లాత్ము డవ్వాడు మామకీనాగ్రజుండు. 8

సీ. వాదింపదొడగెనా వైరిపక్షన్యాయ
వాదివాదమునకు వజ్రధార
సలహాయొసంగెనా సాక్షివాఙ్మూలమై
కేసు గెల్చుటకు నిష్కృష్టపథము
క్రాసుకై లేచెనా గాండ్రించు బెబ్బులి
కైన బోనున పిల్లికూనతనము
వాఙ్నైపుణీ ప్రభవమ్ము చిందించెనా
జడ్జీల కాసవాస్వాదనమ్ము

సభ నుపన్యాస మొసగెనా సరస సభ్య
జనుల కెల్లను కర్ణరసాయనమ్ము
గాగ వెలుగొందె నస్మదగ్రజుడు వంగ
వోల్పురంపు వకీళ్ళ ననల్పయశుడు.
9

కం. ఒక రెండున్నరయే లె
క్కకు నెక్కువయేండ్లు వీనికంటె నదేమో
యొక వింశతివర్షవయో
ధికమాన్యత నతడు కూడదీయును మదిలోన్. 10

తే. గీ. తప్పటడుగుల చెందమ్మి తళుకు లొలయ
తొక్కుపల్కుల గమగమల్ తుఱగలింప
ముద్దుగుల్కెడు నా 'జన్మభూమి' బాల
మొనసె పెదతండ్రి యుత్సంగమునకు బ్రాక. 11

చం. జననియు జన్మభూమియును స్వర్గముకన్న గరీయమైన వై
జననికి మున్ను గూర్చితి విషాదతరంగిత మన్మనోబ్ధి సం
జనిత సముద్గతాశ్రుకణ సన్మణిమాలలు 'మాతృగీతముల్'
వినుత మహాంధ్రకావ్యపదవీ కరుణారస వాక్ప్రపంచముల్. 12

తే. గీ. పుట్టి పెరిగిన గ్రామమ్ము పొదిలె నేను
వదలగా నిర్వదేడుల ప్రాయమందు
వదల దది నన్ను తన్నిత్యభావనాతి
లోలుపుడనైన నా గుండెలోన నిండి. 13

ఆ. వె. ఇతర జనపదముల నేను ప్రవాసినై
మరచియైన మేను మరచియైన
కన్నతల్లి పొదిలె యున్న దిక్కున కాళు
లుంచి యెపుడు పవ్వళించలేదు. 14

కం. నీ పొదిలె నీకు గొప్పై
మా పుట్టిన యూళ్ళ గొప్ప మాకై యేలా
యీ పగిది కావ్యరచనా
వ్యాపారము విశ్వశుభము లమరునె దీనన్. 15

ఆ. వె. అందురేమొ వాఙ్మయబ్రహ్మ లెవరైన
సర్వభారతీయ సంస్కృతి ప్ర
తీక లీ పవిత్రదేశమ్ములోని గ్రా
మమ్ములెల్ల నొక్క గ్రామనిపండ్లు. 16

చం. 'తమతమ జన్మదేశముల తద్దయు రమ్యము లెల్లప్రాణి జా
తములకు' నంచు బృందకుపదల్ చదివింపడె రౌహిణేయు డి
య్యమలిన కావ్యముం జదువు నార్యుల డెందము లాత్మ జన్మభూ
మిమధురభావసంస్మృతి రమించినజాలు కృతార్థజన్ముడన్. 17

కం. ఈ కృతి మనురాజ సమ
గ్రాకృతి కోంకారవర్ణహారి పురస్కా
ర్యాకల్ప మహోదయముగ
నా కీర్తిత వంశవర్ణన మ్మొనరింతున్. 18

జలధర. శ్రీపతి దివ్యనాభి సరసీజమునం
దా పరమేష్ఠివెంట మహితాత్ములు చి
ద్రూపులు భద్ర పద్మ లన తోచిరి త
ద్వ్యాపృతవంశజుల్ వెలమలైరి ధరన్. 19

ఉ. ఆదిముడైన భద్రు విమలాన్వయసంభవు లాదివెల్మ లి
మ్మేదిని నొక్కచో ప్రథితి మేకొని రచ్చటి లోకనాథ సే
వాదరవృత్తిలో విరిసి యాడెడు గేదగిడొంక లంచితా
మోద పరాగపాండరవిభూత్యభిరాజిత రాజశేఖరుల్. 20

తే. గీ పసుపు పచ్చని రేకుల మిసిమి ఘ్రాణ
తర్పణ సమర్థపరిమళోదారరచన
తనువు పుష్పాడియయ్యు గేదంగి రాజ
శేఖరార్చనకుం దప్పి చెడుట యేమి! 21

నర్కుటము. ఎవరియదృష్టమెట్లో యటులేయగు తప్పక దై
వవిధి లంఘ్యమై యొక విపద్భర వాహినిఁ జి
క్కువడి సమస్తసంపదలు కోల్పడి వారలు పో
వవలసివచ్చె ప్రాయునికిపట్టును వీడి కటా! 22

చం. పదియును రెండు పోతములు వశ్యములై యటనుండు బెస్తవా
రిదయ దయాప్రవాహనిబిరీసను గంగనుబట్టి పోయి పో
యి దరియుదాపులేని యలలేచెడు మేచకనీరశేవధిన్
కదిసిరి వారు ప్రాగ్జలధిఁ గాలము చాలని నాటి దుర్విధిన్. 23

శా. ఆలోనొక్కెడ వాయుగుండము సముద్యద్వేగమై యొత్త క
ల్లోలోల్లోలజటాలమై యుడుపథోల్లోచాంతసంచారమై
ఫాలాక్షప్రళయోగ్రతాండవకళాపారీణతారేఖ బం
గాళాఖాతము సుళ్ళుసుళ్ళు తిరుగంగానై తుఫానేచినన్. 24

కం. కొట్టుకొనిపోయి నావలు
కట్టువదలి పెనుతుఫానుగాలింబడి యి
ట్టట్టును చెల్లాచెదరై
తెట్టగిలుచు పట్టె తూర్పుతీరపురేవుల్. 25

తే. గీ. యానపాత్రమ్ము క్షేత్రజ్ఞు నన్వయమ్ము
వారి కాశ్రయపాత్రమ్ము పారదాత్ర
మబ్ధినెగయు కరళ్లదయ్యముల నుత్త
రించి యీపూరిపాలెమ్ము రేవుఁ జేరె. 26

మాలిని. అతిసితసికతారమ్యస్థలుల్ మాధవీ కాం
క్షిత పరిమళ సమ్యక్కేతకీకుంజశోభా
యుతరసనిధులౌ క్రియ్యూటకాల్వల్ మనోభీ
ప్సితములగుచు నంతర్వేదనన పాదగల్పన్. 27

తే. గీ. ఆ పడవలోని వారి నాయకుడు సపరి
వారుడై పోయి సంతరావూరుఁ జేరి
నిండు కొలువున్న తద్ధరా మండలేంద్రు
సమ్ముఖమ్మున కేల్మోడ్చి సమయమెరసి. 28

శా. ఒంటన్ రెంటను మూట నష్టపడి యెట్లోచేరి యీప్రాంతమున్
కంటెన్ ముక్కనులందు చల్వలొలయున్ కారుణ్యలిప్తాత్ము ము
క్కంటిన్నిన్ను దయావలోకన సమగ్రస్వీకృతానంగు న
న్నంటంబట్టిన కష్టముల్ తొలగె నయ్యా! రాజచూడామణీ! 29

ఉత్సాహ. కదురుమొనయు కల్లుమొనయు కత్తిమొనయు సభ్యతా
పదము కలముమొనయు మాకు పట్టువడినవయ్యు నం
దదియు నదియు నదియుగాక యదియ యెందు పరమ స
మ్మదము గూర్చు విద్య మాకు మండలాధినాయకా! 30

కం. అని తమకథ సర్వమ్మును
వినిపించిన సానుభూతి విరియన్ ముక్కం
టి నృపతి సభఁగలయుంగని
యనయము తనదృష్టి నిలిపి యందొక్కనిపై. 31

శా. సొగందీసెదు మాటి కోయరవవంశ గ్రామణీ యోయి బు
ఙ్గాగోపాహ్వయ నీ మిరాసిఁగలవౌ గ్రామాల లెక్కల్ తయా
రీ గావింప సమర్థులౌ గణకు లేరీయంచు నియ్యంక వి
ద్యా గాంగేయుల నేలుకో కలసిరానై తీర్థమున్ స్వార్థమున్. 32

సీ. అనిచెప్ప నతడు మహాప్రసాదము దేవ
రా యని తనకు మిరాసిరైన
యైనవోల్ మన్నెపా డాలూరు నిసుకపా
లెమ్మును మోటుపల్లియును సంత

రావూరు నను నాఋగ్రామమ్ములకు సర్వ
జనసమ్మతమ్ముగా సంప్రతియును
మఱి మోదుకూ రాణుమల్లిపేటను రెండు
జనపదమ్ములకు నచ్చపుమిరాసి

హృదయపూర్వకముగ సమర్పించి పంచె
నాతిథేయ సమ్మోహితస్వాంతు డైన
వాని క్షేత్రజ్ఞకుల విధుండైన వాని
నభినవాభ్యాగతవిధుండు నైన వాని. 33

తే. గీ. ఆ యదృష్టవంతుడు భాగినేయునకును
జ్ఞాతులకు పంచి యాఋూళ్ళ కరణికములు
మనకు సంతరావూ రాణుమల్లిపేట
చాలు నని తృప్తిజెందె చుట్టాల సురభి. 34

తే. గీ. భాగినేయుని సంతతివారు పాపి
నేనివా రనగా నిమ్మనేనివా ర
నంగ నాలూరు నల్లూరులందు వరుస
మున్సబీ కరణికముల పొందుకొనిరి. 35

ఆ. వె. ఆణుమల్లిపేట నంటె పిమ్మట నేరు
పడిన యూరు వేటపాలెమునకు
సైత మతడు గొనియె సంప్రతి బంధుతా
బంధురుండు దీనబాంధవుండు. 36

ఉ. ఏతపు బావులున్ దొరువు లీను జలమ్ముల నిత్యసిక్తమ
యాృతతవాలుకాతలమునందు రచించిరి రాగభోగ ని
ర్యాతన చేతనల్ తములపాకుల తోటలు రమ్యసృష్టి సం
జ్ఞాతులితాబ్జజుల్ తదనుసారులు నాయకు నండదండలన్. 37

తే. గీ. అమ్మహామహు నన్వవాయమ్మునందు
జననమొందెను నయనారి యను ఘనుండు
ప్రవిమలాత్ముండు శారదోపాసకుండు
పూతపంచాక్షరీజపప్రీత శివుడు. 38

ఉ. స్నానము సేయుచుండి సువిచారు డతం డొకనాడు పుష్పగం
ధానిల హృద్యమైన వకుళావనిజాతము క్రింద దొడ్డిలో
పైనొక పుల్గుజంట పరిభాషణముల్ విని సర్వపక్షిభా
షా నిపుణుండు డెందమున స్వారియొనర్చెడు తత్త్వమ్మునన్. 39

ఉ. ఎత్తిన చేతిచెంబదియు నెత్తిన యట్టులెయుండ మేనిపై
నొత్తిన వారిధారలవి యొత్తిన యట్టులెయుండ నార్ద్రమై
హత్తిన యంగవస్త్రమది హత్తిన యట్టులెయుండ నాత డు
ద్వేత్తున లేచి పోదొడగె నెచ్చటికో త్వరమాణపాదుడై. 40

తోటకము. తలవాకిలి నాతడు దాటెడు లో
నలవోకగ చెంబది యందుకొనెన్
లలితాశయ తద్గృహలక్ష్మియు న
య్యలఘుం డతివంగని యాయమతోన్. 41

మ. మన పంచాంగపు బ్రహ్మయింటికిని సామగ్రీప్రపూర్ణమ్ము మో
యిను పంపించుచు విప్రులిద్దఱిపుడే యేతెంచుచున్నారు వెం
టనె వంటల్ ఘటియించి యుంచుమనుచు న్నామాటగా చెప్పిపం
పు నిమేషమ్ముల మీద భవ్యచరితా పుణ్యమ్మగణ్యమ్ముగన్. 42

కం. అని విసవిస నడచుచు న
వ్వినీతుడేగెన్ స్వపాదవిన్యాస భర
మ్మున దుసికిలు విసరున నె
క్కొను కసిమసి నిసుకబాట గుంటలు పడగన్. 43

ఉ. అంగముమీది నీటితడి యాఱకమున్న పయోధిగాలికిన్
రింగులువిప్పి పైకొనెడు రేణువులౌ సితవాలుకన్ సమా
లింగితదేహుడై పుడమి లీలఁజరింపగవచ్చు భూతి స
ర్వాంగధరుండు శంకరుని యంగమునం జని యాత డొక్కచోన్. 44

ఆ. వె. మొగలిడొంకక్రింద భుజియింప నాయిత
మ్మైన బ్రాహ్మణద్వయమ్ముఁజేరి
ఎగురజిమ్మి నోటికెత్తిన కబళముల్
చేతులెత్తి వారి చేతులొత్తి. 45

తే. గీ. ఆ హఠాత్సంభవమ్మున కదరిపడి మ
హీసురుల్ ఱిచ్చవడి యెట్టకేని తెలిసి
చెక్కులదరంగ మోములు జేవురింప
నయనగోళముల్ విస్ఫులింగమ్ము లుమియ. 46

స్రగ్ధర. పాపాత్మా యేమిరాయీపని పరమ పశుప్రాయ యాకంటె మంటల్
వేపోకార్పంగ మేమీ విజనతలమునన్ విస్తరల్ వేసికో మా
సాపాటెల్లన్ విషమ్మై చనియెగదర నీ స్పర్శచే నిట్టి కష్ట
వ్యాపారుల్ రాక్షసుల్గా కరయ నరులె సంహారకాలావతారా 47

కం. అని తూర్పెత్తిన నెల న
వ్వున నాతం డనియె పాపబుద్ధిని గా నో
దనమున బడి యుడికిలి యం
దనగిన మిడినాగుస్పర్శ నది విషమయ్యెన్. 48

మ. అనెనో వాలెనొ వాయసమ్ము సికతావ్యాకీర్ణమన్నమ్ముపై
కొనెనో త్రోటి గళాగ్ని రెండు మెతుకుల్ కోర్కుల్ పిసాళింప తు
ట్టినెనో తచ్చిరజీవితామదము చిత్తై మౌకలీంద్రుండు వే
చనెనో యంతకదూతశేఖర యథాస్థానమ్ముఁ బ్రాపింపగన్. 49

ఆ. వె. ప్రళయకాల చండభాను బింబ సదృక్ష
వదనులైన విప్రవరులు శార
దాచ్ఛపూర్ణిమా సుధాంశుబింబ సమాన
వదను లగుచు సత్యవదను జూచి. 50

ఆ. వె. మొగలి డొంకక్రింద పొయ్యిపెట్టిన మంద
మతుల మమ్ము మనుచు మతివిశేష!
యిది మహావిచిత్ర మీమిడినాగు నీ
కెట్లు తెలిసెనో వచింపు మనగ. 51

ఉ. నా పొలమైన యీ వనమునన్ జననాశము కల్గినంత న
య్యాపద వచ్చి చుట్టుకొనదా నను దైవమునెత్తికోలు క్రే
రేపణయై కృపారసపరీతమనస్కత నాకు నిస్తమ
స్తాపము గాగ నియ్యది ద్విజమ్ములు చేసినమేల్ ద్విజోత్తముల్. 52

తే. గీ. లెండు మా పురోహితునింట వండి వార్చి
సిద్ధమయ్యె నన్నమ్ము భుజింత్రుగాని
యనుచు వారల దోడ్కొని యరిగె నాయ
నారి శివపదారామ సంతతవిహారి. 53

కం. నిరతాన్నదాత యంత:
కరణోచితనీతి మూడుగ్రామములకున్
కరణమ్మయ్యెను నాతం
డిఱుకునబడు తఱచు డబ్బు కిబ్బందియకాన్. 54

మ. పడు నిబ్బందికి తోడు వచ్చెను జమాబందీ శ్రమాస్కందియై
కడు దూరమ్మగు రాజధానికిని వేగమ్మేగనై యచ్చటన్
తడవుండవ్వలె కార్యమౌదనుక చేతందమ్మిడీ లేద యి
త్తొడుగెట్లీడ్చుటయన్ వ్యథన్ విచలితాత్ముండై యతండుండగన్. 55

ఆ. వె. అతనిభార్య చంక నర్భకుతో వచ్చి
యెదుట నిలిచి మీరలేగుచుంటి
రిల్లు సర్వపూజ్య మిక మీరు వచ్చునం
దాక కొడుకు నెట్లు సాకుటనియె. 56

తే. గీ. భయపడెదవేలనే యోసి భాగ్యరాశి
పెరటిలో సన్నబియ్యంపు టొరపు లొరయు
నిసుక యున్నది నీవుంటి వేగుచుంటి
కొడుకు భద్రమ్మటంచు నగ్గురుడు పలికి. 57

మ. ఝుడితిస్ఫూర్తి ఋణమ్ము లందదుకుగా సాధించి యప్పున్కమూ
కుడుకేలంగల యాదిభిక్షుని మన:కూటమ్మున న్నిల్పి కా
ల్నడమై నామడయడ్డుగా పయనమున్ సాగించి వేచేరె సం
ఢడి పెన్‌దండడియౌ మహానగరి నేత్రప్రీతి సద్యస్కరిన్. 58

ఉ. అక్కలవాడలోన మరియాదకు సాదరపూర్ణభుక్తికిన్
తక్కువలెక్కకున్ ప్రథితిఁదక్కక తాల్చిన యొక్క పూటకూ
ళ్ళక్క బసన్ గురుండు దిగనై యిరుగుం బొరుగూళ్ళ సంప్రతుల్
పెక్కురు నక్కడే విడిది పెట్టిరి వేఱొకచోటు లేనటుల్. 59

తే. గీ. కడగి వారిలో కొందరు పుడమివేల్పు
కరణము లతండు లేకుండగాంచి యతని
దస్త్రమున కవిలెలు తీసి దాచిపెట్టి
వట్టి తాటాకుకట్టలు పెట్టిరందు. 60

కం. మఱునాడు జమాబందీ
వఱువాతనె దస్తరమ్ము పరిశీలన న
క్కొఱగామి యెఱుకపడి ని
వ్వెఱపడి యత డంత కలకవీడిన మతియై. 61

శా. అమ్మా పుట్టినదాది నీ పదములే యాధారమై జీవితా
ధ్వమ్మున్ వీతశిలాగ్రకంటకముగా దర్శించుచున్ వచ్చి చి
త్రమ్మిట్లచ్చట చిక్కనంబడితి స్వైరస్ఫార నాట్యాభిరా
మమ్మౌ మద్రసనాగ్రమం దొలయుమమ్మా నేడు నివ్వేడెదన్. 62

తరువోజ. ప్రతిలేని శారదోపాసకుం డిట్లు
భావప్రతిష్ఠిత వాగ్దేవి కెరగి
ప్రతిభాయుతుడు జమాబందికి పోయి
వట్టితాటాకులు వరుసగా త్రిప్పి
చతిచిత్రముగ లెక్కలన్నియు నొక్క
యంకెయు పద్దును నట్టిట్టుగాక
జతపడజెప్పిన సంభ్రమాశ్చర్య
సంభృతుల్ భూవరాస్థానమ్ము దొరలు. 63

కం. ఓ నయనారీ యేమ
య్యా నీ ప్రతిపత్తి గంటమంటని యాకుల్
గాని గణితంపు కవిలెలు
కానేరవొ నీకు నని పొగడ్తలు చిలుకన్. 64

తే. గీ. పూటకూటింటిలోన నపూర్వఫక్కి
కవిలెలకు కాళ్ళువచ్చె నా కన్నతల్లి
యందియలు మ్రోగి మద్రసనాగ్రసీమ
కవిలెలన్నియు నాకు హృత్కవిలె లయ్యె. 65

శా. ఆ పుణ్యవ్రతు డిట్లు పల్క మహనీయానందధారాసముత్
క్షేపుల్ వారిదిపోయి జేనికి నివేదింపం బ్రహర్షాత్ముఁడ
భూపాలుండు నినామముగా జనపదమ్ముల్ రెంట నయ్యంక వి
ద్యాపుంభావసరస్వతిందనిపె నయ్యారే యనన్ సర్వులున్. 66

చం. గణగణ మంచు మ్రోగె జయఘంటిక భూవలయాధిభూసభాం
గణమున లోవికారము నికామమనీషతఁ గప్పిపెట్టి బ్రా
హ్మణ గణకుల్ హసద్వదనమండలులై చనుదెంచి యమ్మహా
గణకునిముందు ముందు తమకైకొను కట్టలు పెట్టి చట్టనన్. 67

ఉ. ఆగ్రహమున్ వహింపకు మహామతి మాదెస నిట్లు భూవరా
నుగ్రహదీప్తి నీదెస ననూనముగా నిది చేసినామనన్
నిగ్రహశీలి నాజనువు నేడు గదా తరియించె భూసురా
నుగ్రహ మిట్లు నాదెస ననూనముగా ననె నల్ల నవ్వుచున్. 68

కం. అనఘుండెల్లర నట వీ
డ్కొని యింటంగొడుకు దాను కోమలి యే మ
య్యెనొ తిండిలేక యెట్లుం
డెనొ యన్ తహతహ కలంప డెందపు లోతుల్. 69

మ. కడు దీనమ్ముగ నింటిమాట తడవంగా వచ్చు నిల్లాలి న
ప్పుడు పైకొన్న చిరాకులో నిసుకతిన్ పొమ్మంటి నేమంటి నం
చుడురాజార్ధకిరీట భవ్యకరుణాపుష్టి ప్రకాశుండు వే
నడచెం దస్త్రము చంకకెత్తుకొని కాంతాపుత్ర వీక్షారతిన్. 70

ఉత్సాహ. దారిలోన నొక్కయూరు తగిలె వాని కచట రం
గారు దేవతాలయమ్మునందు నడకబడలిక
ల్దీఱ విశ్రమించి కొన్నిలిప్త లాత్త శక్తి సం
భారు డతడు లేచి మఱల బాట బట్టినంతనే. 71

కం. అదియేమో మునుపటివలె
నొదుగదు దస్తరము చంక నూరక కదలున్
పొదిగింటి పాపగతి నను
పదమున్ క్రిందికిని జాఱబడు నెగద్రోయన్, 72

సీ. ఒకసారి చుట్టవిప్పుకొని ఫణాగ్ర కం
పముగలేచెడు నాగుబాము వోలె
నొకతూరి మొలనూలి చికిలి గంటల మణి
నాదపూరము తరంగముల రీతి
నొకసారి హృదయమ్మునకు కప్పుడుగ మడ
తలు విప్పెడు ననాహతమ్ము కరణి
నొకమాఱు దళసహస్రకము తామరపూవు
గంధబంధురమైన గాలి పగిది

నొక్కపరి తేటవెన్నెల లొడ్డగిల్లు
కాల్యగతి వింతవింత పోకడలు పోవ
బుసలు రొదలును పెళపెళల్ గుసగుసలును
గలగలలు గాగ దస్త్రమ్ము కక్షమందు. 73

శా. ఏ పాపమ్ము నెఱుంగ నద్భుత కథాహేవాక నీ యోగమా
యాపిండీకృతశక్తిసారము దళమ్మై పట్టెనో దీనికే
మో పూనెన్ మఱి దీనియంతు గనుటెట్లోయంచు నాశ్చర్య భా
వాపన్నాత్ముం డదభ్రవిభ్రమ వశప్రాణుండు వాడేగుచోన్. 74

శుద్ధవిరాటి. అంతం దస్తర మంత కంత క
త్యంతమ్ముం బరువౌచు రాగ వి
భ్రాంతుండై తలపైని పెట్టు కొం
చెంతో యోపికనేగి యాతడున్. 75

శా. అమ్మాయామయమైన దస్తరము బ్రహ్మాండోరు భారమ్మునన్
దిమ్మైమాడు పడన్ మెడల్ నడుము నార్తిన్ సంచలింపంగ పా
దమ్ముల్ తొట్రువడన్ మనమ్మవశమై దానిం ద్యజించెన్ స్వకీ
యమ్మౌగ్రామము ముంద ఱొక్క సికతాహారి ప్రదేశమ్మునన్. 76

శా. ఉద్యద్భానుసహస్ర రక్తకిరణవ్యూహ ప్రతీకాశమై
సద్యమ్మందులనుండి వెల్వడి నిమజ్జత్పద్మజాండమ్ముగా
నాద్యమ్మైన వెలుంగు నాగశిశు రమ్యాకార విద్యుత్ప్రభా
హృద్యమ్మై యటనున్న పుట్టం జొరబాఱెన్ చూడ్కి మిర్మిట్లుగన్. 77

శా. ఆ వల్మీకము చేతనావిలసితమ్మై వానితో నిట్లనెన్
నీ వాత్సల్యపు చంకనెక్కి తలపైన్నిక్కి నీ బిడ్డనై
నీ వాసమ్మున కేను రా ననుచు తండ్రీ చింతిలంబోకు నీ
శ్రీవంశమ్మున కాడుబిడ్డ నగుటల్ సిద్ధమ్ము తథ్యమ్ముగన్. 78

ఉ. ఆకడనుండి నాగవరపమ్మిక నీకడకిట్లు వచ్చితి
న్నాకు ససేమిరా విను వినన్ సహియించవు కోడికూతయున్
రోకటిపోటు కావున నరుల్ నివసింపని స్వచ్ఛసైకత
మ్మీ కమనీయభూమి వెలయించితి నిమ్మహితావతారమున్. 79

తే. గీ. అమృతముం జిల్కు నప్పల్కు లాదరించి
తనకులముతేప తనయింటి దైవతమ్మ
నచట వెలసిన నాగారపమ్మ నమ్మ
నస్వి వలగొని సాష్టాంగ నతులొనర్చి. 80

శా. అయ్యమ్మణ్ణని భక్తి వీడ్కొని స్వకీయార్ధాంగినింగానగా
నయ్యార్యార్థశరీర పాదకమల ధ్యానైకచిత్తుండు వో
సయ్యాటమ్ములుపోవు పాదముల నంస్పర్శమ్ము గిల్గింతలం
దొయ్యారమ్ములు వోయె మార్గసికతాప్రోథమ్ము లుబ్బెత్తులై. 81

తోటకము. అల ముంగిలి చెంతకు నాతడు రా
నలవోకగ దస్త్రమునందుకొనెన్
లలనామణి తద్గృహలక్ష్మియు న
య్యలఘుం డతివం గని యాతురుడై. 82

తే. గీ. ఎట్టులుంటిరి సేమమే యిర్వర కన
నెట్టులుంటిమి మీర్చెప్పినట్టె యుంటి
మెసటి యిసుక సిద్ధాన్న మైపొసగ ననియె
నతివ పతియును మున్నీటి యట్లుపొంగి. 83

ఉ. నా పితరుల్ తరించిరి సనాతనధర్మ విశుద్ధరోచి రా
త్మా పతిదేవతా యనుచు తద్విరహానల జాయమాన హృ
త్తాపము డింద సుందరి నతంద్రుడు పట్టిన బాహుబంధమం
దోపిక దక్కి యా పికకుహూస్వన మంద మృదుస్వనమ్మునన్. 84

ఆ. వె. అబ్బ వదలవయ్య అబ్బాయి చూచు వీ
డింగితజ్ఞు ఇసుక మ్రింగి యనగ
నతడు నవ్వె నవ్వెనామె బాలునకేమి
తెలిసె వాడు నవ్వె తెల్లనవ్వు. 85

సీ. కల్పించె తనవెంట కదలిన నాగార
పమ్మకు నాగారవైభవమ్ము
వేటపాలెమ్ములో వెలయించెఁ దా ధర్మ
కర్తయై శంభులింగప్రతిష్ఠ
తనకినామైన యద్దంకిలో కట్టించె
జనకల్పకమ్ముగా సత్రమొకటి
మఱి యినామైన యమ్మనబ్రోలునొద్ద త్ర
వ్వించె గుణ్ణంగుంట పేరి చెరువు

మనుజ సాధారణుండె సంభావనీయ
ధర్మమార్గానుసారి చిత్తప్రతిష్ఠి
తాంగజారి ధీశమితాంతరంగజారి
న్యాయనయతావిచారి మా నాయనారి. 86

ఆ. వె. నాయనారిపేర నాయని వంశమై
యమరె జగతి నస్మదన్వయమ్ము
పాత్రభూతుడైన క్షేత్రజ్ఞపేర మా
గోత్రసంజ్ఞ నింపుకొనియె పెంపు. 87

కం. భక్తులు ముక్తిరమా సం
సక్తులు లోకోపకారిసత్కార్యసము
ద్యుక్తులు కవితామధు సం
సిక్తాత్ములు పెక్కు రీ విశిష్టకులమునన్. 88

సీ. సంతరావూరిలో స్వామిని వీరభ
ద్రుని మాటలాడించె ననఘు డొకడు
రచియించెను విశేషరామాయణమ్ము రా
వూరి కేశవవరాభ్యుదితు డొకడు
శంభులింగేశ్వరస్వామికి ముఖమండ
పము గోపురమ్ము నేర్పఱచె నొకడు
తిమ్మసంద్రమున ప్రతిష్ఠించె మల్లేశ్వ
రస్వామిఁ దద్భక్తిరక్తు డొక్క

డొకడు స్వచ్ఛందమరణ పుణ్యోత్తరుండు
భక్తితొలకాడు భక్తకల్పద్రుమాఖ్య
శతక నిర్మాణ చాతురీస్ఫారు డొక్క
డెందఱో మహనీయు లిట్లీకులమున. 89

కం. గాయత్రికశుక కులమై
స్ఫాయత్పుష్పఫల సౌరభరసోదయమై
నాయని వంశము వర్ధిలె
నాయతశాఖాసహస్ర మభిరామమ్మై. 90

శా. అందొక్కండగు శాఖయం దుదయమై యాతాతకుం దండ్రి గో
విందున్ హృత్కమలాంతరస్థితున్గా వీక్షించునం చందతె
న్నం దన్ వేంకటకృష్ణమాఖ్యు డెసగెన్ మా తాతకుం దండ్రి పే
రిందేవీ కులపాలికా ప్రణయకీర్తి ప్రీతుడై నిచ్చలున్. 91

కం. ఆ దంపతులకు కౌస
ల్యాదశరథులకు జనించినటు శ్రీరాముం
డాదృతబాంధవ సస్యాం
భోదము శ్రీరాములనగ పుత్రుడు పుట్టెన్. 92

సీ. ఏయూర విలసిల్లు నిందుకళాధరుం
డమరేశ్వరుండు భక్తార్తిహరణు
డౌరయు నేయూరి యుత్తరపార్శ్వమును పురా
గుండికాధ్వము ముదిగుండితటిని
యేయూరి దక్షిణమ్మొసరేగు కడునొయ్యా
రంపువంపుల పోతురాజుకాల్వ
కృషిమహాకార్యపారీణులై యేయూర
మేటిల్లెదరు వెలనాటిరెడ్లు

లట్టి యాలూరునకు మున్సబై చెలంగు
పాపినేన్యన్వయుని పట్టి భవ్యశీలఁ
బరిణయమ్మాడె పర్వతవర్ధనీ సు
నామ శ్రీరాము లస్మత్పితామహుండు. 93

సీ. ఆదినారాయణప్పాఖ్యుండు యోగ వి
ద్యానిష్ఠు డే విజ్ఞురాలి తండ్రి
పతిదేవతాత్వ సంభావనీయ చరిత్ర
యుదయమ్మ యేదయాసదన తల్లి
నయశాలి వేంకట నారాయణప్ప యే
మానినీజన శిరోమణికి నన్న
తాయి శేషగిరీజ్యాజాయయౌ లక్ష్మమ్మ
యే పుణ్యమూర్తిగారాపు చెల్లె

లామె సంతత శివపదధ్యాన హృద్య
గీతికాలపన ద్రవీభూత రజత
శైలశేఖర హిమగండశైల భక్తి
వాయనమ్ములదిమ్మ మా నాయనమ్మ. 94

ఆ. వె. పత్యగస్తుమాట పాటించు పట్టున
పర్వతమ్మ వింధ్యపర్వతమ్మ
విధివిలాసముల నపేక్షించు పట్టున
పర్వతమ్మ మేరు పర్వతమ్మ. 95

కం. వారలకు పర్వతమ్మా
శ్రీరాముల కాత్తపుణ్యశేవధులకు నిం
పార సుతత్రితయమ్ము కు
మారీద్వితయమ్ము గలిగె మనువు సఫలమై. 96

కం. అందరిలో చిన్నది గుణ
సుందరి చినమేనయత్త సుమనశ్శోభా
ళిందముగ పేరటాలై
వందితయయ్యెన్ మదీయ వంశమ్మందున్. 98

వసంతతిలక: ఆ వైపరీత్య మదియంతయు మాకు చెప్పం
గా వేదనాభరిత గద్గదభాషణమ్మై
యా వృద్ధమాత పసియంచుల మాదు చేతో
భావమ్ములం దిగులు పర్వన్ అంపకోత్తై. 99

శా. మందారాంచితశోభ బంధువనికిన్ మాపెద్దమేనత్త పే
రిందేవీ స్వపితామహీ సురుచిర శ్రీనామ యానంద మే
పొందంగా నల యిమ్మనేనికులు నత్యుల్లాసి నల్లూరి వా
సిం దా పెండిలి యయ్యె నాత్మజననీ చిత్తమ్ము రేకెత్తగన్. 100

కం. పేరిందేవీ రాముడు
మా రామయమామ హాస్యమయగాథా భం
డారము నిత్యచతుర్ముఖ
పారాయణ చిద్విలాస పరమార్థమ్మున్. 101

ఉ. వారక మున్న పూర్వముగ వచ్చివ కాకరకాయ మాన్యమై
శ్రీరమణీ నివాసమయి చెన్నలరారగ నిల్లు భోజనో
దారుడు బంధుతాదరణతత్పరు డాయన కాత్మజీవి కా
ధారము కోస మొక్కనికి దండముపెట్టుట వల్వదేమియున్. 102

చం. అఱమరలేదు తిండివిషయమ్మున మామకు మేనయత్త దా
గరగరికైన నేత నొడికమ్ముగ వండు చొకొక్కటంది యీా
కఱకఱలాడుచున్ పెగలుగ్రక్కుచు కమ్మనదైనవాని ని
బ్బరముగ నారగించు పదిపట్టున నిర్వది మాషచక్రముల్. 103

తే. గీ. అత్తయాదరింతలకన్న నతని హాస్య
ధోరణియె మమ్ము నాకులల్లూరి వైపు
తఱుముకొనిపోవు చదువు సంధ్యలకు వచ్చి
చిన్నయపుడు వంగోలులో నున్నయపుడు. 104

ఉ. ఆతడు రామయాఖ్యుడయి యాయమ నల్లురివార లెల్లరున్
సీతమ యంచు బిల్తురు విశిష్టవిచారులు వారి యగ్ర సం
భూతను నాయనమ్మ తన పుత్రునికాలినిగా విధించి సం
ప్రీతివహించె తల్లులకు బిడ్డలపై మమకార మేమనన్. 105

కం. మా తండ్రులలో కడపటి
యాతడు కోట్లింగనాము డాతడు జ్యేష్ఠ
భ్రాతృశ్రీచరణ సమ
ర్చాతత్పరవృత్తి నతడు రామానుజుడే. 106

తే. గీ. తెనుగునాట ప్రజావాణి తీర్చినట్టి
వతనికిని రాని జంగము కతలు కాన
మతడు డాక్టరేట్ బిరుదు లేదయ్యెగాక
జానపదగేయ సాహిత్యచక్రవర్తి. 107

సీ. తలపండ్లు డుల్ల కత్తులుత్రిప్పు బొబ్బిలి
వెలమవీరుల శౌర్యవిలసనమ్ము
పలుగు శాత్రవుమేను పలకలుగోయు దే
సింగు బాహూత్థకౌక్షేయకమ్ము
పసిపాప పాల్గాౢవ వడవడవడకు స
ర్వాయి పాపని భయావహ విధమ్ము
గండుకుక్కల చండ కాలభైరవదేవు
లారె మరాటీల పోరితమ్ము

తళుకు లీని జిగేల్మంచు కళుకు లీని
కంపనములూచి దాయాదికలవరములు
రాచి బాబయ్యగొంతులో వేచి వినెడు
మా పసియెడంద లూహోబ్ధి మందరములు. 108

కం. మా తండ్రులలో రెండవ
యాతడు రాజసము రూప మచ్చుపడిన వి
ఖ్యాతుడు సుబ్బారా వా
స్ఫీతాత్ముని పేరె నాకు పెట్టిరి పెద్దల్. 109

ఉ. ఆతని నే నెఱుంగను మదాగమనమ్మునకన్న పూర్వమై
యాతనిదైన నిర్గమన మశ్రులదొంతర నాయనమ్మ మా
కాతనిఁ గూర్చి చెప్ప విని యప్పు డెఱింగితి నేను నిండు ద
ర్జా తనరారు రూపమున రాసికి నెక్కిన మా పితృవ్యునిన్. 110

తే. గీ. అడ్డబొట్టు నాయనివారి కతడు దత్తు
పోయి నాయనిపల్లికి మున్సబై చె
లంగియును కన్న తలిదండ్రులకును తోడు
నీడయైయుండె వారితో కూడిమాడి. 111

ఆ. వె. మాది నిలువుబొట్టు మఱి యున్న పెక్కు నా
యని కుటుంబములది యడ్డబొట్టు
బొట్టు ఖేదమంచు పుట్టవు భేదముల్
హరిహరాద్వయంబె యందఱికిని. 112

కం. అనఘుడు శేషమ్మ యనెడు
వనితం జేపట్టి విమలవర్తన నానం
దన మయ్యనుబంధము శుచి
జనకముగా శేషిశేష సంబంధంబై. 113

తే.గీ. అగ్రజన్ముడు విద్యానవాగ్రజన్ము
డతడు మా తండ్రి కృష్ణరాయాభిధాను
డాంధ్రమునకు తో డాంగ్లమ్ము నభ్యసించె
కీర్తితమ్ముగ నప్పరు ఫోర్తుదాక 114

శా. మా వంశమ్మున నాంగ్లపుం జదువులం బౌరస్త్యుడై మాతుల
శ్రీవిన్యాసము మాతులేయసహవాసిత్వమ్ము నుత్సాహన
మ్మెమ్మై వంగోలుననుండియుం గురుడు శన్యాదిత్యవారాగమ
ప్రావిర్భావము గోరు నెప్డు హృదయ మ్మాలూరులో బందియై. 115

ఆ. వె. మధుర భాషణములు మంజుల వేషముల్
కన్నుతుదల ప్రణయ కాంతి లతలు
మలుచుకొన్న ముద్దు మఱదం(డ్రు గల మేన
మామ లిండ్లు వలపు వాము లిండ్లు. 116

సీ. గ్రామాధికారిత్వ గరిమనుమించు గ్రా
మప్రజా క్షేమాభిమానగుణము
వ్యవహారదక్షతా ప్రాభవమ్మును పెంచు
తవిలి న్యాయాన్యాయ దర్శనమ్ము
వ్యవసాయ నిపుణతా పరిణతి సూచించు
పశుపాలనాత్యంత పాటవమ్ము
అమరేశభక్తి సంభ్రమముతో సోమించు
నఖిల దైవత పూజనానురక్తి

యెవనియం దాతడే యస్మదీయ మాతృ
కా జనిస్థాన హిమవన్నగ ప్రభుండు
నాయనమ్మకు నన్న మానాయనమ్మ
మేని తొలిపంట మాతండ్రి మేనమామ. 117

చం. ప్రవర వరూధినీ రుచిర భాషణముల్ గజరాజమోక్షణ
ప్రవిమల గేయమింక రసపట్టులు ప్రాజ్ఞహితాంధ్ర సత్కవీం
ద్ర విరచితమ్ములం జదువ తాతయు నద్దమరేయి నిద్రమ
త్తు వదలి విందు ముత్సుకతతో వసివీనులు పుల్కరింపగన్ 118

చం. అవి పఠియించి తాత కరమందున దండము నోటిలోన 'టా
ర్చి' వెలుగుచుట్ట కాళ్ళఁ గిఱుచెప్పులునై యొకరుండ పోయి ని
త్యవిధిగ తూరుపుంబొలము నాపయి పశ్చిమపుంబొలమ్ము నొ
క్కవరుస చుట్టి చూచుకొని క్రమ్మఱు ప్రమ్మిన చిమ్మచీకటిన్. 119

కం. శివభక్తు డాత డుగ్రో
ద్భవతేజము వీరభద్రపళ్లెము ముం దా
రవముగ ఖడ్గాల్ విసరెడు
నవతారము జూచి గుండె లదరున్ మాకున్. 120

కం. ధీరస్వాంతుడు వెంకట
నారన వెంకమ్మయందు నలువురు సుతులన్
శ్రీరుచిరమూర్తు లిరువురు
కూరిమి కొమరితలఁగాంచె కులవర్ధనుడై. 121

సీ. అంబికా సమయ భవ్యాచార సంపత్ప్రి
భా భాస్వరుడు రఘుపత్యభిఖ్యు
డపరంజి నెనయు దేహచ్ఛాయ నధరీకృ
తాంగజన్ముడు మల్లికార్జునుండు
భద్రాద్రిరామానుబంధ సంబంధ శో
భాయుక్తు డాదినారాయణాఖ్యు
డాంధ్రభారతచర్వణాలోచనామృత
రాశి లక్ష్మీకాంత రసికవరుడు

నలువురైనవారు నలువైనవారు మా
కచ్చ మేనమామ లైనవారు
బంధుబలమువారు వ్యవహార పరిపాల
నాతిదక్షు లైన యట్టివారు. 122

సీ. అమలవర్తనులు వెంకమ్మ నారాయణ
ప్పలనోముపంట యే పావనాత్మ
రామకృష్ణుల ప్రతి రఘుపతి మల్లయా
గ్రజుల కేసతి సుభద్రాసమాన
అదెప్పకాంతయ్యలను కూర్మితమ్ముల
చనవు కేముదిత వాత్సల్యధాత్రి
తాయి సుబ్బరావు దారయౌ సుబ్బారా
మమ్మ కేసాధ్వి నెయ్యంపుటక్క

యామె నిజపితామహిపేర నలరు నుదయ
లక్ష్మి లక్ష్మీకళత్ర లీలాసుధా క
థాపరాయణలక్ష్మి సంతానలక్ష్మి
యవతరించె మా పూర్వపుణ్యములు పండి. 123

కం. మా యమ్మగదే యని నా
రాయణుడున్ పర్వతమ్మ యభినందింపన్
మా యమ్మ యల్లుకొనియెన్
మా యయ్యను ప్రణయపుష్ప మల్లీలతయై. 124

శా. తారౌజ్జ్వల్యులు వారిదౌ ప్రథమ సంతానమ్ము సంతానల
క్ష్మీ రాజత్తిలకమ్ము బంధుజనరాజీప్రీతిపాత్రమ్ము సీ
తారామమ్మ నిజాశ్రితాభ్యుదయ సంతానావనీజమ్ము ల
క్ష్మీరామాకృతి పీటవేసికొనె లక్ష్మీకాంతు నుల్లమ్మునన్. 125

శా. అన్నల్ ముగ్గురు నాంగ్లపుం జదువులై యాడాడ నుద్యోగ సం
పన్నత్వమ్మననుండ తండ్రికిని తోడ్పాటై కృషిన్ జన్మభూ
మి న్నిష్ఠించిన మేనమామ యగు లక్ష్మీకాంతు కాంతాస్థితిన్
పున్నెమ్ముల్ ఫలవన్నగావళులుగా పూరించె నాలూరునన్. 126

ఆ. వె. చిన్నితమ్ములకును చెల్లెండ్రకేన తా
నక్క యక్క యామె యందఱికిని
భాగ్యదీప్తి శాంతభావసందీప్తి చం
ద్రమునియక్క దాశరథుల యక్క. 127

మధ్యాక్కర: అక్క వాత్సల్య మెట్టిదియొ వంగోలు నందుండు నాళ్ళ
లెక్కగా శుక్రవారంపు మలుసంజలేచి మార్గమున
చిక్కగా మోకాలిలోతున బురద సిద్ధమై యున్న
నొక్కయూపున నైదుమైళ్ళు నడచి యాలూరు జేరుదుము. 128

సీ. వాగర్తిపొలములపంట కమ్మనివేరు
సెనగలు నాలూరి చేల మొక్క
జొన్నకండెలును మెచ్చుల యూచబియ్యమ్ము
తంపటసెనగలు తనివిదీఱ

చిరుతిండ్లు తిని యక్క చిక్కనిమీగడ
పెరుగుతో ముగియు నోగిరము పెట్ట
ముప్పూట సుష్టుగా భుజియించి ముచ్చుట్లు
చుట్టి యూరంతయు మెట్టచేల

యందములు డెందముల సుధానంద వీచి
కలుగ శన్యాదివారముల్ గడపి సోమ
వారముదయమ్ము బడికి పోవలసి మాకు
నడుగు సాగదు వంగవో లరుగు దారి. 129

మధ్యాక్కర: ఆ యక్క తమ్ము గుజ్జిలము మే మరయంగ నల్వురము
మా యక్క చిన్నిచెల్లెండ్రు నిరువురై మాతాపితలకు
ఛాయాతరులకు నద్భుతముగా సప్తసంతాన భాగ్య
భూయిష్ఠ పరమపుణ్యఫల విభవమ్ము పొసగె దానిట్లు. 130

ఆ. వె. వరుస మేలుగీళ్ళు తిరిగి పల్కిన దప
శ్రుతులు నాయనమ్మ బ్రతుకు వీణ
కట్టుకొన్న మగడు కాలగోచరుడయి
కొంతవెనుక చిన్నకొడుకు పోయి. 131

కం శేషమ్మ పురిటిలో ని
శ్శేషమ్మె తద్విభుండు చింతాతప సం
శోషితుడు కథాశేషుం
డై షణ్మాసములలోన నా మెం గలసెన్. 132

కం. తలగొడుగు చిరిగి యూత
ముక్కల కోలయు విఱిగి వంతఁబొగులు జననికిన్
వెలిపట్టు గొడుగు పట్టెన్
కులశేఖరుడైన పెద్దకొడు కుత్కలుడై. 133

కం. ధీనిధి వేంకటగిరి సం
స్థానోద్యోగమ్ము వట్టి సకుటుంబముగా
మానధనుడు బాల్యస్మృతి
పానీయప్రపను వేటపాలెము వదలెన్. 134

మధ్యాక్కర: వెలుగోటి వంశ భూవిభుల రాజ్యమౌ వేంకటగిరిని
గలుగు తాలూకాలు నైదు నైదును గల రెండు ఖండ
ముల నుత్తరపు ఖండమందు నాడాడ మొనసి యుద్యోగ
విలసితుండై యంత పొదిలెకు విచ్చేసె గురుడు. 135

మధ్యాక్కర: ఖండమ్మునకు నధికారి పేష్కారు కచ్చేరి యందు
మండితుం డగుచు మొదటను దుయ్యంగుమాస్తాపదవి న
ఖండ పండితుడయి మెలకువ లెఱిగి కర్ణాటకమున
మండితుం డయ్యె పిమ్మటను హెడ్డుగుమాస్తా పదవిని. 136

మధ్యాక్కర: ఐదు తాలూకాల కైన యధికార్లు తహశీలుదార్ల
కైదుగురికి పైని మేటియధికారి పేష్కారు సమధి
కాదరమ్మును గన్న తండ్రి క్రమమే చెల్లించుకొనగ
నైదు తాలూకాల మీద నంతుగానని పల్కుబడిని. 137

కం. పినతమ్ముడైన కోట్లిం
గని నా సంస్థానమందె కని ఠాణేదార్
పనిలోన ననుజవత్సలు
డనూనమోదమ్ము నాయనమ్మకు గూర్చెన్. 138

మధ్యాక్కర : వాసిగా జ్యోతిషమందు కుశలుండు పౌరాణి కైతి
హాసిక సకల కథాప్రపంచమ్ము నందు నిష్ణాతు
డీసడింపులు నిచ్చకములు సమమైన హృదయసంవాది
శ్రీసదాతనభక్తిభరితభావసుస్థిరుడు మాగురుడు. 139

మధ్యాక్కర :పొదిలెకువచ్చిన వెన్కనాలూరఁ బుట్టె మా యన్న
పొదిలెకొండ నృసింహదేవ పూతనాముడు నరసన్న
పొదిలె చిన్నమసీదు చెంత నొక చుట్టుపూరింట నెన్న
పొదిలె వాసనలె యూర్పులుగ నితగాడు పుట్టె సుబ్బన్న. 140

మధ్యాక్కర: ఉదయించి వరుసగా సుబ్బరామమ్మయును లక్ష్మణుండు
పొదిలె నిమ్మయ్య నామము ధరించిన పూతచారిత్ర
తుదివాడు సత్యనారాయణుడు సముత్తుంగ గాత్రుండు
ముదమార పెరిగిరి చూచువారెల్ల ముచ్చటపడగ. 141

తే. గీ. అంత పసినాడె నరసన్న శాంతమూర్తి
పరమ సాధు స్వభావుడన్ బిరుదు గనియె
లేనగవు చిల్కరింపులే గాని వీడు
మీదబడి కొట్టుచున్న నేమి యనడతడు. 142

తే. గీ. అది వికార్యబ్దజనన మాహాత్మ్యమేమొ
కలుచ యెఱుగని చిలిపి చేష్టలకు నొగ్గి
కనియె చినపిచ్చివాడను ఘనత నీత
డింక పెదపిచ్చివాడు వా డెవ్వడనిన. 143

మధ్యాక్కర: పురిటిలో జననిఁ గోల్పోయి జనకుఁ గోల్పోయి యావెంట
దరిలేని పసికందు నమ్మ దయమీఱ తమవెంట తెచ్చి
మఱదికుమారుని తనకుమారుని మాడ్కి పెంచంగ
పెరిగినవాడు మాకంటె కొంచెము పెద్ద శేషన్న. 144

చం. దుడుకు తనంపు సేతలకు దూసిన తూణములోని బాణ మ
బ్బడియయవారి శిక్షయను పంటికి లొంగని నూవుజీడె వెం
బడిబడి పట్టదూకెడు సివంగుల కందని లేడిపిల్ల మా
బుడుతలలోన శేషగిరి పొచ్చెము నొచ్చెము లేని యల్లరిన్. 145

సీ. ఎపుడెక్కునో నిర్మమేశాన రథశిఖ
రాగ్రకేతనయష్టినంటి నిక్కి
నెపుడుప్రాకునొ ఫలాహీన జంబూతరూ
త్తాలశాఖాశిఖాస్థలిని త్రొక్కి
నెపుడుదాటునొ గీత నెగసి తన్నునొ కూతఁ
బ్రతిపక్షులడలిపో బలిగుడాడు
నెపుడేమిపుట్టునో యేచి దయ్యపుటాట
నస్మదాదుల గుండెలవియజేయు

పొలములో మేయు బడిగుఱ్ఱములను జూలు
పట్టి యొడుపుగనెక్కి సవారిసేయు
కళ్ళెమును జీను పనిలేని గడుసురౌతు
శేషగిరి బాలవీరతాసింధులహరి. 146

తే.గీ పొదిలె చదువెల్ల నొకరీతి పుణికి పూర్తి
యైన దనిపించి యుక్తవయస్సురాగ
పైతృకమ్మైన మున్సబీపనికి వేట
పాలెమేగియు మఱువండు వాడు పొదిలె 147

మ. హృదయాధీశ్వ నిర్మమేశ్వర శుభ శ్రీపాదపద్మాసవా
స్వదనాలోల నితాంత భక్తిరసవత్సంగీతసంభార ష
ట్పదు డాతండు భవమ్ము పావనముగా పట్టించె నిత్యార్చనా
విదితాత్మీయ విభూతి వైభవ సముద్వ్యత్తిన్ శివస్వామికిన్. 148

తే.గీ పొదిలె నిర్మమేశునకు విబూదిపండు
పండు చెల్లంగ పం డొక్క భవ్య దీక్ష
బూని పంపె యావజ్జీవము నతడు భవ
భీతులట భవభూతులై వెలుగులీన. 149

కం. నరసన్న పెద్దచదువుల
నరయన్ మును వంగవోలు కాపై బందర్
పురమునకు నెక్కె నేనుం
గఱచితి నాచదువు లా ప్రకారమ్మునసే. 150

తే.గీ వంగవోలున మా యున్కి బంధుకుశలు
డమ్మ పెదతమ్ము డాదినారయ్య యింట
బందరు పురమ్ము నందు సౌభాగ్యరాశి
యమ్మ చెల్లెమ్మ సుబ్బరామమ్మయింట. 151

ద్వి. చినమేనయత్త నచ్చిన పెద్దకొడుకు
తన మేనబావ చేతమ్ము నకెక్కి
తాయివంశమ్ము క్రొత్తడిరైన తల్లి
మాయదృష్టమ్మున మా పినతల్లి. 152

ఆ. వె. అక్క యన్న నెంతయాదర మ్మామెకు
మమ్ము చేరదీసి మనిచె నట్లు
గానినాడు మాకు గలవె యీచదువు లీ
శ్రేయమెల్ల నామె చేతిచలువ. 153

తే. గీ. మగనిపే రుచ్చరించని మాన్య నన్ను
చీర నవసరమై 'నరసింహరావు
తమ్ముడా ' యను నవ్వుదొంతరలు నిగుడ
పరమగంభీరమౌ భర్తృవదనవీథి. 154

ఉ. ధీమణి యాశ్రితార్థజన దీనదశాంధహరద్విహాయస
శ్రీమణి పీనసుందర శరీరలసన్మణి తాయివంశపుం
గ్రామణి యాధిపత్యకృత గౌరవమయ్యు సదా నిగర్వచూ
డామణి శేషపూజ్యాని స్ఫటామణి మాపినతల్లి భర్తయున్. 155

కం. మితభాషి విమలశీల
వ్రతు డాబాబయ్య శాంతవననిధి 'నీకున్
మతిపోయెనేమిరా ?' యని
యతడన నది యతని కోప మనుకొనవలయున్. 156

కం. పొరుగూళ్ళయందు విద్య
స్గఱచుచునుండియు ననుక్షణము మామనముల్
తిరుగుడువడు పొదిలె నివస
ధ రుచిరతర చిరపరిచిత ధామము లందున్. 157

సీ. మెడపల్లు లూడ్వ నంబే యంచు నెగిరి త
ల్లులకునైదూకు లేగల వడుపున
కాడి విప్పగనె తోకలనెత్తి కట్టుమ
ట్టేడనం చుఱికెడు కోడెలట్లు
దివసావసానమ్ము తిలకించి తమకించి
గూళ్ళకైపాఱు పుల్గుల విధాన
దూరమ్ముగొనిపోయి త్రోపాడు నంతలో
క్రమ్మఱు కొలేయకముల రీతి

సెలవు లిచ్చిరో లేదొ నిస్సీమమైన
యుబ్బు మానసకూలమ్ము లొరసికొనగ
నన్న శేషన్నతోడి విహారములకు
పోయి పడుదుము త్రుటిలోన పొదిలెలోన. 158

ఆ. వె. శేషగిరియు నారసింహుండు నేను న
త్యభినవానసూయ తాంతరంగ
పొదిలెతల్లియంకమున బాలకేళీప్ర
మోదవివశిత త్రిమూర్తులమును. 159

కం. మా ముపురన్ మధ్యస్థుం
డై మెఱసిన యగ్రజునకు నన్వయ సుస్థి
త్యామూలాగ్రవిచార
శ్రీమంతున కాత్తకీర్తి సీమంతునకున్. 160

కం. ఉదయమ్మా కృష్ణారా
యదంపతీ పూర్వభవకృతాఖిలసుకృతా
భ్యుదయామర భూజరుచి
ప్రదప్రథమపుత్రరుచిర ఫలరూపునకున్. 161

కం. పొదిలెధరాభృత్ప్రస్థాం
గదాయమానాలయ ప్రకాశిత నరసిం
హ దురితహరణసమర్థ
ప్రదీపదివ్యాభిధాన పావిత్ర్యునకున్. 162

కం. ఆముష్యాయణునకు వి
ద్యామార్తాండునకు నుత్తమాంధ్రాంగ్లకవి
త్వామృత నిరంతరాస్వద
నామోదపరీతమానసాంభోజునకున్. 163

కం. నిశితమతిసాధిత న్యా
యశాస్త్రపారీణ పండితారాధ్యునకున్
కుశలమృదువాదరచనా
వశీకృతన్యాయమూర్తివర్గాదృతికిన్. 164

ఆ. వె. అభ్యుదయపరంపరాభివృద్ధిదముగా
పొదిలె గథలెల్ల పొదువుకొన్న
వర్ణనా విశేషవై భవోజ్జ్వలము నీ
సుకృతి నీయగాంచి సుకృతినైతి. 165

శా. సావిత్రీ హృదయప్రమోదనవిధా సారస్య సంభావ్యప
ద్యావిద్యోతిత నిర్మలప్రణయ చంద్రాలోకరంగస్థలా
సావిత్రీ చతురాస్యవత్పిత్రు సమంచత్పాద సంసేవనే
చ్ఛావిస్ఫారిత భక్తిసంభరిత సత్సంతానభాగ్యోజ్జ్వలా 166

కం. ప్రథితాంధ్ర మహాభారత
కథాకథన సంవిధానగత శిల్పప్రా
ణథమన్యాకలన కళా
పృథగ్విధ సదావధాన విస్పృతమనీషా 167

మాలిని. అమలినగుణకేళీ యన్వయాంభోజహేళీ
సుమధురమృదుభాషా సూరి సాంగత్యతోషా
విమతదమనవేదీ విశ్రుత న్యాయవాదీ
శమిత విషయ రంహా సాత్త్విక శ్రీనృసింహా 168

కం. నాయని సుబ్బారాయ క
వీయమ్మీ జన్మభూమి నీయది తద్వం
శాయత సుషమా వర్ణా
మ్నాయ మ్మవతారికాఖ్యమండన మెసగున్. 169

----- 0 -----

# ప్రకృతి ఖండము

శ్రీరమణీ వాణీరమ
ణీ రూపిత పరమభాగ్య నిస్తులవిద్యా
పారాయణ విశ్రుత చరి
తా రాజత్కీర్తిశోభితా నరసింహా. 1

## నెల్లూరి సీమ

కం. హరివంశోత్తర భారత
పరమార్థము తెన్గుమాటఁ బండించినయా
గ్గురుమూర్తిత్రయి నిరువుర
కిరవటె నెల్లూరిసీమ నేమని పొగడన్. 2

ఉ. ఈదరపాలవెల్లి నివకెక్కినమేనికి కించిదుష్ణతా
పాదనకేళి నెంత భగవంతున కాభువిపైనిప్రేమ ప్ర
హ్లాద దయావనత్వమను వ్యాజమునన్ సకలోర్వరా సమా
హ్లాదకరమ్ముగా నృహరియై విలసిల్లిన చక్కనయ్యకున్. 3

మహాస్రగ్ధర.

వెలిగొండల్ త్రొక్కి వేడ్కల్విరియ పొదిలెపృథ్వీధరమ్మెక్కియాపై
చెలువౌ శైలమ్ములెల్లన్ చెలగి తిరిగి మేన్ సీతువోవంగ హర్షో
జ్జ్వలుడై నెల్లూరి సీమన్ వలచి వసుమతీవల్లభుం డాదటన్ పెన్
శిల కోనం దూటి సౌఖ్యస్థిరత నలరు లక్ష్మీనృసింహుండుప్రీతిన్. 4

తే. గీ. వేదగిరిపైని వెలయు నయ్యాదిమ ప్ర
సన్నతేజమ్మునం దొక్కచిన్ని తళుకు
వింత విచ్ఛిత్తితో కదంబించి మూర్తి
కట్టినట్లొప్పు సింహవిక్రమపురమ్ము. 5

ఆ. వె. సరసహృద్యమైన చతురతా గరిమమ్ము
వెన్నతోడబెట్టు విద్యగాగ
నిర్ఘరామృతమ్ము నెల్లూరు నెఱజాణ
పెన్న పొదువుకొన్న సన్నుతాంగి. 6

## పెన్న

ఉ. ప్రన్నని తేటనీటి మురిపమ్ముల రాజతవర్ణసైకత
చ్ఛన్నదుకూలకూల పరిసర్పిత సుందరతానిరూఢిఁ దాఁ
బన్నినమేర సర్వము సువర్ణము బండ్లకు బండ్లకెత్తు మా
పెన్నకు సాటియే పృథుగభీరతరంగిణు లెన్నియేనియున్. 7

ఉ. ఏఱులవెన్నిలేవు, వరియించిన క్షేత్రములెల్ల శాలిసం
భారములై రహించు ననుభావ సరస్వతు, లైననేమి నె
ల్లూరు పదీనమౌ కలమలోకనివేదన మొక్క పెన్నదే
సార తదంబు వర్ధిత లసద్రుచిపాక మనన్య సాధ్యమై. 8

ఉ. ఏ రసరాశిపోకడల నించుకయించుక గుర్తెఱింగి శృం
గార రసౌచితీ మధుర కావ్యకళాజనిభూములైరి నె
ల్లూరి కవీంద్రు లా రసమహోదయ పెన్న విముగ్ధరాగ శృం
గార తరంగ గాన గమకధ్వని పారము ముట్ట శక్యమే. 9

చం. చరణ శిరోగ్ర సంజనన సంవస నామరనిమ్నగార్దుఁడౌ
హరిహరనాథు భక్త పరమాకృతి తిక్కన భారతావగన్
వరదలుగట్టు తెన్గునుడి వంపుల సొంపుల కెల్ల మూలమై
వఱలిన దీ పినాకిని స్వభావమనోజ్ఞ సరస్వతీ గతిన్. 10

ఉ. అక్షరుడౌ నృసింహవిభు నాదరి వేదగిరిన్ విధించి స్వీ
యాక్షులు మూట మూవురగునయ్యల మాటిన లోకనేత్రి కా
మాక్షిని జన్నవాడమహితావని నీదరి పాదుకొల్పి మ
ధ్యక్షితి సర్వభూతకలుషాపహతీర్థము పెన్న పేర్చెడిన్. 11

## ముసి

కం. ఆ పెన్న కనుగు గత్తియ
లై పడమటి కొండలన్ మహోర్భట వేగో
ద్దీపిత హల్లీసక లీ
లాపరపార్వతులు పెక్కులౌ సెలయేఱుల్. 12

తే. గీ. గంతుగొను వానిలో నొక్క వింతలాడి
జననమొందిన కథ మహాశ్చర్యకరము
శ్రీనృసింహపదాబ్జ వాసితపదమ్ము
లల్ల వెలిగొండల శిరస్సులెల్ల వెలుగ. 13

కం. వెలిగొండలవియు శేషా
చలపుచ్ఛాకారశైల సంతతి తనపై
నిలిచిన దేవుని బరువున
కలగొని తలలెల్ల చాపకట్టు వడంగన్. 14

చం. ఉరగులతేనికొండ తలయూపిరి తోకకు వచ్చి బాధతో
గుఱుతులు తప్పినట్లు వెలిగొండలు నల్లలనాడ నందు సు
స్థిరుడయి శ్రీపతిన్ మదిని జేర్చి తపమ్మొనరించు దేవతా
గురునిభుడైన మౌని ముచికుందుని ధ్యానసమాధి భగ్నమై. 15

శా. ఓ నా హృత్కమలాధి దైవతమ నీ యుద్యోగమేమయ్య కా
లూనన్ శేషగిరీంద్రమస్తకమునం దూటాడి పుచ్ఛాకృతి
శ్రీ నాగావళి యిట్టులొడ్డగెడవై జృంభించునాయేమి స
ర్వానర్థమ్ములు ధాత్రినంచును నతం డాక్రోశముం జేసినన్. 16

కం. అచ్చపు మునీశ్వరుడ వీ
వచ్చట నుండ నికనేమి యను ధైర్యముతో
నిచ్చట కాలూనితి నో
సచ్చరితుడ యంచు స్వామి సన్నగ నవ్వెన్. 17

ఉత్సాహ. ఒంటిగా పురమ్ము వెడలి యుద్ధమొల్ల కేగు నా
కొంటె కృష్ణు వెన్నుదన్ను కోపి తన్నుఁ దన్నగా
కంటి చూడ్కి నీఱొనర్చు కాలయవను నాటి పెన్
దంటతనపు నిక్కు స్మృతికి దనిలి యూహసమ్మునన్. 18

శా. నాభావమ్మున నాటినిక్కుకరుణ న్మన్నింపవే సూక్ష్మశి
క్షాభూజాని పయఃపయోధిమధనక్ష్మాభృత్సముద్ధారకా
నీభారమ్మనకేను తూకమటవే నీవున్ ద్వివిధాభాగమై
యీభాగమ్మనగూడ కాలిడినగా కీ క్షోభ చల్లారునే. 19

మ. అనివేడన్ ముచికుందు డవ్యయకృపావ్యాపారపారీణతా
ఖని యాదేవుడు నారసింహమహితాకారమ్ముతోవచ్చి గొ
బ్బునవాలెన్ వెలిగొండకొమ్ముపయి దిగ్భూమీనభోభాగన
ర్తనతన్మూర్తిసమిద్ధతేజము ధరారక్షావతారమ్ముగాన్. 20

మ. వెలిగొండ్రాయడుగాగనిట్లు విభుడున్ వేతత్ప్రతిష్ఠామహా
ఫలభాగ్యోదయుడై తరించె ముని తద్భారానతాంగమ్ముగా లై
వెలిగొండల్ కలగుండు మాని స్థిరతా విశ్రాంతిమై నిల్వగా
తలలెత్తెన్ బరువేది శేషగిరి శ్రీధామప్రభాధామమై. 21

కం. వెలిగొండదేవు నభిషవ
సలిలము శ్రీవిష్ణుపాదసంభవగంగా
జలసమధికవైభవమై
సెలయేత్తై ధరకు చెంగుచెంగునదూకెన్. 22

కం. ముచికుందుని పేరిట నది
ముచియై జనవాక్యమందు ముసియై శుచిమ
ద్రుచిమద్రససంభార
ప్రచరణ రచనాతిసుందరత నొప్పారున్. 23

ఉ. ఎప్పుడువచ్చునో నురుగులెత్తు తరంగల తాకునన్ దరుల్
విప్పుకొనన్ లయాతిభయవిస్మయతాపరిణాహమూర్తియై
యెప్పుడు తీయునో యుపశమించెడు జీవనమట్లు చప్పగా
చెప్పగలేముగాముసి యచింత్య గతాగత చిద్విలాసముల్. 24

"గుండ్లకమ్మ నాగుంటికి చాలదు
ముదిగుండియు నాముందుకు చాలదు
నల్లవాగు నానడవకు చాలదు
పాలేరది నాప్రక్కకు చాలదు
మన్నేరది నామడమకు చాలదు
మిసమిసలాడే మేని పొంగుతో
ముసిముసి నవ్వుల ముద్దులు గులికే
ముసి వచ్చిననే ముచ్చట నాకని--" 25

మ. దరహాసానను డంబుధీశుడు సమస్తప్రౌఢ కల్లోలినీ
వరశృంగార రసాధినాయకమహాపట్టమ్ము పాటింప క
బ్బురఁపున్ సిబ్బితిఁ దొట్రుపాటగు ముసిన్ పొంగారు నాకాంక్ష స
త్వరసంశ్లేషమునందు బట్టునటె తత్సౌభాగ్య మేపాటిదో. 26

పొదిలె

కం. ఆ ముసి ప్రాగుత్తరముల
నామడలో నర్ధవలయితాభరణంబై
సోమింప ప్రకృతికాంతా
సీమంత మ్మొక్కయూరు చెన్నలరారున్. 27

తే. గీ. వట్టి యారణ్యక విచారభరితహృదయ
భారమ్మును సర్దుకొనుతమి వచ్చివచ్చి
ప్రకృతి యుపనిషద్భవ్యసౌభాగ్యగరిమఁ
బరమపురుషుని కృపకు పాల్పడిన యూరు. 28

తే. గీ. నిత్యనీరస శుష్కవనీ విహార
వై మనస్యమ్ము తలుగంగ వచ్చివచ్చి
ప్రకృతి సంతతనిర్మలరససమార్ద్ర
భావలాలిత్యమునకు పాల్పడినయూరు. 29

తే. గీ. విగత సౌకుమార్యము లాటవికపుపాత
పాటనలమీది విసుగుతో వచ్చివచ్చి
ప్రకృతి సరిక్రొత్తవింతహారంగు పచ్చ
పచ్చ సింగారములకు పాల్పడిన యూరు. 30

ఆ. వె. పుణ్యదేవళములు పొదలి సుధామధు
రాచ్ఛతరజలాశయములు పొదలి
అందమొలుకు బహువిధారామ నిత్యసం
పదలు పొదలి యదియు పొదిలెయయ్యె. 31

## పొదిలె పరిసర ప్రకృతి

ఆ.వె. అది యజ్ఞపోత్రి సాదరమేదుర
ప్రణయరక్తి నబ్ధిమునుగకుండ
నూదువేళఁ బొడము నుర్వీమహాదేవి
గగురు లట్టి గడ్డగట్టినేమొ. 32

ఆ. వె. అదియజ్ఞపోత్రి యద్భుతాలింగనా
వేశకలితఘర్మబిందుపటలి
మందచలనపవనమందాతిపోక ధా
త్రీరమాంగయష్టిఁ బేరెనేమొ. 33

కం. గుండులదండలు పలకల
మండెలు కాఠిన్యమూర్తిమద్గండశిలా
పిండమ్ములు ఱాబండల
బండరువులు పొదిలె చుట్టుప్రక్కల భూముల్. 34

చం. కఠినపుచిప్ప తూట్లుపడగా నెగదన్నుకవచ్చెనో మహీ
జఠరమహాగ్ని కుండవిలసద్పృథుకీలల గాఢతప్తమౌ
పిఠరములోపలన్ పెటిలిప్రేలినలోహపులాజలెల్ల త
ల్లుఠనకఠోరవీధి నవలోకనరమ్యము లాదృషత్తులున్. 35

ఉ. పొచ్చెములేనికూరుములు పొంగులునాఱగ నాడియాడి యే
కచ్చెలుపుట్టి మచ్చరము క్రందుకొనన్ విరజిమ్మి పోయిరో
యచ్చనగండ్లు నిర్భరబలాఢ్య పురాణమనుష్యబాల లం
దెచ్చట జూచినన్ గజిబిజింపుల గుట్టలుగుట్ట లశ్మముల్. 36

సీ. ఒకమహారాజు రత్నోజ్జ్వలసింహాస
నాసీనుడై కొలువమరువేళ
నొకమహాసేన దర్పోద్ధత చతురంగ
మూర్ఛితవ్యూహమై యున్న వేళ

నొకమహాక్షేత్రరథోత్సవాలోకనా
    యాతమానుష్యకమ్మలమువేళ
నొకమహాతీర్థ సేవోత్సాహజనగణ
    మ్మఘమర్షణస్నానమాడువేళ

నే మహామాంత్రికుని దయాహీనహస్త
దండమాడెనొ తచ్ఛిలాధ్వమ్ము లెల్ల
చేతనారహితోపలాశ్రితము లయ్యె
మానవాకార సౌందర్యమండితములు. 37

ఆ. వె. ఒక్కబండమీద నొదిగి నిల్చుండు వే
    ఱొక్కతాళనగసముచ్ఛ్రితంపు
    బండ స్వామియాజ్ఞబడయగావేచి .యా
    రీతి ఱాయిదైన భృత్యవరుడు. 38

ఆ. వె. ప్రకృతి యౌవనాంగి పయ్యెదలో నిక్క
    బొడుచుకొన్న పాలకడవ యొక్క
    గుట్ట దానిమీదిగుండు నీలప్రభా
    శోభిదైన దానిచూచుకమ్ము. 39

ఆ.వె. ప్రకృతి చీరమార్చు పావడమార్చు కం
    చెలయుమార్చు సహజసిద్ధమైన
    ఱాళ్ళదండలెట్టి రత్నభూషణములో
    తీసివేయు నింతధ్యాసలేదు. 40

శా. తుట్టెల్ తుట్టెలుగా జరామరణ నిర్ధూతమ్ముౕలై యోగి స
మ్రాట్టుల్ వోలె సమాధినిశ్చలవపుర్మాలాభిరామమ్ములై
గుట్టల్ గట్టులు చట్టులంతరితదృక్కోణమ్ములై నిత్యతా
పట్టప్రాప్తి నఖండశాశ్వత పరబ్రహ్మ స్వరూపాంకముల్. 41

కం. ఈదృశ శిలాకలాంత
ర్వైదుషియది వట్టిచట్టుబండలు కాదున్
పాదపలతా వితాన
శ్రీదర్శనరమ్యముల్ ధరిత్రీధ్రమ్ముల్. 42

కం. అగనామసామ్యమున పె
ల్లగు పెంపు లహోసహోదరాచ్ఛప్రేమల్
భృగుపాషాణమ్ములు వృ
క్షగణమ్ములు నల్లిబిల్లిగా నల్లుకొనున్. 43

చం. ఖగపతి మాతృదాస్య విషకర్కశరోగనివారణోద్యమ
ద్విగుణితవేగుడై యమృతబిందువులాయములందుజింది య
య్యగణితగండశైలనివహమ్ముల జీవము చిమ్మిరేగెనో
యెగసి నభోంతరాళ పథహిండనదక్షము లెల్లవృక్షముల్. 44

ఉ. కొండల పాదదేశముల గూడిన మృత్తిక సారమేమొ త
త్పిండములోన నంకురితబీజము కవ్యుదరాంతరాళమం
దుండి బహిర్గతమ్మయిన యూరుపువిద్యవిధాన నడ్డమౌ
బండలు చీల్చిపైకెగయు ప్రస్ఫుటచేతనతాపతాకయై. 45

మ. అటుగా కొక్కెడ నొక్కభూరుహము సయ్యాటమ్మ వాటించు త
త్పటుశాఖానిచయ ప్రసారకలనాబంహిష్ఠరాగైకసం
ఘటితాశ్లేషపరంపరాపరవశగ్రావాళితోడన్ సము
ద్భట పాషాణ పలాశిపంక్తికట నీబాంధవ్యముల్ నిత్యముల్. 46

తే.గీ. మరకతచ్ఛవు లీనెడు మంజుశాద
సమితిపెట్టిన పానవట్టములమీద
గౌరవర్ణమ్ములును నీలకంఠరుచులు
గండశిలలెల్ల శంభలింగమ్ములచట. 47

తే.గీ. అధికఫల పుష్పపత్రభారానతద్రు
శాఖలుద్యన్మనోహరశబలరుచులు
జాతిలింగమ్ములకు నవరత్నఖచిత
మకరతోరణాలంకార మహిమగూర్చు. 48

ఉ. అక్షయకంటకావృతములైనకుజమ్ములు గండశైలసం
ధుక్షితమోహపావకునితో చెలగాటములాడు కంటకా
గ్రక్షుధితానురాగశితకాంతులసూదులు గ్రుచ్చిగ్రుచ్చి దం
తక్షతముఖ్యమాన్మథవిధానవిలాసవిధాచమత్కృతిన్. 49

ఆ.వె. పడుచుముల్లువాడి బండకుదెలియు నా
బండవేడియెఱుగు పడుచుముల్లు
వాడివే డి జోడుగూడిన జాడలే
బలుసుచెట్ల నిండపరువుపండ్లు. 50

చం. సునిశిత బాణజాలముల చొప్పున నాయములంటి మర్మవే
దననొనరించు క్రూరతకు దైవతభోజనమట్లు నాలుకన్
తనియగజేయురుచ్యతకు దైత్యసురప్రకృతుల్ విభాగమై
మొనసినద్వంద్వమాబలుసు ముండ్లకు పండ్లకు సాటియేవిలన్. 51

తే.గీ. సూర్యచంద్రకరమ్ములు సోకి శిలలు
కరగు టదియు నుత్తమ కవికల్పనమ్ము
ముండ్లగిలిగింతలకు శిలల్ పులకరించి
కరగు టిదియు నుత్తమకవికల్పనమ్ము. 52

మ. ఇక సాజాత్యసరాగసంపదల సొంపేమంచు నూహింపనౌ
ప్రకటప్రేమనువర్ణపాశసతతాబద్ధాంతరంగమ్ముల
ట్లొకచె ట్టింకొకచెట్టుతో పెనగు నాయొయ్యారముల్ నిత్యకౌ
తుకమగ్నాత్ముల జేయు చూపఱుల నెందున్నేత్రపర్వమ్ములై. 53

ఆ.వె. పెనగులాట మొదలుపెట్టిన దెచ్చోట
నంతమేడనన్న చింతయెల్ల
మొదలు నడుము తుదయు ముట్టనశక్యమౌ
బ్రహ్మపదము నెఱుగవచ్చుననుట. 54

తే.గీ. పఱపయిన కొమ్మలను జడల్ విరియనూగు
సువ్వితాండవ శివుడొక్క జువ్విచెట్టు
దాని మ్రావులోమ్రానుగా తలనిగుడ్చు
నట్టుచేతిత్రిశూలమ్ము నిట్టతాడి. 55

ఆ.వె. పెద్దచెట్టుమొదలు పెనవేసికొని వేఱు
చేయరాకపెరుగు చిన్నచెట్టు
అన్నగోచివెంట ననయమ్ము పాయక
తగిలి తిరుగు పిన్నతమ్మునట్లు. 56

శా. బీజావాపమదేమియున్వలదు నీర్వెట్టంబనేలేదు స్వే
చ్ఛాజీవమ్ములు వింతవింతతరు లశ్వత్థామ్రశాండిల్యకో
లీజంబూవటశిగ్రుదంతశఠగోలీఢామ్లికాకాకచిం
చీ జీమూతజపాజటీక్రముకరిఖింటీసర్వతోభద్రముల్. 57

## కొండలమీది జలదేవతలు

చం. గగనధునీవతద్రయవికంపితజూటము చిక్కుజీరులన్
మిగిలినగాంగవారి యుపమింపగరానివికీర్ణకాంతిలో
నిగనిగలాడు శంకరుని నీడలు కొండలు వానిసానువుల్
మొగి చెరువుల్ దొనల్ దొరువులున్ జిలుజిల్లను నీటిబుగ్గలున్. 58

శా. పాతాళమ్మున సప్తవాయుచలనవ్యాపారసంస్తంభవే
ళాతంకమ్మున నూపిరాడక సముద్యత్పూర్ణజంఘాలతాz
స్ఫీతాధ్వమ్ముగవచ్చి సర్వసలిల శ్రీదేవతల్ గాలికై
ప్రీతిన్ రచ్చలుదీర్చుకూటములు పృథ్వీభృన్మహాప్రస్థముల్. 59

సీ. ఒక పల్వలాసమవ్యూఢతీరంకషాం
భస్తరంగములుగా ప్రస్తరించి
ఒక ప్రసన్నాప్యకూపకహిమానీశీత
లాంబుసంస్పర్శలో నందగించి
ఒకచెంబుమాత్ర మించుకపట్టు నొకనీటి
బుగ్గలోపల బుంగమూతివెట్టి
ఒకకత్తి కోసిన ట్లొకచట్టుచీలి క
పాలమోక్షముగ జీవనములెగచి

సకల జలదేవతలునీ వర్షాసమయ వి
లాస నూతనలావణ్యలలితమధుర
మూర్తులై వనదేవతాభ్యుదయరసము
చిమ్ముచుందురు కొండనెత్తమ్ములందు. 60

తే.గీ. ప్రకృతియందమ్ము పురివిప్పి పగులబడిన
కరణినొప్పు నెమిళ్ళ కేకాస్వనముల
నవశలై వారిదేవత లాడుచుండ్రు
కొండకొమ్మల జాఱుడుబండలాట 61

మ. సలిలమ్మంతయు నాకవెట్టుకొని నిచ్చల్ తచ్చనల్ వోపు నా
టలమాణిక్యములార మాదగు నభీష్టమ్మింతమన్నించి య
మ్మలలెల్లందిగివచ్చి యింకనయిన న్మాగోడు పట్టించుకో
వలదా యంచు జనమ్ము పెట్టు మొఱకున్ స్వాంతమ్ము జాలింబడన్.
62

## సెలయేళ్ళు

పంచ. ధరేజిన ప్రియోపకారతత్పరాత్మ యొక్క పు
ష్కరాంబ కొండమీది ప్రేమక్రాసి వారిధారలై
ధరాధరప్రపాతమంటి ధాత్రిఁజేరు విభ్రమ
న్నిరూఢమంథరమ్ముగా ననేకనిర్ఝరాకృతిన్. 63

పంచ. అతీవవేగనాట్యకంపితాద్రిరుద్రమ స్తవి
చ్యుతాభ్రగంగ విప్రలంభశోణ యైనయట్లు పా
ర్వతేయధాతురక్తరాగరంజితప్రవాహ వి
స్తృత ప్రచారవీధినేళ్ళు జేగురుల్ వెలార్చెడున్. 64

పంచ. సముద్రమందు నావమీద చాలకాలమూగి నే
లమీదఁబోవు నావికుండు లాన్యపాదుడెట్లొ కొం
డమీదనుండి దొర్లువేగడంబరమ్ము లట్లు నే
లమీదఁగూడ చూపునేళ్ళు లాసిపాఱువేళలన్. 65

పృథ్వీ.నగమ్ములను మత్తనాగములు నైజతుండమ్ములన్
ప్రగాఢముగ సాచి సాగరముఁబట్టు నుంకించిన
ట్లగణ్య వమధూత్కరాంచిత మహోరసాకారముల్
ప్రగల్భగతి విప్పుకొం చవనిఁబాఱు నానార్ఝురుల్. 66

పృథ్వీ.ధరావిషమభూములం దమితదర్పవేగమ్ములై
నరాన్వయము పొంగ హర్షమున నడ్వలాకమ్ము లు
ర్వరాంకములు గాగ తత్పరిసర ప్రదేశమ్ము ని
ర్ఝరాంకములు తీర్చు భూతదయ జాలువాఱంగనై. 67

## జలధార వ్యవసాయము

కం. సెలలల కానకట్టలు
పోసెదరనువైనచోట్ల పొలములుతడుపం
గా సలిలధార కాల్వలు
తీసెద రెడతెగని కార్యదీక్షన్ కృషికుల్. 68

కం. క్రీడించి మిట్టకెక్కగ
మోడించు కబంధరాశిఁ బూనికతోడన్
తోడుదు రెగబోతలుగా
గూడలు పడిపోవ వెదురుగూడలతోడన్. 69

కం. వాపీకూపతటాక
శ్రీపాథస్సమితి వెల్వరింతురు భువిపై
దీపింప పైరుపచ్చల
దేపనిగా మోటదోలి తెఱచియు తూముల్. 70

చం. చెరువుల తూపరాణు లతిచిత్రవిశారద లంతరంగ ని
ర్భరరస మెల్లకాల్వలకు పాయక పంపిణిసేయుచున్ రసా
భరణ మనోహరమ్ములగు వప్రవిశేషములన్న శ్యామ సుం
దర మృదువర్ణచిత్రము లుదారతవ్రాసెడు చిత్రరేఖలై. 71

ఆ.వె. మోటబావి యున్నచోటది నిర్జల
వృక్షమగు నెడారి వక్షమందు
నమరు సజల శాద్వలాంచిత మరకత
శ్యామరమ్యవిటపి సౌమ్యరేఖ. 72

శా. పాతాళమ్ముననుండి భూవివర సంబాధాతిరేకశ్రమో
ద్భూతస్వేదజలోద్ధురాంగముగ ప్రాదుర్భావవిభ్రాంతిమ
చ్చేతస్కుండగు బావిదేవర కుపాస్తిచ్ఛత్రముల్ చామరల్
బ్రాతింబట్టగలేచు మఱ్ఱులును జువ్వులున్ వేపల్ రావులున్. 73

ఉ. రోహిణికార్తె సూర్యుడు తిరోహితు డచ్చట సర్వలోకసం
దాహకతీక్ష్ణతిగ్మకరదారుణమారణమూర్తి వృక్ష సం
దోహములందు రాహుసమ దుర్జయదర్పములై నిరంతర
వ్యోమహరిసాహరిం బెరసి యూగెడు జొంపముల న్నిరుద్ధుడై. 74

సీ. పూటకుగతిలేని పొట్టకై చిదుగులు
వీకనేఱెడు నిరుపేదలార
రేగుకంపలు చాకిరేవుకు తరలించు
రాగోలబుజముల రజకులార
పొలములందెరువు కుప్పలువోయ బండ్లెక్కి
యెద్దుల నదలించు కృషికులార
పదిడబ్బులకు నాసపడి పొరుగూరు వ్యా
పారమ్ము పోవు బేహారులార

మండుటెండలు నడినెత్తి మాడ్చు నిట్టి
మిట్టమధ్యాహ్నమున నేమి పుట్టిమునిగె
నీడలారు నీ చలువపందిళ్ళక్రింద
నొక్కక్షణమైన విశ్రాంతి నొదుగరాదొ. 75

తే. అనుచు చల్లని నీడలయందు నిలిచి
మోటదోలెడు కరుణాప్రపూర్ణమతులు
దారిఁ బనిమీద నేగెడు వారినెల్ల
పిలుచుచుందురు నట్టెండవేళలందు. 76

ఉ. ఏనుగుబొక్కెనంబయికి నీడ్చుచు బారిని జాఱనెడ్లు నిం
డైన జలమ్ము నన్ మదభరాలసమయ్యదిలేచి గిల్కయ
డ్డై నడబావి యెత్తయిన యంచున తొండము సాచి వారిధా
రానిభృత ప్రసారచతురమ్ముగ కాల్వను ముంచియెత్తెడున్. 77

పంచ. నిరంతరమ్ముసాగుతేటనీటిబావులందు గు
ల్కరాలు నున్పుదేరి రత్నకాంతులీన మించు సం
బరానబేర్చి పాఱు కాల్వ పాయపాయలై తదం
తరమ్ములెల్ల నాకుపచ్చతాపితాల్ ధరింపగాన్. 78

మెట్టసాగు

తే.గీ. ఇది యదేవమాతృకలతీ రింక దేవ
మాతృకలచంద మేమని మందలింప
కట్టు పెకలింపగా లేని కఱకుఱాళ్ళు
ముళ్ళు గృహకచ్ఛపమ్ముల పుట్టినిళ్ళు. 79

ఉ తీయగ తీయగా తఱిగి తీఱునటే యెటువంటి పాతఱల్
మాయలమల్లియింటి శవమండలిమించి శిలానిధానముల్
వేయిముఖమ్ములన్ బయలువెళ్ళగ నంతములేని యోర్పుతో
తీయగతీయగా తఱుగుతీరులు కన్పడ వప్పొలమ్ములన్. 80

సీ. ఒడలెల్ల గొగ్గులవిడుదులౌ పలుగుఱా
బుడుపులు సవరించి బుజ్జగించి
మొండివై కదలని బండదయ్యముల ప్ర
దక్షిణించియు నిరోధములు తలగి
గుదులైన పలుముండ్లపొదల చిక్కులు తీర్చి
కేశ సంస్కారమొక్కింత కూర్చి
నయిదిబ్బలెరువు లంచియల కుప్పలుపోసి
కండపుష్టికి పాదు కడలుకొల్పి

గఱకుచిత్తమ్ము మెత్తనగాగ దున్ని
నాగరికముద్ర యెఱుగని నాటుపురము
పొలము కన్నియఁగ్రైసేసి యలవికొలది
వార్చెదరు కృషీవలు లల్లువానిరాక. 81

ఉ. ఆతడొకండు బెట్టుసరియల్లుడు మింటనె కోఱచూపులై
మూతిబిగింపులై విరసముల్ ముఖరించు విచిత్రవర్తనో
పేతుడు వానకారుదొర ప్రేమరసమ్మున క్షేత్రకన్యకా
చేతము రంగరింప దయసేయ డొకంతట నెంతవేడినన్. 82

శా. ఏ పుణ్యమ్ముచెమర్చి వానపడునో యీనేలపై నంచు గా
ఢాపేక్షం దలలెత్తి నింగిదెసచూపై కాలముంబుచ్చగా
నాపుణ్యమ్ము చెమర్చి క్షేత్రముల నాప్యాయమ్ముగా విత్తి యె
న్నోపండింతురు మెట్టపంట లతిసంతోషాత్మతన్ కర్షకుల్. 83

ఉ. జొన్నలు సజ్జలున్ మఱియు చోళ్ళు తవిందలు నాళ్ళు కొఱ్ఱలున్
మున్నుగపండి ధాన్యములు ముంగిటిపాతఱ లింటిగాదెలై
పెన్నిధు లింకనేల కృషివి స్తరకార్యవిధానకారణో
త్పన్నులు మెట్టచేలసరదార్లకు కోటలు కొట్టినట్టులై. 84

ఉ. గాదెలకొల్చు గేహగతకల్పనగమ్ముగ నంగరాగసం
వాదముతోడ క్రొత్తవలిపమ్ములతోడ ప్రఫుల్లమల్లికా
మోదముతోడ మట్టియల మువ్వలమ్రోతలతోడ సంతతా
హ్లాదతరంగితమ్ములగు నాసరదారుల రాణివాసముల్. 85

తే.గీ. ఎన్నియున్నను వారికేటేట నెంత
కూర్మియో వానిపై క్రొత్తకొఱ్ఱకూడు
కోడితునుకలెంచక రుచుల్ సోడుముట్ట
వాస మఱియేమిసెప్ప రేగడలమీద. 86

## రేగు పొదలు

కం. పెట్టక పోయక పొలముల
పుట్టి పొదలు రేగుపొదలు పొరి వామనతా
ఘట్టము బదరీవన మి
ప్పటున వెలయింప వలస వచ్చిన యట్లై. 87

ఆ.వె. బదరి బదరి యంచు బహుదూరదేశమ్ము
లరుగనేల కాళులఱిగిపోవ
పొదిలె చుట్టుపట్ల పొదలు చిన్నరి పొట్టి
బదరి తెల్పుచుండ బ్రహ్మపదము. 88

ఆ.వె. కొట్టివేయవేయ నెట్టనలేచు పెం
పలర జీవమవ్యయమ్మటంచు
ముండ్లమధ్య పండ్లుమొనయించు వాసనల్
గడచిగాని ముక్తి కలుగదంచు. 89

మ. అణువంతల్ పసరుల్ వెలార్చు కసుగాయల్ సీతురాగా రసో
ల్బణ వృత్తాకృతి సౌమ్యసుందరముగా బల్పెక్కి తెల్పు న్నవా
రుణరేఖాంచిత భవ్యవర్ణము క్రమారూఢమ్ముగా మాధురీ
గుణసంపూర్ణత బేర్చురేగుఫలముల్ కోటానకోట్లచ్చటన్. 90

ఆ.వె. నరుడు తిన్నపండ్లు నారాయణుడు తిన్న
పండ్లు ఘనతపః ప్రభావిభాస
మానదివ్యబోధమహనీయులు పురాణ
ఋషులు తిన్న పండ్లు రేగుపండ్లు. 91

ఉత్సాహ. కోలముక్కు వాడిముండ్లు గ్రుచ్చుకొనుట కోర్చియు
మ్మేలి దోరగుబ్బపండ్లు మెలపుమెఱయ కోసి అం
పాలుపెట్టి రాచినట్లు పండ్లు పులియుదాక త
న్మూలరసము పీల్చిపీల్చి పోవపోవ ముందటన్. 92

జింకలు

ఉ. స్థావరమైన భూమి యొక సాహస తీవ్రతలోన జంగమ
శ్రీవరియించియాకసముఁ జీల్పగడంగిన లీల వాయువే
గావలితమ్ము లై పుడమినంటియునంటనికాళ్లు మింటికై
లేవగ నేత్రపర్వమృదులీల మృగమ్ములు పొల్చు మందలై. 93

ఉ. పంతముతో జవాశ్వములు పన్నిన తేరులనెక్కి వాని సా
ధింతమటన్న పూనిక నధిజ్యశరాసనపాణులైన దు
ష్యంతులు వెంటనంటి రయమారగ రొప్పుటలేదు వానికీ
సంతతవేగ సంచరణచాతురి యెక్కడనుండి వచ్చెనో. 94

ఆ.వె. అనుపమానవేగజనకవిద్యుత్ప్రవ
ర్తితములేమొ వాని తీగకాళు
లవని నింత నిలువ వందుకే కాబోలు
మనసు జింక వంటిదనిరి బుధులు. 95

ఉ. జింకనుపట్ట పర్వులిడి చిత్తము లాత్మ వశమ్ము గాక మీ
నాంకుని కాకలంబొగులు నయ్యలె యెందును జూడ నింక నా
జింకను స్వీయవాహముగ చేకొని కొండొకదిక్కునేలువా
డంకెకుదార్పలేక వలయమ్ములు చుట్టు సమస్తదిక్కులన్. 96

శా. శంకాలేశములేక గోటిమొనతో శార్దూలముం జీరి కం
ఠాంకమ్మొతనరార క్రూర ఫణినాహ్వానించు పంచ క్రియా
సంకీర్ణాద్భుతవిశ్వనర్తనకళాశౌండుండె సారంగహ
స్తాంకుండై నిలువన్ సమర్థుడగు సత్యావ్రథ్యుండు ముమ్మాటికిన్. 97

తే.గీ. అమరులందఱు ప్రక్క వాద్యములు మ్రోయ
నంబముందాడు సారంగహస్తు సాంధ్య
లాసలీలా విలాసకైలాసవీథు
లేణములు చెంగుచెంగున నెగురు పట్లు. 98

తే.గీ. క్ర మ్మనుదయరక్తిమఁజకితమ్ము లేమొ
యెవ్వరును తోలకే జింక లెగసి యెగసి
యరుణరాగరంజిత పథాంతరములేగు
నయ్యనూరుడు తోలు రథ్యముల మించి. 99

బోగముదాని బావి

తే.గీ. వాని నరయుచు బోవ నాపైని బాట
ప్రక్క పల్లమ్ములో తరువ్రజమునీడ
పాంథతృష్ణాపనోదజీవనపుక్రోవి
దర్శనీయమ్ము బోగముదాని బావి. 100

కం. పొదిలెకు తూర్పున నొకమై
లుదూరమున నంతులేని లోతై జలమొ
ప్పు దిగుడు బావి యదియు న
ల్ల దారినేగెడు జనమ్ములకు చలివనియై. 101

కవిరాజవిరాజితము.

స్మరశర విద్ధవికారితమానసచంచలాతిగవర్తనులన్
తరమిడి యానెలుతీసి యమర్చిన తమ్ములపాకులచిల్కలుగా
నరులను వ్రేలికి చుట్టగనేర్చిననారికి వారకుమారికి దు
ష్కరమగునే నడబావిని పల్వురకైవెలయింప నిజేచ్ఛమెయిన్. 102

చం. పదుగురు త్రొక్కనేర్పడిన ప్రన్నని తిన్నని కాలిబాట య
మ్మదవతి యంగసౌష్ఠవము మూట విటాళి యెఱుంగు పక్వమై
ప్రిదిలిన యంతరంగ పరివేదన దైవమెఱుంగు సంతతా
భ్యుదయ పరోపకారరసపూరిత పుష్కరిణీ వినిర్మితిన్. 103

శా. ఆ యజ్ఞాత దయాళుచిత్త యెవరో యాకారమేయట్టిదో
యాయంశంబిసుమంతయుండెలియరా దాకాశ పంచాంగ ని
ర్మాయి స్వాముల కామెపేరును గణింపన్ రానిదై విస్మృతి
చ్ఛాయల్ మూయగ మాసి యామెమిగిలెన్ చర్చింప బోగమ్మదై.104

కం. ఒకరాణికాదు జనపా
లకు డొక్కరుండుంచుకొన్న లంజయుగా దం
తకు మంత్రిభార్యయును కా
దిక నాయమపేరు చరితకెక్కుట యెట్టుల్. 105

తే.గీ. ఐననేమాయె బోగముదాని బావి
యామెకీర్తిపతాక యందాచమించి
దప్పిదీఱంగ నమృతమ్ముద్రావిపోవ
పైని నేరెడు దీవి రూపైనయట్లు. 106

## నేరేడు చెట్లు

మానిని.బాటకు రెండు కెలంకుల నంబరపాటన ఖేలనమూర్ధములై
గాటపు కొమ్మల పందిరిలోని శుకమ్ములు స్వాగతముల్పలుకన్
మీటిన విచ్చెడు గుబ్బఫలమ్ముల మేదుర నీలమణి ప్రభల
న్నీటుగ బారులు తీరిచి యూగెడు నేరెడుచెట్లు నివాళులిడున్. 107

కవిరాజవిరాజితము.
చిరచిరలాడెడు వేసగి ప్రొద్దుల చెమ్మటచిత్తడి నెంతయు తొం
దరపడి మోరలు వాల్చిన బండ్లకుదార్చినయెద్దుల మువ్వలుచె
చ్చెర రవళించు నశేషపతత్రి విచిత్రవివర్త సురంగముగా
నెరవయి మిన్నులు మాటుచుమూగెడు నేరెడుచెట్లు నివాళులిడున్.108

తే.గీ. ఆవలియంచున వెలుగులో నమరు పొదిలెఁ
దరియు తమి నాగు బండ్లు కొంతతడవాపి
బాటసారులు నేరెడుపండ్లు తనివి
దీఱ తినిగాని ముందుకు పోరు సాగి. 109

కం. శ్రావణ భాద్రపదీయ మ
హావర్షాశ్రీ సముల్బణాఢ్య ఫలమ్ముల్
సేవించు నగారోహ
ప్రావీణ్య నిధుల్ సమీర భవసమసత్త్వల్. 110

తే.గీ. చిలుక లుడతలు కొఱకి రాల్చిన ఫలమ్ము
లారగింప తలంపకు నయ్యు లరయ
నెంచి రుచి చూచి శబరి యర్పించు ఫలము
లారగించెడు. శ్రీరాము నంతవారు. 111

## వరిమళ్ళు

ఉ. నేరెడు దీవి సర్వరమణీయత ముద్దెసలారబర్వెనా
నూరికి తూర్పు దక్షిణము నుత్తరమున్ వరిమళ్ళు శ్యామశృంగ
గారిఱలించు పంటచిఱుకాల్వలుగా నిరు చెర్వులందు నిం
డారిన నీరు పొఱగ రసార్ద్రములై నయనోత్సవమ్ముగన్. 112

కం. చెరువులు నిండగవలయున్
పరాత్పరునికరుణ పొదిలె వరిచేలు నిరం
తరనరదంబునిషిక్త
ప్రరోహబహుళముగ పెరిగి బండ్లకుపండున్. 113

శా. ఏనాడభ్యుదయాంతరంగులు జనాభీష్టక్రియా నిత్యసం
ధానోత్సాహులు ధర్మమార్గపథికుల్ త్రవ్వించి రీ చెర్వుల
న్నానాక్లేశములోర్చి శాలిబహుధాన్యశ్రీవిలాసోదయ
ల్గానేనాడు కృషీవలుల్ కడక మాగాణించి రీభూములన్. 114

ఆ.వె. పొదిలె ప్రాగుదీచ్యములనున్న 'మోడలు'
మళ్ళుతీర్చునాటి మట్టిదిబ్బ
లంద్రు రెడ్లుపెట్టునా 'భూమికోట' పా
డెనయు గోడలందు రేదినిజమొ. 115

మ. అమలోదార చరిత్రు డూపగ జగత్ప్రాణుండు కేదారఖం
డములందభ్ధితరంగసుందరముగా నర్తించు నా వెన్నులం
దమితోత్సాహత ప్రాణపోషణకళావ్యాపారమై నిండి య
న్నమయబ్రహ్మము ప్రాణిలోక నయనానందమ్ముగా నూగెడున్.116

## ఆకుదోటలు

తే.గీ. పొదిలె శాలేయముల చందములను మించి
యచటి తోటలు రాజిల్లు నందు నాకు
దోటలఃవింతయందాలమూట లాకు
దోటలనగా తములపాకుతోట లెన్న 117

కం. నర లోకవిటుని మరులన
నటిమి దివిజవేశ్య తములపాకులతీవన్
వెరవుగ తనకట్టిన గా
గమరామడతలందు దాచి గ్రక్కునదెచ్చెన్. 118

తే.గీ. అందుకేనమ్మ యీ యాకు లంతనవక
మంతజిగియంచు పొదిలెరోయాంధ్రు మూడు
వేళలను తమ్మలమ్ము సేవించునప్పు
డచ్చరలయందమును కొనియాడుచుంద్రు. 119

తే.గీ. పొదిలెకవటాకులది జగద్విదితకీర్తి
వాని నవకమ్ము లప్సరోవరకపోల
ములకు మృగ్య మయ్యాకులు మోదమోద
పట్టి పిడికిట నిమిడింపవచ్చు. నిజము. 120

ఆ.వె. నిడుదయవిసెమోక నెగడు మాఱాకుగా
సాగు పాము మెలిక నాగవల్లి
శివసమున్నతాంగశిఖర శేఖరముగా
పడగ సాచు నాగవనితవోలె. 121

చం. అనవరతమ్ము భోగవతి నాడి తనూద్యుతిమాయ వచ్చి పా
పనెలత లాకుదోట నడబావులతేలి జ్వలింత్రు వారి సో
కున రుచిమీఱు తజ్జలము గ్రోలికదా కను నాగవల్లికా
వినుతదళమ్ము లా కుసుమ పేశలతా కమనీయతాదృతిన్. 122

నాగజెముడు

తే.గీ. నాగులకు ప్రియమైన కాణాచి పొదిలె
చుట్టుపట్టెల్ల పెనుకోటగట్టినట్లు
తోటలను చేలు మోడలు దొడ్లు గట్లు
చెరువుకట్టలంతట నాగజెముడు బలిసి. 123

కం. మట్టలు పడగలుగా పయి
బుట్టిన క్రొవ్వాడిముండ్లబుడుపులు నాల్కల్
మిట్టెడు తలలై పాముల
కట్టు కదలినట్టు జెముడుకాడలు పొదలున్. 124

చం. ఒకడును చేయివేయుటకు నోడు మహానిశితాగ్రనిత్యకం
టకవతియైన యాజెముడు టక్కరి యెంతటి టెక్కులాడి తే
పకు ములుసందులన్ పసుపుపచ్చనిపూవులు పూయ హర్షకం
టకకలితాంగులౌదురు జనమ్ములు దూరమునుండి చూచుచున్. 125

ఉ. చేనికి నాకు దోటకును చేర్చెడు నధ్వములెల్ల వ్యర్థము
ల్గా నిఱుప్రక్కలం జెముడు క్రందుకొనంగ చిరానురోధ వి
జ్ఞానవశమ్మునన్ సులువుగా గమియించెదరందు నూరివా
రానతకుంచితాంగముగ నయ్యయిపట్టుల నప్రమత్తులై. 126

ఆ.వె. అంతలావు తారకాసురుండును తెగ
టాటిపోయె నొకకుమారుచేత
నణువుకన్న సూక్ష్మమగు నొక్క వింతల
మారి పురుగు పంతమారఁబట్టె. 127

సీ. ఆ నాగజెముడిప్పుడంతయు నంతరిం
చిన దది బ్రదికియుండిన దినాల
పొదిలె బీదల కన్న పూర్ణ తాంబూల క
రండవాహ తదీయ రక్తరాగ
రంజితరుచిపూర్ణరమ్య ఫలమ్ము లి
ష్టమ్మువచ్చినన్ని కష్టపడికోసి
పైనూగు ముండ్లు నేర్పార నిసర్జించి
ములువెట్టి రెండుడిప్పలుగజీజి

ప్రాణగొడ్డ మంగిటిముల్లు పరిహరించి
బీజమయమైనగుజ్జు తృప్తిగ భుజించి
నిండు కడుపుల నెట్టిగా పండునోళ్ళ
బ్రదుకుదీర్తురు నిత్యపర్వముగ వారు. 128

నాగులు

తే.గీ. పుట్టులింగమ్ము పరమార్ధ పుంఖిత ప్ర
బోధదీప్తిమజ్జ్యోతిర్విభూషణుండు
పొదిలె నిర్మమునకు నాగభూషణములు
పనికిమాలినవై తీసి పాఱవేయ. 129.

తే.గీ. దారముల్ తెగి నేలకుజాఱు గాలి
పడగలటు దీర్ఘపృష్ఠముల్ ముడుగబడి ఫ
ణాదికాంగమ్ము లల్లలనాడ పోయి
పడి జెముడుకంపలన్ కాడుపడగ నందు. 130

కం. ఇరుల కొటారము లయ్యో
వరులన్ చెవులైన కనులు పనిసేయమి వం
కర గ్రుడ్డి తిరుగులాటల
జరజర బరబర నినాద సంక్షోభంబై. 131

భుజంగప్రయాతము.
హరాంగేష్టకేళీవిహారావరోధా
తిరేకవ్యథాసీరదీర్ఘాంతరంగాం
కురద్విప్రయోగప్రగూఢాగ్నికుండ
స్ఫురజ్జ్వాలికాభీల ఫూత్కారితంబై. 132

భుజంగప్రయాతము.
అజస్రక్రియాపేక్షయా వ్యధ్వనీన
ప్రజాళీసదా ప్రాణబాధావహంబై
సజాతీయ సింహాండ సర్వంకషంబై
భుజంగాగమాపాయిభోగమ్ము పొల్చున్. 133

జంగాలు

తే.గీ. వారుగో నాగభూషణాచారపరులు
పొదిలెనిమ్మయ్య మహిమాంకవిదితనామ
సతతసంకీర్త నావేగ శబ్దఝురులు
జంగమయ్యలు భూతిసర్వాంగధరులు. 134

ఆ.వె. పొదిలె యావుపాలమోజున రజతాద్రి
వీడివచ్చు నభవు వెంటనంటి
ప్రమథగణము వచ్చి ప్రక్కన జంగమ
పాలెమందు కూడబడెననంగ. 135

కం. అయ్యలు నిమ్మయ్యలు మ
ల్లయ్యలు కోటయ్యలును శివయ్యలు కైలా
సయ్యలు భీమయ్యలు నగ
రయ్యలు నానాప్రకార హరనామాంకుల్. 136

సీ. హర మహాదేవ శంకర యాదిభిక్షుక
హిమశైలజా మనోరమణ యంచు
పొదిలె నిమ్మయ్యను ముదమారగా పాడు
కొంచు శంఖము లూదుకొంచు చేతి

గంటపైయంచున గదియించి త్రిప్పెడు
కణ్ఠచే చైతన్యకలితమైన
నాలుక సూత్రానవ్రేలురుద్రాక్ష లో
యంచంటి త్రుళ్ళింతలగుచు తిరిగి

మారుతపథమ్ము సంచితోంకారనాద
ముఖరిత మొనర్పగా ప్రొద్దుపొడుపువేళ
పొదిలె సర్వవీథులు శివాభ్యుదయములుగ
చంకజోలెలతో వచ్చు జంగములకు. 137

స్వాగతము.

తోయజాప్తకరతుంగసువర్ణ
చ్ఛాయలందు వికసన్ముఖియౌచున్
వేయిగుప్పిళుల విప్పులతో నా
ప్యాయతన్ పొదిలె స్వాగతమిచ్చున్. 138

శా. శ్రీపన్నాయని వంశహారతరళ శ్రీమంగళా మంగళా
వాపార్థాంగక నిర్మమేశ్వర దయావాల్లభ్య వాల్లభ్యశో
భావశ్యత్సకలార్థిసేవక మనఃప్రహ్లాద ప్రహ్లాద ర
క్షాపర్యుత్సుక భీమమోహన నృప ంచాస్యాహ్వయ శ్రీపదా. 139

కం. పొదిలెక్షేత్రవివర్ధన
బదరీబహుగుల్మినీ సువక్వఫలరసా
స్వదనక్రియావినూతన
బదరీనారాయణ ప్రభావన్మూర్తీ 140

మాలిని.అతితరచతురవ్యాహారసద్యఃప్రపంచా
అతిశితమతిసువ్యాఖ్యాతసంక్లిష్టబంధా
వితరణగుణసంపద్విస్తృతాతిథ్యసీమా
పితృసతిసుతబంధుప్రీతిభావాభిరామా 141

నాయని సుబ్బారాయ క
వీయమ్మీ జన్మభూమి నిది వ్రతినవశో
భాయత్త వర్ణనా ప్ర
ఖ్యాయుక్త పదమ్ము ప్రకృతిఖండము వెలయున్. 142

----- 0 -----

# తటాకఖండము

శ్రీ మందిరాయితోర
స్స్మమాంచితమూర్తి పదకుశేశయమధువూ
ర్ణామోదితహృదయతటా
కా మర్దితదురితకంటకా నరసింహా. 1

నామవిచారణ

సీ. ఈనాటిదా నిర్మమేశాన గోక్షీర
మమతా ప్రపంచ నిర్మాణ ధరణి
పొదిలె యీనాటిదా పొదిలెమ్మప్రతిపదో
త్పన్నవాత్సల్య సంక్లిన్నరజము
భక్తరక్షా వేగపాదాహతిని బోడు
మొనచిట్లినట్లయ్యు మొక్కవోని
పొదిలెకొండను నిల్చు సదయుండు నరసింహు
నిర్నిద్రమహిమ పండిన పొలమ్ము

మధ్యమున్న ఛత్రితమహాశ్మమ్ముతోడ
పరమగంభీర మాపెద్దచెరువునీర
మింకి రసరాజధానియై యెసగునేల
పొదిలె యీ నాటిదా నిత్యపదముగాక. 2

తే.గీ. తొలియుగమ్మున శివపురి మలియుగమ్మ
నందు గణపాలపురము మూడవుయుగమ్ము
నను హలాయుధపురమయి తనరెనెద్ది
కలియుగమ్మున పొదిలెయై క్రాలునద్ది. 3

తే.గీ. కలియుగాదిని నిమ్మవ్వఁగరుణ నేలు
భవు జూట నిర్గత భవ్యశక్తి
పొదిలెయమ్మ పేరట నది పొదలెనంట
పొదిలెముందొ ముందో లేక పొదిలెయమ్మ. 4

ఉ. ఇమ్మహి దానిపే రొ్పదిలెయేయని సిద్ధము సర్వకాల భే
దమ్ముల నంచు నవ్యకవితామహనీయత తెన్గుగుండెలన్
పెమ్మెలు పేర్చుకోఁగనిన పింగళిసూరన 'నిర్మమాపురా
ణమ్ము' న చెప్పినాడని వినంబడు నాకృతి యేమిరైయెనదో. 5

ఉ. అచ్యుతదేవుకాలమున నాకృతి యాకృతిగాంచి నిర్మమే
ద్రుచ్యకథాగుళుచ్ఛవినిరూఢపరీమళబంధమై యని
ర్వాచ్యమహాకవిత్వమధువైభవయుగ్ద్విపదీప్రబంధమై
విచ్యుతమయ్యెనా తెనుగువీథిని కాలమరుద్విధూతమై. 6

సీ. సాళువవంశాబ్ధిశశి నరసింహరా
యలచేత కృష్ణరాత్రిలకుచేత
నచ్యుతదేవరాయలచేత వరుసగా
మూవురు వసుధాధిభువులచేత

తాళిచౌకట్లు నందలమును పచ్చల
    కడియాలు మొదలైన గణ్యమాన
బహుమానములుగొన్న మహనీయు డెల్లమ
    రాజింటి కొండమరాజు పొదిలె

సీమస్థలకరణ మ్మభిరామకీర్తి
రతుడు పింగళి సూరపరాజ విరచి
తమ్మయిన నిర్మమాపురాణమ్ముఁ బ్రీతి
నంకితమ్మందెనట వాఙ్మయాభిమతుడు. 7

తే.గీ. అచ్యుతావనీనాథు నిర్వ్యాజకరుణ
పెల్లుబికి తొండమూరయగుళ్ళకు ప్రతి
నామమైనట్టి కంభముసీమ స్థలక
రణికపుమిరాసిగూడ పొందెనట యతడు. 8

ఉ. 'రంగుగ' పద్యమందు కవిరాణ్ణిలయ 'మ్మిట' నన్నమాటకున్
సంగతి పూంగినాడగుట సంగతమేగద వారలిర్వురున్
సంగడికాండ్రు గావుటయు సంభవమేగద నిర్మమేశ్వరా
సంగనిరంశభక్త్యమృతసారనిషిక్తవివిక్తచిత్తులై. 9

కం. 'పృథులాకాశీసేతు
ప్రథ' యను సూరన్న పద్యబంధములో సం
కథితమట పొదిలె మఱియా
'పృథుల' యను పదమ్ము పొదిలె కెటుసంగతమో. 10

ఆ.వె. సంస్కృతమ్మునకును సరితెన్గుసేతయో
తెన్గునకును సంస్కృతీకరణమొ
కన్నవేలయెట్లు కాంచనమ్మె పొదిలె
రైనవేమి పృథులరైనవేమి. 11

చం. అతులితయోగమాసుకృత మారయ నెట్టిదొ యందునుండు జీ
వతతికి ప్రాణముల్ తొఱగువట్టున కాశికనెట్టు లట్టుల
ద్భుతముగ దక్షిణశ్రవణమున్ పయికుండెడునంట తారకా
పతిముకుటాంకు డూదగ కృపన్ భవతారకమంత్రరాజమున్. 12

తే.గీ. అచట నిర్యాణమును చెందునట్టి వారి
కేరికేనియు దహనసంస్కారవేళ
వలదు సర్వసామాన్యకపాలమోక్ష
మీశతారకమంత్రోపదేశమహిమ. 13

కాశీబుగ్గ

ద్వి. అట కాశికాపురి నలరు గంగమ్మ
కిట నీ పొదిలెయన్న నెంతసంబరమొ
నిరతి నంతర్వాహినిగ పాఱుతెంచి
శిరసెత్తె నిచట కాశీబుగ్గయగుచు. 14

శా. కాశీసామ్యము నొందదే పొదిలె లోక ప్రస్తుతమ్మై మహో
వైశాఖిన్ కడువింతతామరలదొర్వై తన్నిమజ్జన్మను
ష్యాశేషాఘ నిబర్హణాచ్ఛసలిల వ్యాకోచ సంరంభతన్
కాశీబుగ్గ మహాప్రవాహమయి పొంగన్ గ్రామపశ్చాద్దిశన్. 15

ఆ.వె. నిలువయున్ననైన కలకబాఱదు కంపు
గొట్టదేమి పురుగుపట్టదేమి
పానయోగ్య మట్టి యానీరు జాహ్నవీ
సలిలమగుట కేమిసందియమ్ము. 16

తరల. అరటి తోటలు నిమ్మతోటలు నాకుతోటల తోడ న
చ్చెరువుగొల్పెడు కందతోటలు చేమతోటలతో నిరం
తర వమద్రసధార బుగ్గయు తారసిల్లిన మేర నా
ధరణి నిక్కె వినూత్నజీవనతా మహోదయ రంగమై. 17

తే.గీ. కాలవశమున నవియు సికస్తుగాగ
వెసఖరాపాడి మామిడి విత్తనమ్ము
తెచ్చి సహకారవన మొండు తీర్చెనచట
పొదిలె స్థలకరణమ్ము ప్రభుత కీర్తి. 18

తే.గీ. ప్రథితు డెల్లమరాజాన్వవాయతిలకు
డాత డన్నపరాజనామాంకితుండు
తరుణమాకందవన సుసంతాన ధర్మ
సుప్రతిష్ఠామహాపుణ్యశోభితుండు. 19

ద్వి. ఆ వదాన్యునకు దీటైన ధర్మోప
జీవి చింతలపాటి చెన్నమరాజు
ఆయనవనమున కట నుత్తరమున
వేయించె తాను మావిడితోపొకండు. 20

కం. మరికొందఱు భూతదయా
పరాయణులు తీర్చిరచట ప్రకృతిరమా వి
స్తరసౌందర్యకళాభా
స్వరమ్ముగా నెన్నియో రసాలవనమ్ముల్. 21

కం. ఇటు కాశిబుగ్గ పెదచె
ర్వటువైపానడిమినేల యారెంటి సము
త్కటసారసారవన్మృ
త్కట మట వనలక్ష్మి గజ్జెకట్టుట యరుదే. 22

## పెద్దచెరువు

ఆ.వె. ఊరిదేవమూలఁజేరిన సహలోక
పాలు పొత్తుగోరి పశ్చిమమున
వెలయు వరుణదేవు కొలువుగా కది వట్టి
చెరువె పొదిలె పెద్దచెఱువు చూడ. 23

ఆ.వె. ఎండకెండియెండి బెండైన దేహమ్ము
చలువలీను చెరువు సారమందు
సంతరించుకొనగ సార మడ్డమ్ముగా
చేరబడ్డగుట్ట చెరువుకట్ట. 24

శా. రంగత్తుంగతరంగసంహతులరారాపిళ్ళు నిత్యమ్ము స
ర్వాంగీణమ్ముగ సంభరించియును చింతాకంతయున్ శీర్ణతా
భంగంబొందనికట్ట యంతచెరువున్ బంధించి నిల్పెన్, స్వకీ
యాంగస్థభ్రమనిర్గమక్రమజలవ్యాప్తిక్రియాదక్షమై. 25

తే.గీ. ఉద్ధి మకరాలయమునకు పెద్దచెరువు
దర్పముగ రెండుతూములు దాని కందు
నుత్తరపు తూముఁదీయించి యోగ్యుఁడొకడు
బుఱ్ఱతూమేర్పఱిచెనంట పుణ్యరాశి. 26

తే.గీ. దక్షిణపు తూము గంభీరతావిభూతి
మకరముల కున్కిపట్టన్న మాటపడియె
నొక్కపరి పుష్పధన్వునిటెక్కె మొక్క
సానికై యూరిలోన సాక్షాత్కరించి. 27

ఉ. ఉల్లముతీటమీఱ యెవరో విరహాతురవారనారి యే
పల్లవరాజదుర్లభుని వశ్యునిగా నొనరింపనెంచియో
తొల్లియొకప్డు దక్షిణపుతూము శిలాస్థలి నూఱ నేర్పున
ర్తిల్లగ లంజమందు సవరించినదంట తదేకచిత్తయై. 28

తరువోజ.ఆ మందుసోకున నంగజతాప
మావహిల్లగ నా విటాగ్రేసరుండు
వ్యామోహవివశుడై పరుగునవచ్చి
భామ మంచముపైని వాలెనోయేమొ

ఆ మందు నూతిన యాతూముబండ
నత్తమిల్లిన యొక్కయంబేదమొసలి
వ్యామోహావివశయై పరుగునపోయి
భామమంచముక్రింద పవళించెనంట. 29

## అలుగులు

కం. అలుగులు రెండా చెరువుకు
గల వుత్తర దక్షిణముల కాలములన్ తె
ప్పలు తెరల పొరలబడు త
జ్జలోచ్ఛ్వాసన వీచికాప్రసారాస్యమ్ముల్. 30

తే.గీ. మెరక గీర్వాణమైన యుత్తరపుటలుగు
వెడలి తానెప్పుడోగాని మిడిసిపడదు
వరవకట్టచే నియమిత వాఃప్రవాహ
మగుచు నూరికి దూరమై హరువుసూపు. 31

ఆ.వె. దక్షిణంపుటల్లు తా తెల్లుమీతిన
తవర చెరువు నిండుటయె తడవుగ
దుడుకుకొడుకులేచి దురుసుగానూరి మ
యమున తాండవించునట్లు రేగు. 32

మహాస్రగ్ధర.

అతిమాత్రాకారుడౌ నయ్యలుగుకొడుకు వా డాగడీ డాత్తవేగో
ద్ధతి భూమిం జీల్చుకొంచుంగడక మెఱసి ప్రాగ్గామియై వక్రమార్గో
ద్ధతి నూరే రెండుగా నుత్తరము పఱచి యంతన్ పునఃప్రాగ్గతుండై
వితతాభీల ప్రహదమ్ముల్ పిరిగొన నుఱుకున్ పేర్కొనన్ తోళ్ళవాగై. 33

ఆ.వె. ఎవ్వరేని నీ కిదేమి పేరని నవ్వ
నడుగుగానవచ్చు నమలజలము
లల్లు నల్లిపూల మొల్లంపు నవ్వుల
తుఱగలించు పెద్దచెరువు బిడ్డ. 34

ఆ.వె. ఎంతవాన కురిసెనేమి నిండద యూరి
వారు వచ్చి కట్టపైని తద్ది
నమ్మి ముంగమూరి యమ్మహాజనులకు
పెట్టినంతనిండు పెద్దచెరువు. 35

## ముంగమూరి మహాజనులు

కం. వారొక విప్ర కుటుంబము
వా రందఱు ముంగమూరి వాసులు దూరా
భారమన కదేపనిగా
నూరూరేగుదురు భోజనోత్సాహమతుల్. 36

మత్తకోకిల. తల్లిదండ్రి కుమారకుల్ దుహితల్ జననీజన మల్లురున్
పిల్ల జెల్లయుగూడి కన్నులవిందుగా పదునల్వు రే
పల్లెనే శుభకార్యమైనను పాఱుతెంతురు వేగ వా
రల్లెవీడినయమ్ములట్టుల నామడల్ గన నడ్డులై. 37

తరల. పిలువలేదనుమాట యేయెడ పెట్టుకోని యమాయికుల్
తెలియుటే మఱి పిల్పులై యరుదెంతు రుత్సుకమూర్తులై
కలిగినట్టి కుటుంబి వారిని కాదనం డతిప్రీతితో
పిలుచు నాప్తుల కెట్లటుల్ తినబెట్టు సాదరబుద్ధియై. 38

మ. అది యానాటి గృహస్థజీవితము సొంపా పల్లెటూళ్ళం దురా
సదుడు న్నాటికి కోటి కేయొకరుడో సంపన్నులం దాతృతా
విదితోత్సాహము వారి నెంతకయినం బ్రేరించు నభ్యాగతుల్
ముదితాంతఃకరణమ్ముల న్మఱలుటే పోరాని కర్తవ్యమై. 39

శా. ఏదోయూ రటనెవ్వరోకలగృహస్థే కార్యమో తీర్పు వా
ర్తాదీపద్యుతి ముంగమూరి పొలిమేరల్ ప్రాకగా భోజనే
చ్ఛాదుర్దాంతులు తన్మహాజను లవశ్యంభావియై పేర్చు క
ర్మాదేశమ్మున మంటకున్ మిడుతల ట్లాయూరికై లేవగన్. 40

ఉ. వారక యూళ్ళుపోవలసి వారము వర్జ్యము గానమిన్ బయల్
దేరెడువేళ శ్రీవిభు మదిన్ క్షణకాలము పట్టుకొల్పు టా
చారము తండ్రికిన్ తమకు స్వస్తిసుఖమ్ములుగోరి కాని యా
సారి యదేమొకో హృదయసంగతరూపుడుకాడు దేవుడున్. 41

శా. ఏవోనీడలు లీలగా కదలిన ట్లేవోవికారమ్ములన్
లేవందీసినటుల్ పితాళ్లెదురుగా నిల్చున్న యట్టుల్ మనో
భావం బూగిసలాడ నప్రతిభుడై పాఱుండు విభ్రాంతిమ
జ్జీవుం డమ్మొయి వెన్క కొక్కడుగు వేసెన్నిష్క్రియారంభుడై. 42

శా. ఏమయ్యా యిది యేమి యాగడము నీకేమయ్యె నిట్లైనచో
మేమింకన్తినినట్టు లే కదలు స్వామీ యన్న యర్థాంగితో
నేమీలేదని మభ్యపెట్టి పదవే యిల్లాల యాశాంతమై
సోమించు న్మనయాప్రయాణము కవిస్తుత్యప్రభావాఢ్యమై. 43

మ. అని సాగెన్ పతిముందు కాయనకు జోడైసాగె తత్పత్ని త
క్కిన వారందఱు గున్న యేనుగులమాడ్కి న్మాంసలాంగమ్ము లౌ
య్యన సారించుచు సారెసారెకును పప్పన్నంపుసంతోష మా
ననసీమల్ వెలిగింప వారి వెనువెంటన్ సాగి రొక్కుమ్మడిన్. 44

ఉ. నిన్నటి యెండపోసికొని నిప్పులు గ్రక్కెడునేల చల్లనౌ
పున్నెముపుట్ట దేమి పడిపోయెనొ రోహిణికార్తెసూర్యుడు
త్పన్నుడు తూర్పుకొండకొనపై నపుడే యెఱచింత నిప్పులం
బన్నినముద్ద యానడచువారలవెన్నులు చుఱ్ఱుచుఱ్ఱనన్. 45

ఉ. వీపులు పెట్లగొట్టు నడివేసగి యెండకు సైచి పశ్చిమ
మ్మైపయనించి నట్టనడుమైన యహస్సున వారుపోయినా
రా పలెటూరు వచ్చిపడిరయ్య మహాజను లన్నవార్తకున్
లోపల పెండ్లికార్యములలో పడియున్న గృహాధినేతయున్. 46

మ. అనుమోదమ్మెసలార వారికెదురై యాహ్వానమర్యాద చ
య్యనచెల్లించెను వారు నధ్వగభరాయాసమ్ముపో నొక్క గం
తున స్నానాదికము ల్మగించుకొని బంతుల్దీటి కూర్చుండి రా
యనయే వడ్డనసేయగా నతిథిమర్యాదాసమాచారుడై. 47

సీ. ఇది క్రొత్తకందుల యుదిరిబంగరువన్నె
తళుకులుతులకించుమొలక పప్పు
వరియన్నమిద్ది మాచెరువుక్రిందిపొలాన
నీరార పండిన నిరుటిపంట
ఇది యప్పటపు వెన్న లెప్పటికప్పుడే
కరగించి పోసిన మెరుగునెయ్యి
మోటబావుల క్రిందితోటలుగాయ చే
కూరిన వంకాయకూర యిద్ది

కాలమునబెట్టు పెక్కురకాల వరుగు
లొప్పజేసిన దిది పప్పు దప్పళమ్ము
కొసరివేయించుకొను కోర్కి గునిసియాడు
మేటి వ్యంజన మిది కొయ్యతోటకూర. 48

తే.గీ. కొంచె మికకొంచె మింకనుకొంచె మంచు
కొసరి కొసరి వడ్డింప నా గుణనిధాను
డీ భవమ్మున కిక నిద్దియే యటన్న
కక్కుటితి వార లాబూతిగా భుజించి. 49

ఆ.వె. పాలు దాలిపొయ్యిపై జాము మఱిగంగ
గాచి తోడుపెట్టగలుగు కుంకు
మంపుపువ్వువన్నె మవ్వంపు నెల్లూరి
సీమ పెరుగువాయతో ముగించి. 50

ఉ. వాలిచి భోజనశ్రమమువాయగ మేనులోకింత ప్రొద్దు కై
వ్రాలినవేళ నింటికిని పైనముకట్టు తలంపు లేపగా
కాలముచాల దేమిగతి కాలకృతుం డపరాబ్ధిఁగ్రుంకులో
కాలిడ నూరిలోననుచు కాలవిమూఢులు వారు కుందగన్. 51

ఆ.వె. ఆ కుటుంబమందు నాఖరువాడు చ
లాకి ముక్కునం బులాకినైన
పొట్టివడుగు తిన్న బూరెల గారెల
బూరటిల్లుపొట్ట పుడుకుకొంచు. 52

ఆ.వె. పొట్ట పెరిగి పెరిగి పొదిలెచెర్వొచున్న
దనియె నాననమున హాస్యమొలుక
నదియు నెట్టిశ్రుతియొ యారాత్రి పొదిలెలో
పండనెంచి వారు పయనమైరి. 53

సీ. తోబుట్టువగ్నిఁదుత్తుమురుగాదిగద్రావి
తదోగజనితమ్ము ధరణినూడ్చి
నిజ జనిస్థానమ్ము నీరు సొంతముపీల్చి
రసజనిస్థాన మాకసము ౘ్రమింగి

పంచమహాభూతపరిణాహాములమేర
　　లన్నియుదానరై యవఘుళించి
సివమెత్తియూగు వృక్షవికారశిఖరసం
　　విదితజటాచ్ఛటాభీలమగుచు

కార్తెవచ్చినదాది పిక్కటిలిమండు
చండభాస్కర కరసహస్రప్రభూత
చండిమలు పోసికొని యుబ్బి శక్తిమెఱయు
ప్రళయమారుతరయ మహాభయదవేగి. 54

మాలిని. కదలి చరమకాష్ఠాగర్భసంభూత వాత్యా
ర్బుదము ప్రళయకాలవ్యూహసంధానితమ్మై
గదిమి తఱిమి ప్రాణగ్రంధు లూటాడగా న
ప్పొదిలె చెరువు గర్భమ్ముమ్మన్వడిం జేర్చెవారిన్. 55

తే.గీ. ఖరకర మహాగ్ని కీలల క్రాగిక్రాగి
యంతటను నెఱ్ఱలనెడునో ళ్లావులింప
బ్రహ్మదివసావసాననిర్వర్ణజగతి
చిప్పవలె నున్న దాపెద్దచెరువుకడుపు. 56

తే.గీ. అదియు భీతావహమ్మయి యంతరంగ
మేర్చగా నెట్టులో తమాయించుకొంచు
కట్టదాటినయంతనే కలదు పొదిలె
కలదు ప్రొద్దింకనని వారు తలచులోన. 57

కం. యమమూర్తి పశ్చిమాశా
సమవేత మ్మొక వినీలజలధరఖండ
మ్మమిత భయానకముగ వి
క్రమించి రాకాసినోటి గంగాళమ్మై. 58

కం. పడలాగికొనియె వడవడ
వడకు ముసలివగ్గు లోకబాంధవుఁ దనలో
తడబడి వెడవెడ ప్రాణము
లెడల సెగలు పొగలుగా ననేకముఖములన్. 59

చం. సెగలను సంజరేకలు విశీర్ణములై చెడిపోయె నంతలో
పొగలను గాఢసంతమసపుంజము లొక్కటరేగి మూగి వె
ప్పగిలి నితాంతవాగసముదగ్రములై హరిదంతవీథులన్
వగలెనయించుచున్ తఱిమి వాని సమాంతము మ్రింగివేయగన్. 60

కం. కఱిమొయిలు జమునిదౌ వం
కరతిరిగినకోఱ తదియకళ నెల యది య
క్కఱ కేమి వచ్చు వారికి
చెరువున్ వడిదాటి పొదిలెఁ జేరెడు పనికై. 61

తరువోజ.

మిట్టపల్లముల సమ్మిశ్రమార్గములు
మృత్యుదేవత మిఱుమిఱు చూచినట్లు
దట్టపుంజీకట్ల తండముల్గప్పి
తల తోక యిదియను దర్శనమ్మేది

కట్టపై జెముడులో కాలసర్పముల
కస్సుబుస్సులు మదిగగ్గోలు వెట్ట
నట్టిట్టు పోరాక యటనుండలేక
ననయమ్ము వెతగుంది యాదైవహతులు. 62

కం. ఎండిన దుగ్ధాంబునిధిన్
పండని విష్ణువగు శేషపాన్పన గొడుగుం
బండ పఱపైన దచ్చట
నుండ తదీయాశ్రయమ్ము నొందు తలంపై. 63

ఉ. పిండిత దీనతా చరమవీధుల నీ పఱపైన బండలో
నుండెడు దేవతా మము దయోదధివై కడతేర్చుమంచు వా
ర్పండిరి దానిపై గమనభారము తెప్పల మీది కెక్క న
బ్బండయు పశ్చిమంపు జలభాండపు మిత్తికి సైగసేసెనో. 64

కం. అడుగూడినట్టులై యది
పడమట నెచ్చటనొ కుంభపాతముగా పెన్
జడివానగురిసె నయ్యూర
వడికిన్ కంభాలపాటి వా గుబ్బినదై. 65

స్రగ్ధర. భీమంబై వేయినాగుల్ విడివడి పడగల్విప్పి ఫూత్కారఝంఝూ
రోమంథమ్మొప్ప నాల్కల్ రుసరుసలడరన్ క్రోయుచున్ పర్వి నట్లు
ద్దామాపోద్యదగ్రభంగిన్ తరగలు విరియం దర్పదుర్వార వేగ
శ్రీమించవ్వచ్చివాగచ్చెరువువరవ నిశ్శేషమై నింపె దానిన్. 66

తే.గీ. ఆదమఱచి నిద్రాముద్రితాక్షులైన
ముంగమూరి మహాజనుల్ పొంగిపొరలు
బండదయ్యమ్ము వికటకృపాపయోధి
నడగి దీర్ఘనిద్రా ముద్రితాంగులైరి. 67

తే.గీ. అయ్యకాలాగత ప్రవాహమ్ము వలన
పొంగిన తటాకమునుగాంచి పొదిలెజనులు
పొంగిరేగాని యయ్యది ముంగమూరి
యగతికుల పోకడకు మూలమౌటెఱుగరు. 68

కం. ఎండల కాలపు చెరువుకు
నిండినతనమెంతసేపు నిండినయట్లే
నిండి మఱియెండి యాపై
నిండద జడి దంచికొట్టనీ యెంతేనిన్. 69

తే.గీ. పొలముల నీరుచాలక పొదిలెజనులు
పొక్కి రయ్యూరిపెద్దకు నొక్కరేయి
జలముపాలైన యమ్మహాజనుల పెద్ద
దీనవదనమ్ముతో కలలోన తోచి. 70

ఉ. ఇట్టులమైన భోజనపుటిచ్చ సదాతిరుగాడు మమ్ములన్
పొట్టను పెట్టుకొన్న యఘముంగనె పుణ్యమతీ తటాక మి
ప్పట్టున సర్వనాశనము పాల్పడివంశము మాకు పిండముల్
పెట్టెడు వారులేక దురపిల్లెదమిట్లు దయామతీ యనెన్. 71

తే.గీ. ఆ దయామతి వినిపించు నా విషాద
గాథ కెల్లర హృత్తటాకమ్ములందు
సమితకరుణారసప్రవాహములు పొంగ
నలుగులైపాఱె తన్నయనాంచలములు. 72

తే.గీ. అదిమొదలు ముంగమూరి మహాజనులకు
పొదిలెజను లాబ్దికములు పెట్టుదురు వారి
కక్షయానందలోకసౌఖ్యములు కోరి
తత్తటాకజలాపూర్ణదశను కోరి. 73

కం. ఇది పెద్దచెరువుకథ య
ప్పొదిలె యవాచీనరమ్యభూమీస్థలి ను
న్నది చిన్న చెరువు ప్రమద
ప్రదాంబుసంభార నేత్రపర్యాకృతియై. 74

చం. ఉరుతరవారి పెద్దచెరు వుత్కటసంభ్రమదూర్మి నిత్యసౌ
మ్యరుచిరవారి చిన్నచెరు వంకురసంచలదల్పవీచి య
చ్చెరువుల సోదరీప్రణయజీవన భావన లేమిసెప్ప న
వ్వరిమడులందునన్ కలసిపాఱు నభేదగతిన్ తదంబువుల్. 75

చం. కుతకుతలాడి తీక్ష్ణ కరుకోల్తల సత్వము నీరుకాఱగా
పుతపుతపోవు నగ్గగనభూతము ధారుణిఁ గుంచితాంగమై
చతికిలబడ్డదో చెరువు సంభృత నిర్మలి నాత్మశంబర
ప్రతిఫల దంబరంబగుచు భాసిలు నద్దపు బిళ్ళ చందమై. 76

ఆ.వె. నేలనావరించి నిప్పునులోనుంచి
గాలిమంచి నింగి గానిపించి
వివిధజంతు వితతిఁబెంచు జలాశయ
మ్మరయ నొక ప్రపంచమగుచు మించు. 77

ఆ.వె. విష్ణుపదము వీడి వృషకేతు తలనాడి
త్రిభవనమ్ములందు తిరిగితిరిగి
విసిగి యిచటజేరె విశ్రాంతికై గంగ
యన్నరీతినొప్పు చిన్న చెరువు. 78

మ. అసలే నల్లనినల్పు దానిపయి బృందారణ్యమందెప్డు సూ
ర్యసుతాగాహనల న్మఱింత నలుపై యానల్పుక్షాళింప వ
చ్చి సుధాస్వచ్ఛజలమ్ము పొంత విడిసెన్ శ్రీవేణుగోపాలబా
లసదానందము కాక చిన్నచెరువేలా ప్రక్కలో స్వామికిన్. 79

శా. వాలాయమ్ముగ నర్ధరాత్రముల సేవాసక్తి శ్రీవేణుగో
పాలస్వామిని కొల్వవచ్చు దివిషత్పాలుండు మందాకినీ
కేళీనిత్యపవిత్రుడయ్యు ననురక్తిన్ తజ్జలమ్మాడకే
కాలూదండటె దేవళమ్మున తటాకశ్రీమహత్తెట్టిదో. 80

## వేణుగోపాల స్వామి

ఆ.వె. గోపికాప్రియుండు గోపాలదేవుండు
వెలసెనెచట మున్నెవెలసె నచట
క్షోణిజాప్రియుండు కోదండరాముండు
పంక్తికంధరాసుభంజనుండు. 81

కం. త్రేతాయుగమ్మునన్ సీ
తాతృప్తుడు ద్వాపరమ్ముతజి వ్రజనారీ
ప్రీతుండు పొదిలెయందున
నీతీరున ముందువెనుక లేర్పడియె బళే. 82

ఉ. ఇమ్ముగ కోవెలన్ రఘుకులేంద్రునకున్ భవతారకాఢ్యతే
జమ్మున కెవ్వ రెప్పుడు పొసంగగజేసిరో దాని నామరూ
పమ్ములు లేవు తత్స్మృతిలవమ్మును లేదు జనమ్ములందు లు
ప్తమ్మగు స్వామి విగ్రహము భావన యొక్కటిదక్క నక్కటా. 83

మ. ఘన సుశ్యామలవర్ణ సుందరతనూ కాంతిప్రసాదమ్ము లో
చనపాత్రమ్ముల నార్తితప్తజనతా చార్చిక్య కారుణ్యచం
దనమున్ వామభుజాగ్రవిస్ఫురిత కోదండమ్ము నౌ శిల్పక
ల్పనమామూర్తి యటన్నభావము జనస్వాంతమ్ములం దేచెడున్. 84

కం. మిక్కిలి చక్కని దనియెద
రక్కోసలుప్రతిమ దాని యడియాల మ్మే
చక్కి గన మెచట పాతిరో
యక్కట పొదిలె దురదృష్ట మనివార్యమ్మై. 85

మ. బహుభార్యాత్వవిలాసలాలసకళా వ్యాసంగులై దేవతల్
బహుభామాబలవత్కరగ్రహణతృప్యత్కాములై దానవుల్
మహనీయమ్మగు మానవత్వగుణధామ మ్మేకపత్నీవ్రత
స్పృహ నేపారిన స్వామికిం బ్రదుకుతెర్వే బండలైపోయెనా. 86

సీ. త్రేతాయుగమునాటి దృప్తకోదండమ్ము
పొగరు సొంతమ్ముగా పుచ్చిపోయి
పసినాటి తాటకాపాటనక్షమమైన
వింటినేర్పంతయు వీటఁబోయి
కాకాసురుని మూడులోకాలు త్రిప్పు ని
షీకాస్త్ర సంపద చితికిపోయి
యేడుతాడులనొక్కయేటున ఖండించు
కాండీరతాశక్తి కాటుపోయి

కఠిన రాజనీత్యభిమాన కారణమున
సీతనారీతి నవనిపాల్సేయు కష్ట
ధర్మమునవేమొకో మతాంతరులచేత
పొదిలె కుడివీథిలో కోలుపోయె స్వామి. 87

మ. పరమున్ పాయకకొల్చు వీరపవనాపత్యమ్ము తానేమి దు
ర్ధరుడా రామునికన్నస్వామి దురవస్థన్ కన్నులన్ పచ్చినె
త్తురులే కాఱగ బిట్టుగుందు నకృతాస్త్రుండైన యభ్యక్తునిన్
తురకాణ్యమ్మయి కొట్టివాపి రదియేదో కీడటం చజ్ఞులై. 88

ఆ.వె. కొట్టివేసినాము కోదండరామయ్య
నంచు బొమ్మవిఱిచి రజ్ఞజనులు
విహితవిశ్వమయుడు బహురూపు డాతండు
పొదిలెనేమి కొట్టుపోవుటేమి! 89

సీ. కోదండవక్రతాగుణమును తొలగించి
సమవేణుయష్టిగా సంగ్రహించి
రత్నకిరీట కార్కశ్యమ్ము దిగమొత్తి
శబలతామృదులపింఛముగనొత్తి
మినుకు శిరోరత్నమునకు వాసెనకట్టి
సిగఁగమ్మతావులచెండు వెట్టి
దండభీషణ రాజదండమ్ముపోబెట్టి
చెలువైనమునికోల చేతబట్టి

యుభయతారకమై యొప్పు నొడలిరంగు
పగటు సూపంగ వేణుగోపాలదేవ
మధురమోహనవేషసంభ్రముడు స్వామి
పొదిలె దక్షిణవీథిలో పొటమరించె. 90

ద్విపద. కట్టించె లాంగూలగజపతి పతికి
దిట్టమ్ముగా నొక్క దేవాలయమ్ము
స్వామిసేవావృత్తిసంపత్తిఁబొదిలె
సీమవాసుల జన్మ శేషముల్ తఱుగ. 91

కం. చంద్రకులాభరణుడు యదు
చంద్రము సమ్మోహనాస్త్రసమ వంశీ ని
స్తంద్రస్వనమున కొదిగిరి
చంద్రధ్వజులెల్ల పరవశత్వము పొలై. 92

సీ. చిలుకవన్నె బెడంగు నిలువుటంగీ మీద
తమి 'నఖీఖ్ 'పూసల దండలూగ
జాలెంపుసొంపుల జంపుగడ్డము మీద
పుష్టిల మీసాలు పిస్తునెఱప
కుల్లాయిపెట్టిన కుఱుబోడతల మీద
కుచ్చుపాగాఠీవి కొప్పరింప
కెంగేలి 'గిర్గిరా' కిట్టుకిట్టులమీద
కంఠ నిర్ఘోషముల్ కదనుద్రొక్క

తప్ప కల్లానుపాడుచు తల్లులకును
పిల్లలకు దీవనల్ పంచిపెట్టు చెక్కి
దిగెడు గడపగ నొక్కటే తిరుగుచుండు
నూరిలో కడుదొడ్డవా డొకపకీరు. 93

తే.గీ. స్వామి కన్నులబడి వాడు పరమపదము
జవిరె నెంతటిపుణ్యమో సర్వసముని
కరుణయెట్టిదో తన్మతాంతరుని యెడల
నతని గోరీని తనముందె యతుకుకొనియె. 94

ఆ.వె. విశ్వజనకుడైన ప్రేమరూపున కైన
వారలెవరు కానివారలెవరు
నేను నీవు నాది నీ దంచు తెలియమి
నవనిజనము వాదులాడు నంతె. 95

కం. దేవాలయమ్ము గజపతి
దేవవినిర్మితముఁ దీర్చిదిద్దిరి భగవ
త్సేవానురక్తి ముక్తికి
త్రోవమలుచుకొన్న వెలమదొరలు కృతార్థుల్. 96

సీ. వెలయించె గోపాలవిభునకు గర్భగృ
హమ్ము కుమారయాచాహ్వయుండు
వెంకటగిరినేత వెలుగోటివంశవి
లాసి పోలంరాట్కులమ్మువాడు
స్థలకరణమ్ము విశ్వాసియై తగిన సా
హాయ్య సంపత్తిఁ దన్నా దుకొనగ
నటమీద బంగారు యాచమనాయండు
భావసందిత గోపబాలకుండు

విప్పదీయించి తిరిగి కావించె రెండు
మండపమ్ములు కైవల్యమండలునకు
నెలమి ననికోట వెంకటాచలవదాన్యు
డమ్మవారికి తగు విమానమ్ముదీర్చె. 97

శా. తత్త్వాద్య ఘ్లనమండపద్వయము మక్తాకిచ్చి కట్టింపగా
బత్తుల్ కట్టుచునుండ నందొక డనల్పమ్మైన యాదా యటం
చత్తోయమ్ముఁ దొలంగిపోయెనట సంత్యక్తస్వలాభాంశు డా
బత్తు డెంతటిబత్తుడో తనకు దేవస్వమ్ము త్యాజ్యస్వమై. 98

శా. ఎల్లంరాజు గృహాభిధానుడు రమాహేలావతీనాయకాం
చల్లోలాత్ముం డకిల్బిషుండు పెదకోనంరాజు సేవాచ్యుతిన్
డిల్లమ్మౌ రఘురామభక్తుని ప్రతిష్ఠించెన్ ప్రసన్నాంజనే
యోల్లాసిన్ తగ వేణుగోప భగవ ద్వ్యాఢాగ్రభాగమ్మునన్. 99

తే.గీ. అయ్యు రామయ్యుఁ గృష్ణయ్యు యందు గనుచు
మురిసిపోవంగ నంజనీపుత్రకుండు
వేణుగోపాలదేవ సంవిన్మహాస్సు
చిద్విలాసించుబో చిన్నచెరువు చెంత. 100

## తాటితోపు

మ. సితవాఃపూరము చిన్నచెర్వున కవాచీనాశఁ బ్రత్యంత ప
ర్వతపాదస్థలిదాక చిక్కదనమొప్పన్ యోజనాయామ వి
స్తృతమై నందన మేమిలెక్కయనురీతిన్నిక్కి భూలోక క
ల్పతరూద్యానము తాటితోపొకటి చెల్వారున్ జనప్రార్థ్యమై. 101

ఆ.వె. ఎవడు నాఱువోసె నెవ్వడు నీర్వోసె
కంపవెలుగుకోట గట్టి యెవడు
పశుగణమ్ము బారిబడకుండ నమ్మహా
తాళవనము నున్నతముగ పెంచె. 102

మ. ఎవరోహో నిరవద్యస్వర్గరచనారేవాకసంవేగతాం
డవసానందు డనంతతాళపరిషన్మాంగల్యసామ్రాజ్య మి
య్యవనిన్ సర్వజనాంతరంగభరితాహ్లాదమ్ముగా నిల్పె త
చ్ఛివపాదాంచితకింకిణీకుణుకుణుశ్రీనాదముల్ వంద్యముల్. 103

ఆ.వె. పొదిలెకొండయొడిని పొదలుప్రత్యంతాద్రి
యైన యూరగొండ యస్త్రవిద్య
మరగి లక్ష్యభేదనిరతి నెడాపెడ
నాటు నంపగములు తాటిచెట్లు. 104

మ. అనిలో భీష్ముని కంపశయ్య యది యేమాశ్చర్య మామూరెడె
త్తునిర్మించుట యర్జునుండని సముత్తుంగద్రుమాస్త్రమ్ముల
న్నినుపారన్ పదివేలభీష్ములకునేనిన్ చాలున ట్లేనవా
ర్జునుడో తీర్చిన యంపశయ్య నిగుడారున్ తాటితో పందమై. 105

చం. మునుపు కవాతుకై పొదిలెభూపుల కాల్వురు కుచ్చుపాగలన్
తొనకకనిల్చు వైఖరులు తోపగ గాలికితూగియాడు శీ
ర్షనిభృతపత్రసంతతులు సంతతనిశ్చలకాండపంక్తు లిం
పొనర నిటారుగా నిలిచియుండు వనమ్మున తాళభూజముల్. 106

కం. కుదురులు వేఱై పెరిగియు
నదిరా యొద్దిక పరస్పరాభిముఖములై
కదిసి శిరమ్ములు మూర్కొను
హృదయసఖులరీతి కొన్ని తృణరాజమ్ముల్. 107



కం. మఱికొన్ని యొక్కకుదురున
పెరిగినవయ్యు నెడమొగము పెడమొగముగ వెన్
తిరిగి నిలంబడు కూర్మలు
తఱుగగ నెడమైన యన్నదమ్ముల మాడ్కిన్. 108

మ. ఒకజన్మాంతరవాసనాఫలితమేమో మొక్కలోవంగి భూ
మికి చేరంబడి సాగి నిక్కునటపై మిన్నేది యన్నట్లుగా
నొకతాళమ్ము సమస్తజీవ పరిణామోద్యోగ ధీశాలి పూ
ర్ణకృపన్ కామియొకండు మోక్షపథుడైన ట్లూర్ధ్వరేతస్కుడై. 109

ఉ. పుట్టినదాది దేహములపోషితసుందరత ల్వరింప కె
ప్పట్టున నాత్మసత్వగుణ వర్ధన దివ్య సుఖానుభూతికై
నిట్టనిటారుగా పయికి నిక్కుటయే పనియైన మౌని స
మ్రాట్టుల రీతి తాళతరురాజి విరాజిలు నవ్వనమ్మునన్. 110

ఉ. ఎల్లమహీజసృష్టి నవియేమిపసందులు తాటిచెట్లు కా
ర్నల్లని గొగ్గిమేనులు కరాళపు కొంగమెడల్ వికారపున్
చిల్లర చింపిజుట్లని హసింపకు డాబలితంపు బోదె ల
ల్లల్లన పట్టిప్రాకు లతికాళికి తెల్లము వానియందముల్. 111

మ. ఒక భూజాతలతాకుమారి ప్రణయప్రోన్మేషరాగమ్ము ముం
చుకొన న్నాథుని చుట్టిపట్టుకొని లేచున్ శీర్షపర్యంత మా
యక రక్తిప్రసవాభిషేక సులభుండై యేకపత్నీవ్రత
ప్రకటాంచద్గుణ రామభద్ర విభవస్ఫారుండుగా నాతడున్. 112

ఉ. సుందరవల్లవీనిచయ శోభి నవాంబుదనీలవర్ణున
ట్లందముచిందు నీలరుచిరాంగుడొకండు నితాంతకాంతిమ
త్సుందరవల్లరీప్రచయశోభిత ముత్పలకాంకమాలికా
కందళితప్రకాండుడయి క్రాలెడు దక్షిణనాయకప్రభన్. 113

చ. సొంపారు న్నవవల్లరీ ప్రణయినీ సూనాసవాస్వాదికిన్
మంపేదీ తృణరాడ్డివస్పతికి దిఙ్మాత్రమ్ముగానౌ శిరః
కంపమ్మొక్కటిదక్క సంతతసుధాగంధమ్ము తత్తాలకీ
సంపన్మత్తత నూగిపోవు నమరీసంకాశ లావల్లికల్. 114

కం. అతుల వదాన్యతాగరిమ నద్భుతకీర్తిచరిత్రులన్నవా
రితరుల కేదియోయొకటి యిచ్చిరిగాక సమస్తమిచ్చిరే
వితతవదాన్యతాగుణ పవిత్రచరిత్రుడు తాళరాజ స
త్కృతి యొకరుండె నిల్వునిలువెల్ల నొసంగును మానవాళికిన్. 115

కం. తలయిచ్చు నింటికప్పుకు
నిలువంతయు నిచ్చునింటినిట్రాళ్ళకు మే
న్నలియిచ్చు నింటి పొయ్యికి
నిలాజనుల కాతడెంచి యీయనిదేదీ 116

లయగ్రాహి.

ఉమ్మగొని భూమిసకల మ్ముడికిపోవగ జ
నమ్మలకు ప్రాణములు సొమ్మసిలగా గ్రీ
ష్మమ్ము చెలరేగి పవనమ్ములయుదారచల
నమ్ముల సదాగతితనమ్మడగ శీర్షా
గ్రమ్మున సమీరజనకమ్ములగు కోమల ద
ళమ్ములను వీవనల ముమ్మరపుసంతా
పమ్మడుగుడంచు ననిశమ్ము తృణరాజు కరు
ణమ్ములయ నెల్లరకు సమ్మతిగ నిచ్చున్. 117

మ. పునుగున్ కస్తురియున్ జవాదియన నేవోతావు లేమంత మే
లనురీతిన్ తృణరాజశేఖరవదాన్యశ్రీసమాహార నం
దనరూపమ్ములు పెండ్లిపందిళులమీదన్ పచ్చితాటాకు వా
సన లత్యంతము ఘ్రాణతర్పణములై శాసించు నాశావధుల్. 118

ఆ.వె. పొదిలె తాటితోపు పుణ్యమా యని తాళి
బొట్టులన చెవాకుచుట్టలనగ
పొదిలె పుణ్యసతుల ముగ్ధమోహన భూష
ణములు నిత్యమంగళములు పొలుచు. 119

తే.గీ. పొసగ నప్పుడుతీసిన పోతుతాటి
కల్లమృతపానమట్లు సుఖమ్ము సేయు
నడరు నిక్కాకచే నొడల్ చెడినవారు
విడువ కొకమండలమ్ము సేవించిరేని. 120

శా. నీరా యన్న మహోత్తమమ్మయిన పానీయమ్మదే దానిఁగం
పూరంగా పులియంగబెట్టి నవసంధ్యోపాసనా నిత్య స
త్కారస్వీకృతిఁద్రావి కైపుతలకెక్క న్నింద్యవాచాల గ
ర్వారంభమ్ముల మట్టుమీఱగ జనమ్మాతపప్లుతాళమ్ముదా 121

సీ. ఎనవచ్చు ననవచ్చు నునులేతకొబ్బెర
పక్కలో నొగరింత చిక్కకున్న
సరివచ్చు ననవచ్చు చెఱకులు సెలవుల
కోతలౌ కఱకులు కూడకున్న
ప్రతివచ్చు ననవచ్చు పనసమవ్వపుతొనల్
పొట్టలో నొకవిత్తు పుట్టకున్న
తులవచ్చు ననవచ్చు తొలికాపు మామిడి
పండ్లు టెంకల పుల్పుపట్టకున్న

తాటితోపిచ్చు నెందును సాటిలేని
బుఱ్ఱగుంజాను తేగలు ముంజెలును ఫ
లావలియును కాలముల రసాతి తర్ప
ణాప్తిగలిగించు పొదిలె జనాళి కెపుడు. 122

ఉ. కంజముఖత్రిమూర్తులును కాటుకలైన త్రినేత్రముల్మనః
పంజరబద్ధయోగత దివమ్మునవెల్గు ననంతసత్కృపా
మంజరి లోకమాతవలె మాటికి తాటిమొగానవ్రేలు లే
ముంజెలతల్లి లోకనులు మూడును శీతలతా ప్రసన్నముల్. 123

ఉ. కొంజక మండు నెండదొరకోల్తలకు న్వసివాడు మేనుల
న్నెంజిలియౌమనమ్ములను నిండగ చల్వలవెల్లు లెల్లవా
రంజలిపట్టివేడెదరు హార్ధత వే దిగిరమ్మటంచు ము
మ్ముంజెల వాయకున్ సెగల మూలపుదాయకు తాటికాయకున్. 124

ఆ.వె. తాళనగము దాతృతాపరమావధి
తనియపండినట్టి తాటిపండు
అమృతరససమాన మది రసబంధుర
సత్సమానమట్లు చవులపుట్ట. 125

ఆ.వె. పచ్చిపండ్లు తినెడు బలకృష్ణులకు తిని
పించు సుకవి కెంతపెద్దయెఱుక
అగ్నిపక్వమైన యా పండ్లరుచి సొంత
ముగ నెఱుంగు నొక్కపొదిలెజనమె. 126

మ. అననేవద్దల పోతుతాళ్ళ మెడలం దంకించు నాచన్ను లెం
దు నవర్ధమ్ములటంచు మేకమెడచన్నులోవ్వెలె నా గిల్కలే
యెలయు న్నిప్పులరవ్వలై పొదిలెలో నేటేట దీపావళీ
జనితోత్సాహులు భీమబాహులు యధేచ్ఛన్ త్రిప్పు పొట్లమ్ములన్.127

చం. అనయము తాటితోపు బహిరాకృతి చీమయు దూఱ సందులే
దనుగతి దుష్ప్రవేశనిబిడాకృతియయ్యును నందు దూఱగా
జనములు లేశమాత్రమును జంకరు కొంకరు దానిలోన స
జ్జన హృదయమ్మునట్లు సువిశాలమనోజ్ఞమహావకాశమై. 128

చం. స్థపతి విచిత్రకర్మలయి నన్నుతికెక్కిన వేయికాళ్ళ మం
డపములు కర్మసాక్షికిరణమ్ములు పాఱనివంచు నే మహా
స్థపతియొ కప్పులోనపలుసందులుగా నొక లక్షకాళ్ళమం
డపమిటు తీర్చిదిద్దెనన నల్వగు తాళవనమ్ము లోపలన్. 129

శా. ఆ లోనంగల కాలిబాటలను పాయల్పాయలై పెక్కుచం
దాలన్ చిక్కులు జీరులైవెలయ పద్మవ్యూహమట్లుండు న
న్నేల న్లీల నరుల్ చరింతు రటపోనేగాని రాజాల క
య్యాలమ్ము ల్గడవంగలేని యభిమన్యుల్ గారు వారెవ్వరున్. 130

సీ. పొదమీద మోములుకదలాడు నచ్చ తె
ల్పులపూల నెత్తావు లలము తెలివి
పొదపైని విహరించు పులుగుల వింత విం
తల వన్నెల గరుత్తు లొలయు తెలివి
వచ్చిపోయెడివారి వాలకమ్ములుగను
పొదచాటు కుందేళ్ళ పదను తెలివి
పొదవిన్నపము తాళమునకు వేవినిపింప
పఱతెంచు నుడుతమేలరుల తెలివి

లోన తెలివెల్ల నిట్లు సంధానమయ్యె
పైకి నేమియు తెలియని వాని రీతి
కృతకజడతావగుంతన ప్రీతుడైన
తాళవనరాజు మౌనముద్రకు జోహారు. 131

మ. అల బృందావనిలోని తాలవననిన్యాసమ్ము్మలం దేమి గొ
ప్పలు పండించిరి రామకృష్ణభగవద్భావాభిరామమ్ము్మగా
ఖలులౌ గర్దభరూపధేనుకుల డాకల్లేని యీ తోపు గొ
ప్పలు పండించితి నిట్లు సర్వజనతా వాల్లభ్య సంభారముల్. 132

ఆ.వె. కొండయన్న నూరగొండయే కొండ త
త్తాళవనము దాటి దక్షిణమున
గుండె చెదరు నరులు కూపెట్టినంతలో
బండలెల్ల నభయవాక్కుపలికి. 133

ఆ.వె. పొదిలె పశుగణమ్ము్మపోవు నా కొండకు
కడుపునిండ పచ్చిగడ్డిమేయ
పొదిలె బీదజనము పోవు నా కొండకు
కడుపుకొఱకు వంటకట్టెలేఱ. 134

ఉత్సాహ. కలివెపండ్లు జానపండ్లు గారపండ్లు తఱపి వె
న్నెలలు విరియు పాలపండ్లు నెమ్మిపండ్లు కొమ్మిపం
డ్లలరు బలుసు పండ్లు నాదియైన వన్యఫలము లే
కొలదివెట్ట కిచ్చు నూరగొండ పొదిలె కెప్పుడున్. 135

ఆ.వె. పాలు పెరుగు త్రావుపట్టున ముప్పొద్దు
కుడుచువేళ కొసరి కొసరి కొనెడు
కాలమందు పం డ్లొకంటికి రెండుగా
నూరగొండ మెచ్చు నూరిజనము. 136

ఉ. కక్కిరిబిక్కిరైపొదలు కంపలు చెట్లును చేమ లంతటన్
మిక్కిలి మూగి సావయవనిశ్చయ మేదిన యూరగొండయున్
చిక్కులు జీరులౌ కురులచే తలయెల్ల ముసుంగుపడ్డదై
ముక్కుమొగమ్ము వేర్పడని ముత్తవగా కనిపించు కంటికిన్. 137

ఆ.వె. ఊరగొండ యవ్వ యొక బూచి వోలె క
న్పడిననేమి కరుణపట్టెడంద
పొదిలె జనులు కుతుకపూర్ణాంతరంగులై
పిలిచినంతలోన పలికితీఱు. 138

ఆ.వె. అవ్వరాజసము మహారాజులకు లేదు
తలలుమార్చు మంతురులకు లేదు
అంతకొమ్ము తిరిగినట్టివాడును ముందు
పలుకవలయు పలుకవలయు నవ్వ. 139

ఉ. ఏయెడ నెవ్వరేని గళమెత్తి తటాలున 'నూరగొండ బు
చ్చీ' యన 'నో' యటంచు వివశీకృతసర్వదిగంతరమ్ముగా
శ్రీయమృతత్వసంపిహితచిన్మయశబ్దవలన్మహాగభీ
రాయతి మాఱుమ్రోయు నగమంతయు నందలిబుచ్చియెవ్వరో 140

సీ. పండ్లు కోయగవచ్చుపడతులు పసుల కా
పరులు కట్టెలుకొట్టువారు నడవి
మెకములభీతి నాయకఁబిల్చి తదభయా
యతశబ్దఝరిస్తిమితాత్ములగుదు

రనువత్సరము నృసింహస్వామి తిరునాళ్ళ
దరిసింప పొదిలె భూధరము నెక్క
వారు వేబోక తత్పాదస్థమగు పర్వ
తాలబావి సమీపధరణి విడిసి

మొగములను గుంజి చల్లుల ముద్దు తీర్చి
తఱుము నుత్సాహమునరేగి తఱిమి తఱిమి
యొక్కమెయి పిల్పుటఱపుల నూరగొండ
బుచ్చినుసికొల్పెదరు పంతమచ్చుపడగ. 141

ఉ. కోకిల కూతకుంబ్రతిగకూయు మనుష్యుల కోహటించి యా
కోకిలనోరు మూతపడుకొంచియ మున్నదొకప్పుడైన శ
బ్దాకృతి బుచ్చి తన్గదుపు నయ్యలనోళ్ళు ప్రతిధ్వని ప్రభా
వాకలనావిచేష్టముగ నప్పటికప్పుడు నొక్కనెప్పుడున్. 142

మ. ఎవరాబుచ్చి పరార్థసాధనదురంతేచ్ఛాప్రభూతాంచిత
వ్యవసాయప్రవణాంతరంగమున నిత్యమ్మైన యోంకార మం
త్రవివేకమ్ము శివార్థహీనమయి తద్వ్యాఘాతనిష్పీడి తా
యువుగాదూఱిన దూరగొండయెదలో నోంకారసర్వస్వమై. 143

మ. కడుపాపాత్మకులెల్లనోళ్ళుపడగా కండల్ తెగంబెంచుచుం
బడిదయ్యమ్ములలీల కాయములు తీర్పం భూమికిం భారముల్
కడుపుణ్యాత్మిక బుచ్చికండలఱుగన్ కాయమ్ము పాయమ్ము పా
ల్పడియున్ కంఠగతైక శబ్దమయ తత్వస్ఫూర్తి దీపించెడున్. 144

*

శా. చారిత్రార్థవిశారదా పరిణతాంచన్నా్ౕయయవిద్యాస్పదా
తారుణ్యార్ద్రవిలోకనా శ్రితమనఃకంజాతఖద్యోతనా
నీరేజేక్షణనిత్యనిస్తులదయా నిర్మృష్టరాగోదయా
తారాధీశ్వరమౌళిపూజనరతా తారోజ్జ్వల శ్రీయుతా 145

కం. క్షేత్రజ్ఞగోత్రమండన
క్షేత్రక్షేత్రజ్ఞభాగ శివయోగజ్ఞా
నత్రిస్రోతస్స్నాతా
ముత్రికపరమఫలవృక్షమూల వివేకా . 146

మాలిని. ప్రతిదినపఠితాంధ్రప్రాజ్ఞమహాకావ్యవీథీ
వితతమహితభావావిష్టసంస్కారదీప్తి
ప్రతిదినభగవత్సంప్రార్థనాయత్తచిత్తో
ద్యతనిరవధికాంతర్యాగయోగాప్రమత్తా . 147

*

నాయని సుబ్బారాయ క
వీయమ్మిజన్మభూమి నిది పరమవిషా
దాయుక్తమధురగాథా
కాయౌజ్జ్వల్యము తటాకఖండమ్మలరున్. 148

----- 0 -----

# ధరణీధరఖండము

శ్రీ సంబురాయ భక్తి స
మాసాదిత పొదిలె భూధరాగ్రస్థ నృసిం
హాసేచనకాంఘ్రి సరో
జాసవపానమధుపాయితాత్మ నృసింహా. 1

## శ్రీ పొదిలెకొండ లక్ష్మినృసింహావతారము

ఆ.వె. ఊరగొండనంటియున్నదే భక్తర
క్షావధానతత్పరాత్ముడైన
శ్రీ నృసింహదేవుసేవామహాభాగ్య
పదము నందుకొన్న పొదిలెకొండ. 2

ఆ.వె. అమ్మహానుభావు నాస్థతోనెన్ని ధా
త్రీధరములు సంభరించలేదు
పొదిలెకొండ తనదు మూపుపై ప్రభు నిభా
యింప గన్న చిత్రమెందులేదు. 3

కం. ఒక తెల్లవారుజామున
సకలాత్మ్మ డహోబలేశు శయ్యాహ్మాదిఁ బా
యక పవళించెడు పద్మిని
యొకటే కదలాడ దేవు డున్నిద్రుండై. 4

కం. మును పెవ్వరెవ్వరికి నీ
గనని నిరంజనసుషుప్తికరమగు నీ మె
త్తని పాన్పుపై పరుండియు
ననుకూలవతీ యిదేమి యారాటమ్మే. 5

మ. అనినన్ పక్కన నవ్వి లక్ష్మి యదికాదయ్యా రసజ్ఞప్రభూ
కనినేనిప్డు మహాద్భుతంపు కలయుంగా సంభ్రమాశ్చర్య సం
జనకమ్మైన విశేషమొండు తదధీనమ్మైన చిత్తమ్ము బో
రన రేపన్ కదలాడితిన్ తమకు నిద్రాభంగముంగా ననన్. 6

కం. మనకీనిద్రా స్వప్నా
ద్యనుషంగములెల్ల నిట్టు లనివార్యములై
పనుపడియె విచిత్రముగా
మనుజమహీ చిరనివాస మహిమోదితముల్. 7

తే.గీ వామనేత్రా శుభము తెల్లవాఋజాము
నందు వచ్చిన కలయు సద్యఃఫలదము
చెప్పవే యది యెట్టి విశేషమో మ
తే విచిత్రమో యని వేగిరించె విభుడు. 8

కం. ఆయమ సస్మితయై నా
రాయణ యది యొక్క వృక్షరాజ మనియె వ
హ్వా యని పకపక నవ్వుచు
నాయన పరిహాస తరళితాస్యాంబుజుడై. 9

ఉ. ఈవరతీర్థమందు పరమేష్ఠిముఖామరకీర్తితమ్ము ల
క్ష్మీవన మిట్లు నీకయి రచించితిగా మనసెల్లపెట్టి స
ర్వావనిజాత సర్వలతికాఖిలపుష్పమనోహరమ్ము శం
పావిచలాత్మ స్వప్నగతపాదపసక్తి యిదేమిటే యనెన్. 10

కం. వినవయ్యావిను సొంతము
వినినంతట మేలమునకు వేళాయెను పో
యెనలేని తగులు గల యి
వ్వని పైతమ్మట్టిపాదపముఁ గానము పో 11

చం. అదియొక వృక్షరాజమని యంటెనిగాదె మహానుభావ త
ద్విదిత మహానుభావపరివేదన నీకొకవింతయే జగ
త్సదన యనంతవిశ్వసముదాయ గతాఖిల వృక్షవాటికా
పదములయందు నట్టి ఘనపాదప మింకొకడున్న వింతయే. 12

చం. కుసుమములెన్ని లేవిట బుగుల్కొను వాసనలొచు వీనిపై
విసుగు జనించె తద్విమల వృక్షసమాగత పుష్పమంజరీ
విసరము చక్కగామెదిపి వేడుకనా రసమెల్లమేనికిన్
పసుపుగ పూసికొందమను భావము ముమ్మర మేమిసేయుదున్. 13

చం. అవిపూవులా కావహో పేర్చిమండు న
గ్నిజ్వాలికాచలత్క్రియలు గాని
అవిపూవులా కావహో సుభిక్షావతీ
సత్ప్రార్థనా విశేషములు గాని
అవిపూవులా కావహో మహీజమ్ము సిం
గారించుకొను భూషణములు గాని
అవిపూవులా కావహో ధాతువర్ణారు
ణములైన పద్మరాగములు గాని

అవి జగదతీతమధురమోహనసుగంధు
లమరులనుగూడ తత్పరాయణుల జేయు
నమరవందిత మీపత్నినైన నాదు
భావమప్పువ్వులకు నెగబడియె నిపుడు. 14

ఉ. నవపుష్పగంధవివశాకృతి యిట్లనగా నహోబల
శ్రీ నరసింహదేవు డొక చిన్మయభావవిలాసితాస్యుడై
ఔనదియారెమాను మఱి యాపువు లీవని నట్లు శోణ సం
ధ్యానవరాగబంధురము లద్భుతదివ్య సుగంధిలమ్ములున్. 15

తే.గీ అ విరులు నీదు హృదయమ్ము నాచికొనియె
నా విరులకొమ్మ యొకొమ్మ యస్మదీయ
కంఠకీలితవనమాలకై సివమ్ము
నొందునాయేమి యది యట్టులుండనిమ్ము. 16

ఉ. నీ వెటులేని యాతరువు నీడల పాడుచు నాటలాడుచున్
పూవులరాణివై కులుక బోయెదనందువు సింహమూర్తినే
నీ వికృతంపు కోఱలయి యిట్టిసటాచ్ఛట లిట్టిమీసలై
పూవులనేమి చేసికొనబోదు నవప్రసవానురాగిణీ. 17

మ. పలుకందేవుడిటుల్ హరిప్రియయయు నోప్రాణేశ నీ గుండెలో
పలిదానన్నను తప్పుపట్టకు శిశుప్రహ్లాద రక్షాభర
మ్మెలయింప న్నరసింహమూర్తివగు నీ యీనవ్యసౌందర్యమం
గళ రూపమ్మనిశమ్ము నా యెడదలో నర్తించు నాశాస్యమై. 18

సీ. అగ్ని కీలాసమాహారమ్ములాపూల రేపుమాపును మీకు దృష్టితీసి
సరససంభావనాభరితమ్ములాపూల మీమీసలకు వింతమిసిమిగూర్చి
పద్మరాగప్రభాపటలమ్ములాపూల మీసటాచ్ఛటలకు మెఱుగుదిద్ది
పరమశోభాలసత్ప్రార్థనలాపూల నహరహమ్మును మీకు నర్చలిచ్చి

ధాతకీపుష్పగంధసద్ద్రవ్య సుప్ర
సాధనమ్మృదుక్రియా సముజ్జ్వలిత దివ్య
దీప్తిమన్మూర్తిగా మిమ్ము దీర్చుకొందు
రమ్ము హృదయేశ యని ప్రార్థనమ్ము సేయ. 19

ఉ. అండజయాన నీ వరుగ నా తరువీథికి వెంట నేను రా
కుండుటయుండునా మొదటినుండియు మా చరితమ్ములెల్ల నీ
కొండలమీదనే గడచె క్రొత్తగనిప్డాకచెట్టుక్రింద గూ
ర్చుండగ గోళ్ళు గిల్లుకొనుచున్నతి నావశమా మనోహరీ. 20

కం. అని సతిసంప్రార్థన
మునకు బదులుసెప్పముదిత ముదిత నదియు న
చ్చిన కొండలెక్కుతమిఁ బే
ర్చిన ప్రభువా గట్టుమీది చెట్టే యనియెన్. 21

శా. ఎట్టెట్టూ యిది ముందె చెప్పవయితేమేప్రౌఢ నీ విప్పుడ
న్నట్టేయైన నికేమి కావలయు స్వప్నమ్మందు నాద్యంత మా
గట్టున్లెస్సగ చూచియుందువుగదా కంజాయతాక్షిద్వయీ
గుట్టావంతయులేక తద్విధము సాకూతమ్ముగా తెల్పవే. 22

కం. అనుచున్ తొందరపెట్టెడు
ఘనశైల గుహావిహారగంభీరకళా
త్యనుపమ పాండిత్యునకు
న్వినయమ్మున లక్ష్మియిట్ల వినిపించెతగన్. 23

శా. సందేదీ ధరణీధరేంద్రము పయి న్సారింపగా చూపు నా
డెందమ్మందున ముందె యాతరువు మండెల్వోసి కూర్చుండ త
త్సౌందర్యామృతపుష్పమంజరులు నాథా యైన క్రేగంటిరే
ఖందళ్కొత్తిన దాని చందమును శృంగగ్రాహికన్ చెప్పెదన్. 24

మహాస్రగ్ధర.
పరమాశ్చర్యాతి లీలాపరిణతగతులం బారగా సాచి రెక్కల్
కరమాకాశాంతమై నిక్కగ శిరము భుజస్కంధమందిప్పుడే శ్రీ
నరసింహాకారవిష్ణూన్న మనమనుచు సన్నద్ధసర్వాంగకుండై
గరుడాళ్వారట్లు తోచెన్ కను తుదల మహాగ్రావరాజమ్ముదేవా 25

కం. సతి చేసిన సూక్ష్మతరా
దృ్భతవర్ణనమునకు మనసు పొంగ పతియు నీ
గతి దానిబోడు తద్వి
స్తృతియున్ చిత్రింప నెంతచిత్రము తరుణీ. 26

తే.గీ అది పొదిలెకొండ సుమ్ము నా యంతరంగ
మందు దాని సమాచార మరపి యుందు
నది పొదిలెరాజు నాజ్ఞలోని దతగాడు
నాదు భక్తుండటంచు విన్నాను గాని. 27

మ. జననాథాగ్రణి యెట్టిభక్తుడో పరీక్షాపాత్రునింగా వరిం
చిన సందర్భము మున్నుగాన మతడే చిత్తమ్ముావాడైన నె
మ్మనమున్ లోగొను నట్టి కొండకయినన్ మర్యాదటే మాకు పి
ల్వని పేరంటము పోవగా ననుచు లీలాహాసవిస్ఫూర్తిగాన్. 28

చం. అవునవునండి మీది మరియాదకు పెట్టినపేరులెండి మీ
కవసరమైనచో నొకరికైనను చెప్పకపెట్ట కమ్మెయిన్
జవనపుదౌడు తీసెదరు చక్కటివారు హతోస్మి యంచు పే
రు వరుస లేచి వెంటబడి రొప్పుచు రోజుచు పర్వులెత్తగన్. 29

తే.గీ ఆపొదిలెరాజు మీ భక్తుడంటి రతడు
పిలువలేదని యీ బిఱ్ఱబిగువులేల
సృష్టి కార్యేంద్రజాల విశిష్టు లతని
చేత పిలిపించుకొను యుక్తిసేయ లేరొ. 30

మ. పలుకంగా నిటు చంచలాంగి చతురప్రాగల్భ్యమేపార స
చ్ఛలపుంగ్రీడగ మేఘవర్ణుడనియెన్ సంతృప్తియే లేదుగా
చెలువౌ శ్రీవనమెల్ల చొప్పడియు నోసీ చంచలా యెంత చం
చలవే క్రొత్తల కిట్లెగంబడెద వంచచ్చంచలాలోలవై. 31

కం. ఆ సడిమాటల నిజవాం
ఛాసత్వరసిద్ధి కొక్కచందము గని యు
ల్లాస తరంగితమతియై
శ్రీ సతి కరయుగము మొగిచి చిత్తేశునితోన్. 32

ఉ. నీవు చలద్ఘనాఘన వినీల మహాపఘనుండవై భవ
చ్ఛ్రీవిపులోరు వక్షమున చిందులు త్రొక్కెడినేను చంచలన్
కావు టదేమి యబ్బురము క్రమ్ముమయా యిక మత్తటిత్తనూ
వ్యావృత ధూమలుండవయి యన్నగమార్గము లమ్మయమ్ముగన్. 33

కం. అన నాయన నీ యుక్తుల
సునిశితమతి యెట్టి యుక్తిఁ జొప్పించితివే
నిను మెచ్చితి మనపని ప్రా
ద్దున చూతములే యనంగఁదుందుడు కడరన్. 34

తే.గీ అవిగో పిలిచెడి నయ్యారెపువులు న న్ని
కొక్కక్షణమైన జాగున కోర్వజాల
పొదిలె కొండనె మనకింక ప్రొద్దు పొడుపు
కడగు మని సతి పతిని నిక్కచ్చిసేయ. 35

సీ. ధాతకీపుష్పగంధద్రవ్య సమ్మోహ
వతి ప్రాణసతి గాఢవాంఛ యెఱిగి
పొదిలె భూధరము మూపున పచార్లొనరించు
నాత్మ కౌతూహల మ్మగ్గలించి
భక్త పరీక్షా ప్రభావ భాసురమైన
వింత కోరిక లోన గంతువేసి
భక్తరిరక్షా స్వభావ పూరితమైన
కరుణాంతరంగమ్ము కట్టపొర్లి

విశ్వ సుస్థితి పరమ పవిత్రకార్య
భారధౌరేయ మహిమానుబద్ధ చిద్వి
లాస సంభృతానంద లీలా విచిత్ర
వర్తను డకాల పర్జన్యమూర్తి యయ్యె. 36

కం. జూలు విదుల్చుచు సద్య
స్కాలోద్యత్కాలికలుగ శ్మశ్రులు తటిదా
లోలాంశువులుగ గర్జా
భీలత పర్జన్యమూర్తి పేర్చెడు లోనన్. 37

మాలిని. నరహరి పదసేవానందలోలాత్ము డింద్రా
వరజ నయనసంజ్ఞాప్రాప్తరూపప్రకాండుం
డఱిముఱి పృషదశ్వుం డాశుగుండై దిశా గ
హ్వరవివరములన్ తారాడు మేఘాళి నూపన్. 38

మేఘవిస్ఫూర్జితము.

రమాప్రాణేశాజ్ఞావిధి విగత విశ్రాంతి సల్లాప సౌఖ్య
ప్రమోదమ్ముల్ చింతాహతమలినరూపక్రమమ్ముల్ పయోభృ
త్సమూహమ్ముల్ కింకమ్ముసురుకొనగా చంచలాలోలరేఖా
నిమిత్తాగ్నిభ్రమ్ముల్ చదలు వెలిగెన్ మేఘవిస్ఫూర్జితమ్మై. 39

ఆ.వె. నింగి ముసురుకొన్న నీరంధ్ర నీలాభ్ర
ముల ముసుంగు వడ్డ మొలకప్రొద్దు
పొడవడంగె పొదిలె మొద లహోబలము ప
ర్యంతమైన భూమి నైపు లేక. 40

తే.గీ ఆటవిడుపు భగ్నమయ్యె నన్నచింత
మొద్దుబాఱిన నీమేఘములు మహాత్మ
యింత జక్కుల సంతోషమే యిదెప్డు
కాపు సంతోషమని లక్ష్మి కళవళింప. 41

కం. ఈ జీమూతమ్ములు ప్రో
వై జెజ్జుల లీల నింగి నలమియు జలము
గ్యోజనకు మ్రొగ్గవేమని
శ్రీజానియు కన్నులెఱ్ఱ చేసెనొ లేదో. 42

మ. పవమా నాంబుజనాభ సేవక రుషాపాణింధ మోచ్ఛ్వాస వే
గ విధా విభ్రమరూప కర్కశకశాఘాతమ్ములన్ తోలు బి
ట్టువియంగా నొడలెల్ల లొత్తలయి శీర్ణాంభోధరాహంయువుల్
పవలున్ రేయు నెఱుంగరాక తొరగెన్ వర్షాశ్రుధారావళుల్. 43

ఉ. రాతిరి తారకానిచయరమ్య వినిర్మలినాంబరమ్ము తా
నీ తెలవాఱువేళ నిదియేమి విచిత్ర మకాల కాలవ
ర్షాతనువైన దంచు నిరుచంకల చాపలు పక్కచుట్టలై
లో తలివమ్ములన్ పడిరి లోకులు సూదులుచిమ్ము వానకున్. 44

సీ. నులకమంచము కుక్కితలగి బిఱ్ఱెక్కి పై
కడరించె భరతనాట్యంపుకోడు
రోకటిపోటుచీకాకు పోయిన ఱోలు
జలదేవతా మహోత్సవము చాటె
కాకి రాల్చిన గింజ కందళించిన గోడ
మదురు జీవన భాగ్యమహిమ వెలిగె
పిడకలు తట్టిన విడికఱ ల్వ్రిసిపో
ప్రహరి సున్నపుపూత పరవశించె

కప్ప జంటల ప్రణయంపు కలసి కోళ్ల
బెకబెకల సంబరమ్మున పృథివి చెలగె
నా నిరంతర వర్షధారానిపాత
మాదరించిన ప్రథమ మర్యాదలందు. 45

సీ. పూరింటి నడికప్పుటోర జిక్కినకోడి
జడమయ్యె క్రొన్నీటి కడవ లీల
నంబికానాథాలయ ధ్వజ స్తంభమ్ము
పైకొత్తు వానకాల్పగిది తూలె

నలబలమ్ములతోడి యవయవమ్ములు మాసి
నీటిదయ్యము వోలె నిగిడె చెట్టు
గతిలేక బయలైన కాకి ముచ్చుముడింగి
ప్రేతాత్మరీతి వీన్వీథి సురిగె

నంతకంతకు మిడిమేలమైన వర్ష
భూరిధారలరేగు తుంపురుల తెరల
తెరతెరలజిక్కి మెలికలు తిరిగి విరిగి
ప్రకృతి యంతయుమాఱురూపమ్ము పడియె. 46

సీ. అగ్గికి కొఱుకరానట్టి కొయ్యల తడి
పొగచూరి యన్నమ్ము పొందుదప్పె
నాలుకతీపికై నంజుకోనమరిన
తీరు బెల్లపుటచ్చు నీరుకాఱె
కరకరల్వో దూదిగతి మెత్తనై చెడె
చిఱుతిండి కేర్పడ్డ బొరుగులెల్ల
నప్పుడప్పుడు నోటిత్రుప్పు డుల్లగజేయు
పండురేగడ బూజుపట్టిపోయె

నా నిరంతర వర్షధారా నిశాత
శీతలత్వోపహతి కుప్పుసెనగలైన
లేక తల బైటపెట్టంగరాక తిండి
తిప్పలకు నగచాట్లయి తెరలె జనము. 47

సీ. నిత్యప్రదోష సన్నిహిత శివాలయ
నడిమంచమై చిక్కెనాయనమ్మ
నిత్యభోజనపూర్వ నియతదర్శిత సూర్య
నింగి చూపై యూర్మిక్రమింగెనమ్మ
నిత్యగార్హస్థ్య సన్నిషార్చితాతిథి
వీథివాకిలి కాపువేసె నయ్య
నిత్య బృందాగ్రసంధిత రంగవల్లిక
నక్కి యేమూలనో స్రుక్కె నక్క

యానిరంతర వర్షధారాభిఘాత
జర్జరిత గేహ దేహ విస్రస్తబుద్ధి
బలులు కాలును చే యాడ కలమటించి
యఖిల కర్మల నిష్క్రియులైరి జనులు. 48

వసంతతిలక.
ఆకీడు మూడి యకటా కడగండ్లపాలై
శోకింపగా జనము సుంతయు జాలి లేక
వైకల్పికమ్మయిన వర్షము సంబురాయ
క్ష్మాకాంతు పాలి విషసర్పము విక్రమించెన్. 49

చం. పొదిలె ధరావిభుండు గుణపూర్ణుడు ధన్యుడు సంబురాయలున్
సదమలకీర్తి సర్వజనసమ్మతవర్తను డాదిరాజ సం
విదితవిశుద్ధధర్మపదవీపరిణిష్ఠు డహోబలేశ స
త్పదకమలార్చనా నిరతభక్తి సమాహితచిత్తు డెంతయున్. 50

ఉ. పూజముగించిలేచు కృతపుణ్యుడు రెండవజాము గంటకున్
శ్రీజనక మ్మహోబలనృసింహ పదామలతీర్థ మప్డు రా
నై జననేత భక్తిభరితాత్మత దానిఁ బరిగ్రహించియే
భోజనకాండకుందిగు నపూర్వముగా నిది నిత్యకృత్యమై. 51

సీ. ఎక్కడి పొదిలె మఱెక్కడి యోబళ
శ్రీక్షేత్రరాజ మీరెంటిమధ్య
నెంతలేదన్న కనీసమ్ము పది పదు
నేనామడలదూర మైననుండు
నెట్లువచ్చును తీర్థ మింతదూరము నుండి
ప్రతిదినమ్మును వేళపట్టునంద
శ్రీమదహోబలక్షేత్రదైవతలగ్న
వరభక్తిజనితప్రభావమిదియు

నెంతటి విచిత్రమహనీయ మీ నృపాగ్ర
గణ్యు డెంతటిసిద్ధసంకల్పు డంచు
దినదినమ్మును తీర్థమేతెంచువేళ
నాడుకొనుచుందు రచ్చెరువార జనులు. 52

శా. మర్మజ్ఞుండగు పెద్దమంత్రి నియమింపంగా సమర్థాశ్వికుల్
కర్మణ్యాంకితజీవు లంచెలుగ మార్గమ్మంతయున్ తీర్చి యం
తర్మధ్యమ్మునపోవు గుఱ్ఱముల మీదన్ తెచ్చి తత్తీర్థము
న్నిర్మలప్రష్ఠాఘుడు సంబురాయలకు నందింతుర్ సదా వేళకున్. 53

తరల. ముసురు పట్టిననాడు వారలు మొల్కజల్లుల వానకున్
పసినిసుంగులు సంబరంపడి బైట నాడుచు జేరి కే
కిసలు కొట్టెడురీతి వెల్వడి గిట్టజల్లుల కోర్చి సా
హసభరాత్ములు వేళకే పతి కందజేసిరి తీర్థమున్. 54

ఉ. రెండవనాడు భూతల హరి ద్వియదంతరమెల్ల తామరై
చండతరార్భటీశితకశాహతులౌ పెను వర్షధారలన్
పిండితదేహులయ్యు బిగివీడ కెదోయొకవేళ కెట్టులో
మండలనాథమౌళికి సమర్పణ చేసిరివారు తీర్థమున్. 55

సీ. వరదలన్నియు వచ్చి చెరువులన్నియు నిండి
కడుపుపట్టకనీరు కట్టలవసి
యేఱులన్నియు పొంగి యేకాప్యమై వాగు
వంకలన్నియు నొక్కవరద గట్టి
ప్రళయవేళా మహార్ణవ భీకరాకృతి
భూమియంతయు నీటిముంపుగాగ
కుకవి సంధానించు గొగ్గిమాటల పద్య
పాదమ్మువలె బాట పట్టుసడలి

విఱిగి రూపమ్ముచెడి నీటసురిగి పోయె
దారిపొడుగున నంచెలవార లెచట
నడగిరో యక్కటా: తీర్థమంద దవని
నాథవరునకు మూడవనాటి నుండి. 56

ఆ.వె. తీర్థమానకుండ తిండిమాటటులుంచి
పచ్చిగంగయైన పుచ్చుకొనడు
నృహరిభక్తు డేమి గ్రహచార మిదియని
చింతపడిరి పొదిలెసీమ జనులు. 57

కం. ఆపద్ధర్మముగా ల
క్ష్మీపతి భక్తాగ్రగణ్యుచే నెట్లైనన్
సాపదున ట్లొనరింపన్
చేపట్టిన కడకలెల్ల చిట్లెన్ వృధయై. 58

ఉ. చెప్పెను వృద్ధకంచుకి విశేషవిధిజ్ఞుడు పెద్దమంత్రియున్
చెప్పెను రాణివాసమును చెప్పె కుమార తెలుంగురాయలున్
చెప్పె దివాణమందు మఱిచెప్పగలట్టి ప్రబుద్ధులందఱున్
చెప్పిరి రాజు నిశ్చయము చిట్లదుపో యెవరెంత చెప్పినన్. 59

సీ. ప్రజనెల్ల తన తెల్గురాయనివలె జూచి
నిండువాత్సల్యమ్ము నెఱపు తండ్రి
రాణివాసము దక్క రమణులందఱ నక్క
జెల్లెండ్రుగా విమర్శించు మాని
యిదిచేయగాదగు నిదిచేయగాదను
సదసద్వివేక విస్ఫారబుద్ధి
ఆకలంక విష్ణుభక్త్యావేశదీప్తి న
త్యభినవుండైన ప్రహ్లాదశిశువు

తనప్రజ ల్పొడుపాట్ల కంతర్మనుండు
ధరణినాథుండు సంతతాంతర్ముఖుండు
పూజగదిలోన స్థండిలమ్మున శయించి
నృహరిమ్రోల నంతర్యాగనిష్ఠుడయ్యె. 60

తే.గీ. బయట వర్షమ్ము చెలరేగుభంగి గనడు
లోన క్షుత్తృషల్రేవు కల్లోలమరయ
డయ్యహోబలపతి విగ్రహమ్ముమీద
సంబురాయండు చూపు నిశ్చలమొనర్చి. 61

ఉ. నాలవనాటి వేకువ మనమ్మును చూపును నేకమైన భూ
పాలుని కంటికిన్ ప్రభుని భైరవ సింహముఖమ్మునందు లీ
లాలులితాతికోమలవిలక్షణలక్షితహాసరేఖ క్రొం
జాలుగ తోచినట్లయిన సంబుడు భక్తివశంవదాస్యుడై. 62

ఉ. తాతలనాటి ముల్లెవని తత్పరత న్నినుబట్టి డెందపుం
గోతమునందు భద్రముగ కూరి తరించితి నింతకాలము
నీ్నతలపెట్టిదో యెఱుగ నీవొకమాయగ నిప్పుడిట్లు లీ
గోతముచించి బైటబడ గ్రుచ్చెదు శాతనఖాసిపుత్రికల్. 63

మ. అపుడాబాలునకై హిరణ్యకశిపు స్వాంతమ్ము చీల్పంగ మో
దపువార్ధిన్ తలమున్కలయ్యెనటకాదా దేవసంఘమ్ము క్రూ
రపు నీగోళులతీట తీర్చుకొన లేరారాక్షసుల్ భూమిపై
నిపుడీదీనుని పందబట్టితి వయారే మెచ్చునిల్లోకముల్. 64

మ. అంగమ్మయ్యది మానవాతిసహజమ్మైనంత నేమాయె నా
సింగంపున్ తలకాయరైయె చెడియెబో చిత్త మ్మటుల్గాక ద్యో
రంగమ్మందు నకాలమేఘ నటలారాభ్భటమ్ముగా నీదయా
సంగీతమ్మిటుసాగునే ప్రళయగర్జాతర్జనోదగ్రమై. 65

ఉ. నిక్కపుభక్తి నన్వహము నేమముతోడ పరిగ్రహించు నీ
గ్రుక్కెడు పాదతీర్థమునకు న్ననుబాపగ నెంతపన్నితీ
వక్కట నాదురాజ్యమిదియంతయు వారిమయమ్ముగాగ నా
గ్రుక్కెడు ప్రాణముల్గొనగ కొండొకమార్గములేదె శ్రీహరీ 66

ఉ. ఒక్కడొకండు నీతినియమోచితవృత్తులు మత్ప్రజాళిపై
మక్కువడింది నేమియవమానయచేసిరి నీకు వారు ము
న్నెక్కడలేని యీవిలయ మిట్లగబోసితి నిష్క్రియార్తులై
స్రుక్కగ వారినైన దయజూడగదే జగదేకరక్షకా. 67

ఉ. కొండలకొండ నాపొదిలెకొండ భుజాపరిణద్ధ సీమపై
కొండలరాయడైననిను కోర్కులు క్రేళ్ళుఱుకంగనిల్పి భూ
మండలి నేయెడన్కనని మంగళముల్పచరింప నారెపూ
దండలువెట్టి యమ్మకు ముదంబొనగూర్పగ నుత్సహించితిన్. 68

మ. అవునా శ్రీమదహోబలాద్రియదినీ కాశ్రీవనమ్మమ్మకున్
తవులైయంటుకొనంగ నేబిలిచినంతన్వత్తునో చక్రవ
ర్తివి రావో యను శంక నాహృదయమందే కోరికన్మీదుగ
ట్టి విచారింపగ నేటికిట్లుకడముట్టె న్నా యదృష్టమ్మి లన్. 69

శా. నేనైపిల్వఁగలేదటంచు నభిమానిత్వమ్మటే యెవ్వఁడా
హ్వానించెన్నిను బొట్టుపెట్టి గరుడాహార్యమ్ము మట్టాడగా
నానాగోత్రవిహారతత్పరుడవై నా గోత్రమే కానిదా
శ్రీనిత్యస్థితవక్ష నీ హృదయ మిస్సీ వజ్రకాఠిన్యమై. 70

శా. రా నాకొండకు వేగ నిప్పు డయినన్ రానిచ్చలేదేని యం
దే నీకొండనె యుట్టిగట్టుకొని యూరేగుల్లముబ్బంగ నె
ట్లైనన్ పోయినదేమి త్వత్పదజలప్రాప్తిచ్యుతుండైన నా
కీనాజీవములెట్లు నిన్వెదకులే యేకొండమీదేనిమున్. 71

తరువోజ.

అని యెల్లురాల్పడ నద్ధారరమణు
 డతికఠినోపవాసాయాసమూర్తి
వినిపింప పతిపాదవిమలసత్తీర్థ
 విరహసంఖేదనిర్వేదాంతరంగు
డనయమ్ము పతిమూర్తి యదరునలేచి
 యడగువేసినట్టులైన నాశ్చర్య
జనితవిభ్రమమున చక్షువుల్మ్రొయు
 జననాథునకు పట్టె చల్లనికూర్కు. 72

శా. లేచెందేవు డహోబలమ్మున ఘనాలీఢాంగకుండై తటి
ద్రోచిర్వల్లరి యమ్మవా రురమునన్ త్రుళ్ళింతలైతూల సా
మీచీన్యాతతవిశ్వరక్షణకళామేయప్రభావాంకమున్
సాచెందక్షిణపాదము న్నృపరిరక్షాతక్షణోద్వేగమున్. 73

ఉ. చాచినయంగ భక్తునివిషాదము మాన్పెడు తత్తఱమ్ముననన్
రేచితవేగధాటినడరెం గుఱికామడమీఱ భక్తి సం
కోచమునొందు నప్పొదిలెకొండను సాంతమతిక్రమించి మిన్
రాచెడు చీమకుర్తి కుధరమ్ముపయింబడ స్వామిపాదమున్. 74

కం. బలమగు పదపాతమ్మున
గులగులనై యంతలావుకొండయు బాధా
కులమై నిలువంజాలక
చలిజ్వరము సోకినవ్వ చాడ్పున వడకెన్.

ఉ. ఈ యొక కాలితాకునకె యిట్లవతారము మాఱిపోవ ని
స్సీ యిదియేమికొండయని శ్రీపతి వేసినకాలువెన్కకున్
క్రోయగ పోయి యప్పొదిలెకొండ వినమ్ర శిరఃప్రసారిత
చ్ఛాయల నందమొల్కునొకచట్టుపయింబడె స్వామిపాదమున్. 76

కం. బలమగు పదపాతమ్మున
తలకొంచెముచిట్లె కొండ తలకక భక్త్యు
జ్జ్వలత న్విష్ణువహనని
శ్చలాంగుడౌ గరుడివలె స్థైర్యముజూపెన్. 77

ఉ. ఈయతిలోకపాదహతి కించుకనైనను సంచలించ దా
హా యిదియేమికొండ యని యాద్యుడు రెండవకాలుకూడ హ
ర్షాయతిఁగూడదీసికొని యమ్మరియొసంగగ నిత్యచర్వణా
ప్యాస్యయిత కప్పురంపువిడె మచ్చటతృప్తిగ నుమ్మి క్రమ్మనన్. 78

తే.గీ. కదలె నొకకొంత పడమరగా నృసింహు
డచట నొకవృక్షరాజంపుటలరుగొమ్మ
హంసువనమాల రక్తితో నందుకొనియె
భక్త సంబున కొక యూనవాలుగాగ. 79

స. మధురాకారము దీనిజూచితివటే మత్ప్రేయసీ నాటి నీ
యధికౌత్సుక్యపు ధాతకీకుసుమరమ్యానోకహ మ్మిమ్మహా
మధుసామ్రాజ్యము నేలుకొమ్మికను భామా సిద్ధసంకల్పవై
క్షుధితుండైపడియున్నభక్తు డికరాజున్ సిద్ధసంకల్పుడే. 80

తే.గీ. అని పరమరమ్యమైన యయ్యారెమాని
నీడ వెలసెనహోబలనేత పొదిలె
కొండలక్ష్మీనృసింహుడై నిండుకరుణ
భక్తరక్షణకై లోకపావనుండు. 81

కం. మొనసి కవాతదియు కడ
చన బారులు తీరిపోవు సైనికుల వలెన్
పనితీఱినంత తీరుగ
వినువీథిన్వీడిపోయె పృథుమేఘమ్ముల్. 82

కం. కడగంట కొట్టినంతనె
విడివడి గడబిడగలేచి విచ్చలవిడిఁబ
ర్విడు బడిబుడుతుల వడువున
పడుచున్ లేచుచును పోయె పసిమొయిలుగముల్. 83

సీ. వర్షసంకటమువో ప్రజపొందు నమలిన
హర్షమ్ము గతి తెల్లనయ్యె దిక్కు
లమ్మకైసేసిన యారెపూవుల శోభ
ననుకరించుచు శోణమయ్యె తూరు
పయ్యె సింగపుగంతులన్నట్లు పైపైకి
నడరె ననూరురథ్యముల కాళ్లు
సంబురాయని భక్తిసాఫల్యమనురీతి
బాలభాస్కరుడు బింబమ్ముకట్టె

నాదినారాయణీయ మహామహస్సు
శ్రీ పొదిలెకొండ లక్ష్మీనృసింహు రక్తి
నలముకొనవచ్చె సూర్యమండలమనంగ
పొదిలెకొండపై క్రమ్మఱ బ్రొద్దుపొడిచె. 84

కం. ఇదియంతయు స్వప్నమ్మున
నిదురించెడు సంబురాయనికి తోచిన న
భ్యుదిత మహోత్సాహసమా
స్పదచిత్తప్రమితి విష్ణుపద మందుకొనన్. 85

శా. లేచెన్సంబు డహోబలేశ్వరదయాలీలావియద్వాహినీ
వీచీశీతలశీకర స్తమితనిర్వేదుండు భక్తప్రతీ
క్షాచిన్మంగళ రూపతక్షణదిదృక్షాస్ఫీతజంఘాలమున్
సాచెన్ దక్షిణపాదము న్నతశిరస్సామంతరాజన్యమున్. 86

తే.గీ. పిలువడెవ్వని నెవనితోపలుక డేమి
చెప్పడెవనికి రమ్మనిచీరడెవని
మఱ్ఱిపూడిమార్గమ్మున మనుజవిభుడు
పొదిలెకొండకై వేవేగ పోవుచుండె. 87

ఉ. లేచెను వృద్ధకంచుకి విలీనవిచారుడు పెద్దమంత్రియున్
లేచెను రాణివాసమునులేచె కుమారతెలుంగురాయలున్
లేచె దివాణమంతయునులేచె హఠాద్గమనాభిలాషియై
లేచినలేడియైన లవలీచలితాంగుడు రాజువెంబడిన్. 88

మత్తకోకిల.
కన్నబిడ్డలరీతి మమ్ములగారవమ్మున చూచి మా
యన్నికోర్కులుతీర్చు భూరిదయాసముద్రుడు సంబు భూ
భృన్నిరంజనమూర్తి నేడిటు లేమిచిత్రమొ యున్నవా
డున్నయట్టులులేచి యెక్కడికోచనున్ పదచారియై. 89

ఆ.వె. అనుచు పొదిలెసీమజనులు నవిస్మయ
వదనులును విషాదహృదయు లగుచు
భూపవరునియందు పొలివోని విశ్వాస
ధనులు రాజువెంట తగులుకొనిరి. 90

సీ. ఏమయ్యా శ్రీమన్మహామండలేశ్వరా
పొదిలెరాజ్యేందిరాహృదయనాథ
సాదరదృగ్జాల మేదినీమీసర
గండ సజ్జనరక్షకా కటారి
సాళువా యోబళేశ్వరనిర్మలినభక్తి
నిభృతభావా ధరణివరాహ
అరదముల్పన్నింతు నందలాత్తెప్పింతు
గొడుగులుపట్టింతు కొదువలేక

చామరమ్ములువేయింతు నేమి సెలవ
టంచు చెంతకువచ్చి యర్థించు పెద్ద
మంత్రి వదనమ్ముపై ప్రేమమయ విలోక
నావళి నిగిడ్చి నడచుచునే విభుండు. 91

చం. ఎఱుగుదునిన్ను నాహృదయమే మఱి సాక్షిగ నింతకాల మి
య్యెఱువది నిండినట్టి పసియాతని రక్షణభారమందె నీ
శిరసది పండెబో సచివశేఖర డంబములైన వీనితో
నరయగ నిప్పుడేమిపని యవ్వయిపాలికి పోవువానికిన్. 92

ఆ.వె. ముసురుపట్టి నీటిముంపున ప్రజకుంద
నయ్యెనేమొయంటి నా ర్తిమీఱ
నన్ను నుద్ధరింప పన్నిన కరుణామ్ను
తంపు నిట్టయంచు తలపనైతి. 93

కం. ఆ కొండనుండి నాకొఱ
కై కరుణామూర్తి యొక్కయంగగ రభసో
ద్రేకుడు విచ్చేసెనటే
యాకొండకు నేమి నాయదృష్టము సుమతీ. 94

తరువోజ.
అనియాననమ్మున నతిలోకకాంతి
యలలూగజెప్పిన నతులితానంద
వినివేశుడామంత్రి విమలవిచార
విశ్రుతుం డావార్త వినిచె నెల్లరకు
తనతనపుణ్యమే తగపండినట్లు
తలపోసి యద్భుతాత్సాహసంభృతులు
జనులెల్లచెలరేగి జననాయకునకు
జయజయల్వెట్టిరి జనరంజకునకు. 95

చం. ఆత డుపవాసశీర్ణ బహిరంగబలుండు నృసింహభక్తిసం
భృతనిభృతాంతరంగనిబిరీసమహాబలు డేగుచుండె నొ
క్కతమిని రివ్వురివ్వుమని కాళులు నిక్కులరెక్కలై కృపా
మృతధుని యచ్యుతుం డవతరించిన శైలమునంద దృష్టియై. 96

ఆ.వె. మెట్లులేనికొండ నెట్లెక్కు వృద్ధరా
జనుచు మంత్రి తలచునంతలోన
వచ్చిపడిరి పదులు వందలు వేలుగా
పండినట్టివారు కొండపనుల. 97

ద్విపద. చెట్టుచేమలు పొదల్ చిట్టికంపలును
కొట్టి వీల్చేసిరి గొడ్డళ్ళవారు
పాతఱలైయున్న బండలనెల్ల
పాతగల్చిరి గడ్డపాఱలవారు
వాటమ్ముగా నంత వసుధమట్టించి
బాటదీర్చిరి చెల్గపాఱల వారు
భద్రపర్చిరి రాతిపలక లెల్లెడల
నద్రిపాదము జేరునంతలో రాజు. 98

కం. అడుగెత్తి వేయులోపల
నడుగునమెట్టుపడి యిట్టు లడుగడుగునకున్
వడు మెట్టుమెట్టుగా న
ప్పుడమీశుడు కొండపైకిపోయి యెదురుగాన్. 99

సీ. ఉదయసూర్యుని లేతపదములు తారాడ
నభినవకాంతిరమ్యమగు నెత్త
మున నవ్యయుని పాదముద్రల నుల్లోక
చారువై మెఱయు నాచట్టుజూచి
కన్నులపండువుగా భక్తిపారవ
శ్యమున ముత్పులకాంగుడగుచు సంబు
డిచటనే ముందుగానిచటనే నాదేవు
డతివేగపాదుడై యవతరించె

సృష్టియున్నంతకాలమ్ము చెరిగిపోని
స్వామిపాదముద్రల నిట్టు సంతరించు
కొన్ననాకొండగుండె యీచిన్నిచట్టు
పుణ్యమెంతని యబ్బురమ్మున మునింగి. 100

తే.గీ. స్వామిపాదమ్ముపడిన తక్షణము నంద
సంభవించె కపాలమోక్షమ్ము నీకు
నన్న యనితరసాధ్యపుణ్యస్వరూప
యెంతసుకృతివినీవు భూభృద్వరేణ్య 101

తే.గీ. ఇంతకాలమ్మయిన నాదుహృదిని పడవు
లీలగానైన స్వామి పాదాలముద్ర
లలకనగ విచ్చిపోవ నీయడ్డమున్న
పంచభూతాత్మకమ్మైన పంజరమ్ము. 102

మ. అని భూభృన్మణి వేదనానిశితభక్త్యావేశితస్వాంతు డా
ఘనశైలస్థలముద్రిత ప్రభుపదాంకశ్రీప్రబంధమ్ము నొ
య్యన ముమ్మాఱులుచుట్టి కన్నులొరయన్ సాష్టాంగదండప్రణా
మనిలీనుండయి లేచిపోవ నెదుటన్మందారరాగమ్మునన్. 103

తే.గీ. మిహిరకిరణావృతమ్మయి మెఱయు నవ్య
యాత్ము డుమిసిన కపురవీడ్యంపు కఱయు
నయనగోచరమై సుధానందభావ
లహరి హృదయమ్ములో తహతహలురేప. 104

తే.గీ. అదిర మంగళదేవతా మృదుకరోప
నీత కర్పూరతాంబూల నిత్యభోగి
పొదిలె కవటాకులదె పొమ్ము పుణ్యమింత
కయ్యె నీనోరు దొండపండై సతమ్ము. 105

ఉ. ఈకపురంపుతావులు మహేశ్వరతామహనీయతా సము
ల్లోకములొాచు నాయెడదలోతులు చూఱకొనున్ దయానిధీ
నా కొఱవడ్డప్రాణములు నాచికొనంగ త్వదీయమూత్నర
మ్యాకృతిఁ గన్నులార కనునంతకు నన్ను ననుగ్రహింపవే 106

కం. అని శక్తివిహీనుడు రా
జును నొకయేకువలె తూలుచున్ చని యెదుటన్
ఘనధాతకీవిటపి శా
ఖను్రేల్వనమాల గాంచి గద్గదగళుడై. 107

తే.గీ. నీ సుగంధప్రసాధన నియతకర్మ
మేను రహిమీఱగోరి లక్ష్మివిధేయు
డిచట నీనీడ వెలసెనా యెంతపుణ్య
ధనుడవైతివి ధాతకీతరువతంస. 108

కం. అని తత్తరు ప్రశంసన
మున సమ్మద బాష్పపూరముగ్ధాక్షుండ
వ్వనమాల గొని వెలుగు శో
భన శాఖాసుకృతమెంచి భావము కరగన్. 109

తే.గీ. అలరుల మిటారి వలపుల నమ్మవారి
తలకు పట్టించి యయవారి గళమునంటి
కులుకువనమాలఁ దగిలించుకొంటి వారె
కొమ్మ యెంతటి నెరజాణవమ్మ నీవు. 110

కం. అని నంతనె తీఱినదని
పని వనమాలయును కొమ్మ పట్టువదలి గా
లిని తేలిపోయి ప్రభుగళ
మున నెప్పటి భూషణ ప్రమోదత నతికెన్. 111

మ. పతియు బ్బున దానియట్లచని శ్రీ ప్రాణేశమూర్తి ప్రభా
మృతమున్ కన్నుల జుర్తి భక్తి వివశుం డీశాంఘ్రి పద్మమ్ములం
దతికెన్ చేతనతా వికీర్ణుడయి హాహాకారులుంగా జనుల్-
శ్రుతి మూర్ధన్యుని మోమనుగ్రహమహాశోభా చమత్కారమై. 112

తరల. ప్రభుని చల్లనిచేయి కాయముఁ బట్టి నిల్పిన యట్టులై
ప్రభుని చల్లనిచూపు గుండెనుపట్టి రాచిన యట్టులై
ప్రభుని వెచ్చనిశ్వాస నూపిరిపట్టు రెక్కొని నట్టులై
ఋభువిభుప్రతిముండు లేచె నరేంద్రు డెప్పటి యట్టులై. 113

సీ. వృద్ధకంచుకియును పెద్దమంత్రియును ము
త్పులకాంకురమ్ముల పొలములైరి
గళసూత్రకలితమాంగల్యముల్ దేవేరు
లతిగుప్తిఁ గన్నుల కద్దుకొనిరి

తండ్రి చాటుదనమ్ము దక్కెనంచు కుమార
   తెల్గురాయండు సంతృప్తి విరిసె
నల దివాణమ్ముకా రందఱు తమతమ
   భాగధేయమ్ములు పండెననిరి.

కొండ కొండయును బోరుకొనగ పేర్చి
జయజయ ధ్వానము లొనర్చి జనసమూహ
మర్చకుండిచ్చు స్వామి పాదామృతమ్ము
నాని సంబురాయండు కృతార్థుడయ్యె. 114

సంబురాయల వంశస్థులు

కం. ఏవంవిధ ఘనపుణ్య
ప్రావృతమతి పెద్దసంబురాయల జననం
భావిత వంశమ్మున ధర
జీవరులెల్ల పురుషార్థనిష్ఠితబుద్ధుల్. 115

తే.గీ. గజపతుల బంధులట వారు భుజబలప్ర
భూతగతులు కర్ణాటాంధ్రభూమిపతులు
మాఱుతోరణపడకుండ మహితయశులు
సీమచేసి రిన్నూఱేండ్లు సోమకులులు. 116

ఉ. అంచితశోభ రాచనగరై చన నూరికి దక్షిణాశ భా
సించినకోట తూర్పుదెస నిస్తుల కస్తురికేళకూళిలో
సంచులు నంబు లైణమదసారము పేరిన వారికేళి సా
ధించు నపూర్వగంధమయదేహులు వారల భోగమేమనన్. 117

కవిరాజవిరాజితము.

పొదిలె సివారులనెల్లెడ కెంపులపూలరథమ్ముల మొత్తములై
పొదలెడు తంగెడలట్లు విలాసవపుర్వలనమ్ముల లోచనముల్
చెదరిన రాజులగుండియల న్మరుచిచ్చులు రాణులు మేల మృగీ
మదమయనీరము ధూమ నిభమ్ముగ మజ్జనకేళిని కేళకుళిన్. 118

శా. చేసెన్ కొండనెవండు భక్తినృహరిశ్రీధామ దివ్యమ్ముగా
నా సంబుప్రభుపుత్రుడౌ తెలుగురాయం డేమి శృంగార వి
ద్యాసర్వంకషమూర్తి తద్వితరణ వ్యాసంగసారంగనా
భీసమ్మోహన సౌరభమ్ములవి చుంబించుఁదిశాగల్లముల్. 119

తే.గీ. చలువ మడతల నైపథ్యచతురు గూర్చి
పొదిలెసీమవాసులనోళ్ళ పూచినట్టి
'తెల్లతల్లగ నున్నాడు తెల్గురాయ'
డనెడు సామెత కాకరమాఘునుండె. 120

శా. 'అక్షయ్యమ్ముగ సంబురాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షాదానముసేయరా సుకవిరాడ్బృందారకశ్రేణి' కం
చక్షీణప్రతిభా సమగ్రకవితాధ్యక్షుండు శ్రీనాథ భ
ట్టక్షోణీధవువేడె నా రసికలోకేశుండు సామాన్యుడే. 121

ఆ.వె. ఆతనికేమికొ౦అత యచట కస్తురి వీణె
యలు విదుల్చుమృగము లయుతసంఖ్య
లంత యవసరమున కతగాడులేడొ తి
ప్పయ్య యవచికుల మృగాంకమూర్తి. 122

ఉ. ఎత్తిన చేతిఁద్రేళ్ళకొన లింతులకు న్నెలవంకసొమ్ము లై
హత్తెడుపట్ల నెంతకుసుమాయుధ కేళియొ రాజశేఖరుం
డెత్తిన వింటి వంపు లసుహృత్తుల కోర్వగరాని యమ్ము లై
హత్తెడు పట్ల నంత దహనాంబకకాలకరాళ కేళియున్. 123

శా. సామంతుండయి ప్రౌఢరాయలకు తత్సామ్రాజ్య విద్వేడ్వనీ
హేమంతుండయి శత్రురా ట్కులసతీ హేలాస్తసిందూరరు
క్సీమంతుండయి భూరిదిగ్విజయ శక్తిస్ఫారసమ్యగ్యశ
శ్శ్రీమంతుండయి సార్వభౌము నలరించెన్ తెల్గురాయం డొగిన్. 124

కం. ఆయవనీపతి సుకృతవ
నీ యోగ్యఫలమ్ము లై జనించిరి పుత్రుల్
శ్రీయుతుడు గుండభూపుడు
రాయవిభాళుండనన్ విరాజచ్ఛౌర్యుల్. 125

శా. అంకాపొంకములెత్తి భీషణరణవ్యాపారబాహోధను
ష్టంకారమ్ములు ఘీంకృతుల్ నెఱప కాష్ఠాసంధులందెల్ల సా
హంకా రోగ్రమదద్విపేంద్రయుగళమ్మాయిర్వురు వైరిసే
నాంకోలమ్ములు పెల్లగించెదరు తోడైపోరులన్ తంద్రికిన్. 126

కం. పిండిన కీర్తిక్షీరపు
గుండిగదొంతరలనిడె కకుప్పాల తలలన్
గుండనృపతి గోవిందుడు
గుండసముద్రాగ్రహార గురువితరణిరైయె. 127

కం. ఆయన కూరిమితమ్ముడు
రాయవిభళావనీధురావహుడు స్వవం
శాయతకీర్తికి కలికి తు
రాయి యయిన చిన్న సంబురాయల గాంచెన్. 128

ఉ. ఆత డహోబలేశ్వరు నిజాంతికభూమికి తార్పగన్న వి
ఖ్యాతుడు తాతతండ్రి మఱియాతని నామము దాల్పగన్న వా
డీతడు సంతతార్చితమహేశుడు పేరును పెంపుగాంచె ము
త్తాతవిధాన తానునొకదైవత నూతన సంప్రతిష్ఠచేన్. 129

ఉ. శశ్వదుదాత్తభక్తి చినసంబుడు సంభృతధర్మపాలనా
నశ్వరరక్తి పుణ్యవరణమ్ముగ నాయనకాంధ్రకొండపై
విశ్వజనీనుడై సకలవిశ్వమనోంతరవర్తి రామలిం
గేశ్వర దివ్యవర్తి వెలయించె నిరంజనకాంతిపుంజమున్. 130

ఉ. ఒప్పాలకుప్ప సంబుని సహోదరి సూర్యకులప్రదీపమై
యొప్పినవాని పెండ్లియయి యుర్విపతిన్ జగతాలసింహునిన్
తిప్పలిదేవి యీవివిరితీవ కులత్రయ పావనమ్ముగా
తిప్పలిదేవి పల్లెను విధించె శిలాక్షరకీర్తిబంధమున్. 131

శా. పొంకంపుంగనులొచు నాత్మవిభులన్ పొంగింపరో భాగ్యని
శ్శంకాంకూరలు కారొ రాణులు ప్రజాసంక్షేమ మిట్లెంచిరే
అంకేపల్లిసమీపమందున తటాకాంచత్ప్రతిష్ఠా రసా
లంకారమ్ము ఘటించె తిప్పలి రసాలంకారసంకేతమున్. 132

## నేలయదరు

ఉ. నారలుదారధర్మపరివాసితులందఱు నందు భక్తివి
స్మేరహృటంబుజుల్ పొదిలెసీమఁ బునీతముచేసి రిద్ధఱున్
కారణజమ్ము లేరికతన న్నృహరీశ్వర దివ్యతేజముల్
కోరకితమ్ము లాపొదిలెకొండపయిన్ తగ నాంధ్రకొండపై. 133

తే.గీ. హృదయమే పెద్దకోవెలై యొసగు నృహరి
కంచునో భక్తవరుడు నిర్మించె గర్భ
గుడియు కోనేరు మాత్రమ్ము కొండమీద
పెద్దసంబుడాడంబరవిరహితుండు. 134

శా. ఆకొండన్కల సాటిలేని చఱులన్ హర్యక్షచర్యాసము
త్సేకమ్ముప్పగ నిచ్చవచ్చినగతిన్ చెర్లాడగా మండప
ప్రాకారమ్ముల యడ్డులేని గతియే బాగాయె నంచెంచెనో
శ్రీకాంతాపతి భక్తునుల్లమును ప్రేరేపించ డవ్వానికై. 135

మ. పయిబండాలములేక స్వామి కిటుపోవన్ పెద్దకాలమ్ము త
జ్జయనామాంకితవర్ష భాద్రపదమాసప్రాప్త శీతాంశువా
రయుతాభీలమహానిశన్ ప్రళయగర్జాతర్జనాత్యద్భుత
క్రియ మున్నెన్నడులేని నేలయదరుర్కొం దద్దరిల్లం దిశల్. 136

శా. ఆ విధ్వంసక భూమి కంపమున కుద్యద్వాతసంధూతవ
ల్లీవేశ్మమ్ముల లీల తూలి గగనాలింగ న్మరుద్గోపుర
శ్రీవైయాత్యనిధానముల్ ఘనశిలాశిల్పాంగ కమ్మల్మహా
దేవాగారములెల్ల సొల్పడియె ధాత్రీ కంఠహారమ్ములై. 137

తే.గీ. నియతి మల్లచమూపతి నిలుప వెలయు
నల చదలువాడ రఘునాయకుల నివేశ
మంతటి మహాలయమ్ము మహాలయమ్ము
నందె నందున్న సకలజనాళి తోడ. 138

ఆ.వె. అదియు నెంత పెద్దయదరో చదల్వాడ
యుత్తరమున నడచుచుండు గుండ్ల
కమ్మ దిమ్మదిరిగి గతి తారుమారయి
నాటగోలె దక్షిణమున నడచు. 139

మ. జయవర్షమ్మిటు సర్వదేవనిలయాశ్చర్య వ్యవచ్ఛేదనా
త్యయమై యర్చకులాదిగా జనులు సంత్రాసార్ద్రతాత్యంతని
ష్క్రియతాకుంఠితచిత్తవృత్తులయి కస్తింగూర నిత్యార్చనా
ద్వయహీనుండయి కొండమీది నరసింహస్వామి గాసింబడెన్. 140

ఆ.వె. అపుడు పస్తులుంచె నట్టు లారాజేంద్రు
నిపుడు తానె పస్తు లిట్టు లుండు
నెట్టి ఘటకు డయ్యె యీ నరసింగయ్యె
యంచు విస్తుపోయి రఖిల జనులు. 141

ఉ. అంతట మన్మథాబ్దమున నాగిరిపై నరసింహమూర్తికిన్
పంతమునై ప్రతాపహనుమంతుడు పూని యొనర్చె నర్చనల్
సంతతమంత్రపాఠ పరిసర్పితసర్వదిగంతరమ్ముగా
నెంతయు రక్తి నొక్క పదునేనుదినమ్ములు నిర్విరామునై. 142

మ. సకలానందద మట్లు మంత్రపఠనాశ్చర్యమ్ము నాదైక ది
వ్యకళాకేళిగ సాగి మూగతనమున్ పాలించె నున్నట్టులుం
డి కథానాయకుడైన దేవుడును తన్నిర్వ్యాజ సంప్రాపితా
ర్చకుడుం గంతులమారి పంతముల తిర్యక్స్వామి లేమెంచిరో. 143

కం. అగచరుడు బంటు స్వామియు
నగౌకనుం డొక్కచోట నంటసిలుట లే
కగచాట్లమారికొలువై
యగపడడేమో ప్రతాప హనుమంతుండున్. 144

కం. అది నృహరిపునఃపూజా
భ్యుదయమ్మునుగోరి కపివిభుం డందులకై
పొదిలెజనుల గొలుపు తలం
పెదనూపగ నెత్తినట్టి యెత్తుగునేమో. 145

కర్లపూడి వెంగన కట్టడ

తే.గీ నాటనుండియు పొదిలెలోనగల కమ్మ
వారిలో నొక్క డన్నమ్ము వర్జితముగ
పాలు మాత్రమ్ము త్రావుచు పట్టెదీక్ష
నృహరిపూజలు పునరుద్ధరించు నిష్ఠ. 146

చం. అనయము కొండమీది పరమాత్ముని పాదసరోజము ల్మన
మ్ముమ్మన విరియించుకొన్న భవమోచితు డాతడు కర్లపూడి వెం
గన యను భక్తశేఖరు డకల్మషచిత్తుడు సర్వలోక పా
వనునకు కొండపై నవనివాససుఖమ్మొనగూర్ప నెంచగన్. 147

ఉ.. అన్నము నీరు మాని జగదర్చితు కొండకుతార్చె సంబురా
జన్నము మాని వెంగనమహాకులు డవ్యయు జీర్ణమందిర
ప్రోన్నమనమ్మొనర్చుటకు పూనెనటే యికనేమినేడు మా
పున్నెములెల్ల పండెనని పొంగిరి హర్షసముద్రులై జనుల్. 148

శా. ఆ కీర్త్యుజ్జ్వలు భక్తి సంభరితచిత్తాభోగమేపాటిదో
లోకుల్ వేయివిధాల తోడుపడగా లోకేశ్వరావాస ర
మ్యాకల్పమ్ము వెలింగె శుద్ధజలకూపావాప్తితో మండప
ప్రాకారమ్ములతోడ గోపురముతో ప్రత్యక్షవైకుంఠమై. 149

మ. మరుదారాధితపాదు నాలయవినిర్మాణమ్ము సర్వాంగసు
స్థిరతాపాది శిలాసమన్వయకళోదీర్ణమ్ముగా పూర్తియై
తిరుకల్యాణ మహోత్సవమ్ములు ప్రవర్తిల్లెన్ వికార్యబ్దమం
దరుదౌ వైభవదీప్తి షోడశవికారాతీతుడౌ స్వామికిన్. 150

తే.గీ. శ్రీమదష్టాక్షరీమంత్ర సిద్ధిపరుడు
చక్రవర్తులవారి కాచార్యవరుడు
బోధమహితుండు మారకాపురపు సోమ
యాజి సర్వాగమవిధిప్రయోజకుండు. 151

తే.గీ. పూజలేక చిక్కినస్వామి పుంజుకొనగ
నాగమజ్ఞుడు దీక్షించి యధికనిష్ఠ
నడపె సంప్రోక్షణమ్ము ప్రాణప్రతిష్ఠ
మఱి కళావాహనమ్మున సమర్థఫణితి 152

తే.గీ. శ్రీ మహాలక్ష్మి తేజఃప్రసిద్ధినలరి
నవవధూ దివ్యలావణ్య మవధరించె
శ్రీనృసింహుడు తేజఃప్రసిద్ధి నలరి
నవవరాంచితవేషసుందరత మించె. 153

సీ. అటు సంబురాయల కడుగుల మడుగులై
పొడవు కట్టిన మట్టిపూడిమెట్లు
నెట్టులేర్పడినవో యిటు పర్వతాల బా
వి సమీపమున పైకి వెడలు మెట్లు
మెట్లుమెట్లన్ని లక్ష్మీనారసింహ క
ల్యాణవీక్షణకుతూహలత కొట్టి
కోలాహలమ్ముగా కోల్కొను జనపాళి
పదధూళి చైతన్యవంతములుగ

నడవి మెకములు భీతిమై నడగ గుహల
క్రిక్కిఱిసి మూగు యాత్రికుల్ పిక్కటిల్లి
నగము నగమెల్ల శృంగారనగరమయ్యె
నయ్యె తిరునాళ్ళ సాగిన యన్నినాళ్ళ. 154

తే.గీ. పాంచరాత్రాగమాచారఘక్కి పూజ
స్వామికి నిరంతరాయమై సాగ గొట్టి
పాళ్ళ మాధవయ్య యనెడు ప్రథితు పొదిలె
నంబిఁ గట్టడచేసె వెంగనఘనుండు. 155

మట్టిపూడి సంజీవిపిర్యాదు, పొదిలె పెద్దల తీర్పు

కం. ఎది పొదిలెకొండ నరసిం
హదేవు నిత్యార్చనమునకైన నియామక
మ్మది మట్టిపూడి గోపా
లదేవు పూజారికి హృచ్ఛలాకానిభమై. 156

కం. కదలి చనుదెంచి పోయిన
దెదియో వెదకికొను భాగ్యహీనుని కరణిన్
పొదిలె నలుగడల నాతం
డదేపనిగ తిరుగులాడు నసహాయుండై. 157

మ. కలితేశాన్యదిశా ప్రశాంత ధవళాకారమ్ము నిమ్మయ్య దే
వళపున్ దిడ్డిమొగన్ వగన్ రగులుచున్నా డంతలో పశ్చిమ
స్థలినొప్పున్ పొదిలెమ్మ దేవళము చెంతన్ చింతలన్వాడు తిం
దిలిపోటన్ పెదచెర్వుకట్ట నడినెత్తిన్ హత్తివా డంతలోన్. 158

ఆ.వె. పొదిలెకొండ మీద కుదిరిన దృష్టి నీ
డ్వడదు సుంత కుదురుపడదు కాలు
కూరుచుండు లేచు వారక వీథులు
వలనుచుట్టు పిచ్చివాని పగిది. 159

సీ. అనుపదమ్ముగ వేయు నడుగుల కనయమ్ము
వేల్లితమ్మగు చిన్నిపిల్లకవాడు
ఊర్ధ్వపుండ్రపు తెల్పు లొరసి కెంపులు గండ
రించు శ్రీచూర్ణంపు రేఖవాడు
పంకించు శిరముతో వంతులన్నట్టు లూ
గాడు బంగారు తమ్మంట్లవాడు
ఉరము వీపును నంటియుండక మాటికి
తెరలెత్తు నిడుద జందియమువాడు

పరమ వైఖానసుడు భరద్వాజ గోత్ర
విదితుడు పరాశరుని యింటిపేరివాడు
సామవంతుడు సంజీని నామధేయు
డొక మహాకార్యసాధ నోద్యుక్తు డతడు. 160

కం. తనవచ్చిన పనియేమో
మనసుతెఱచి చెప్ప డడుగు మానిసులకు నా
ర్చను తీర్చ నూరిపెద్దల
పనియై యొరుల కది కొఱుకుపడు నయ్యా యనున్. 161

ఆ.వె. అతని వాలకమ్ము నతని మాటల తీరు
విస్తుపోయి చూచు విను జనమ్ము
నూవునాననట్టినోళ్ళ రంగులుమాఱి
వెడలు వార్తలెల్ల వినుచు తలరి. 162

తే.గీ. పొదిలెకును మట్టిపూడికి పొరపు లేమి
యేమి తలపెట్టె సంజీవి యిపుడు దీని
నరయవలె నంచు రచ్చదీర్చిరి విచార
దక్షులందఱు పొదిలె పెద్దతల లపుడు. 163

సీ. అతడు బత్తులవంశ్యు డయ్యపరెడ్డి క
స్వాకాపులందెల్ల ప్రథమగణ్యు
డా కర్లపూడి కులాబ్ధి తెల్లని కత్తి
లాని మల్లపగుండనేని యాత
డందుగాముల వంశమందారమాత డ
క్షక్కయ్య నిత్యరుద్రాక్షమాలి
మఱియున్నవారెల్ల బిరుదుటెక్కములు స
ద్ధర్మపాలన సంవిధానచణత

బుఱ్ఱమీసాల మగసిరుల్ పుట్టినిళ్ళు
బుట్ట తలపాగల కుదుళ్ళు మెట్టినిళ్ళు
నెట్టుకొని వచ్చి కూర్చుండి రెట్టయెదుట
పొదిలె పొదిలె యంతయువచ్చి పోగువడగ. 164

సీ. ఆయనయవర్ణి పెమ్మయసింగధీమణి
వంశచిత్రపటంపు వన్నెబొమ్మ
లాశ్రయించినవారి కల్లొనేరెడుపండ్లు
కసిగొన్నవారికి ముసిడిపండ్లు
కడితంపు కర్ణాటకపు పీటముళ్ళిట్టి
గంటంపుమొన విప్పగల సమర్థు
లూరి నానా వ్యవహారమ్ము లీదెడు
కాపుపెద్దలకు చుక్కాని తెడ్లు

కదలి వచ్చిరి కరణముల్ పొదిలెవాసు
లైన శివరాజు పొట్టి అయ్యప్పరాజు
ననఘు డెల్లమరాజు వెంకన మనీషి
కోవిదుండు పోలంరాజు గురవరాజు. 165

ఉ. పయ్యరలింకిపో సెగలవాగుల పొంగులు విశ్వరూపమౌ
దయ్యపు పశ్చిమానిలము తాకున వీనులు చూడు వారికిన్
తియ్యని పల్కు వెన్నెలల తేటలు చల్వల విందు సేయగా
నయ్యపరెడ్డి యర్చకున కాదృతి స్వాగతమిచ్చె నీ గతిన్. 166

కం. రావే పరాశరుని సం
జీవీ విఖనస మహర్షి శ్రీవాగ్రసపున్
క్రోవీ యీ సభముందఱ
నీ వాదము విప్పవే గణింపుల దీవీ. 167

శా. అయ్యౌదార్యమతి ప్రయుక్త చతురవ్యాహార నిష్యందముల్
ముయ్యేఱై ప్రవహించి కర్ణకుహరమ్ముల్ నింప నీస్వాగత
మ్మయ్యారే పరమాద్భుతమ్మని జనమ్మంకించె నాలోచనల్
క్రయ్యల్గట్టు మనమ్ము లోపొరల రేఖామాత్రసంకోచమై. 168

ఆ.వె. అర్చకుండు లేచి యయ్యలారా వాద
మునకు రాను భేదమునకు రాను
మట్టిపూడి తరపుమాట యొక్కటి చెప్ప
వచ్చినాడ నొంటివాడ నిచట. 169

మ. అనినన్ సంతత నిర్మమేశ్వర నిధిధ్యానమ్మునన్ సర్వవా
సనలున్ పండిన యింద్రియంపుపొల మక్షక్కయ్య విప్పారు లో
చనగోళమ్ముల సంభ్రమమ్ము తిలకించన్ కంఠమాలా కన
ద్ఘన రుద్రాక్షలు త్రుళ్ళియాడ పలికెన్ తానిట్లు సంజీవితోన్. 170

తే.గీ. అయ్య అయ్య సంజీవయ్య అంతమాట
యెందుకయ్య నీ వొంటరివేమి సకల
భువనపాలకు డా మట్టిపూడి ప్రభువు
నేలి పాలించు నోకుంచెకోల ప్రభువ. 171

ఆ.వె. దాని నందుకొని విదగ్ధుండు మల్లప
గుండనేని పొదిలెకొండ ప్రభువు
నిండు గుండెలోన వండిన వెంగన
యింటివాడు వాని కిట్టులనియె. 172

ఆ.వె. పొదిలె మట్టిపూడి పొసగి యొకేసీమ
మనెడు నిరుగు పొరుగు జనపదములు
సీమ సుస్థిరతకు చిచ్చిడ నిట వాద
ములకు నెవరు భేదమునకు నెవరు. 173

తే.గీ. అన్నదమ్ముల మధ్య నేవైన కలత
లెప్పుడైనను రావచ్చు నెందుకైన
నంతమాత్రాన సామమ్ము నతకరించి
భారతరణమ్మునకు పాలుపడుదురయ్య 174

మ. కసుబాకాపుల మేటి యయ్యప ప్రసంగబ్రహ్మ గంభీరమా
నసు డా యిర్వుఱ వాక్యబంధముల చందం బాత్మనగ్గించి య
య్యసమానోక్తిమయ ప్రపంచమున కధ్యాహార కల్పమ్ముగా
నసి నిండారిన మాటపొందు వెలయ న్ సంజీవితో నిట్లనెన్. 175

ఆ.వె. ఒక్కడైన నొకటె యొకవేవురైనను
నొకటె సత్యమొకటె యొండుమాట
మందిమాట సత్యమై చెల్లుమాట ముం
దేమొ యిప్పు డోకిలించుమాట. 176

ఆ.వె. ఎట్టినష్టమైన నెట్టి కష్టమ్మైన
పాడిదప్పు తలపు బరువు మోయు
బలుపు లెవ్వరిందు వైఖానసా సత్య
వంతమైన నాదు వచనమునకు. 177

తే.గీ. రచ్చమండప మీ నిగారంపు దేవ
ళమున వెలుగొందు శ్రీమహాలక్ష్మి సాక్షి
ప్రక్కనుండు సంగడి వీరభద్రమూర్తి
సాక్షి యెవరికి వారి దర్శనమె సాక్షి. 178

ఉ. చీకటి వాకయై వెలపుజిమ్ము సొరంగములోన ప్రాకుచుం
దేకుచు పోవువాని కొక దీపము చిక్కినయట్లు. సంశయ
వ్యాకులుడైన యర్చకున కప్పులుకుల్ స్తిమితమ్ము గూర్ప ని
ర్భీకత నాతడిట్లు వినిపింపదొడగె స్వకీయవాదమున్. 179

సీ. ఓ పురస్కార్యులారా పురాకృత పుణ్య
ములు చేతనించిన మూర్తులార
ఊరిపై ప్రతిలేని పారుపత్తెమున ప్ర
సిద్ధులారా న్యాయబద్ధులార
వినరయ్య సదసద్వివేచనాకలితాంత
రంగులారా ధర్మసంగులార
తనకు ప్రసన్నమౌ దైవతమ్మును కొల్వ
మును సంబుపతి మట్టిపూడి త్రోవ

నేగి మెట్టెక్కి మెట్లు వేయించు కొంచు
నృహరి కట గర్భగుడియు కోనేరు దీర్చి
తీర్చినట్టి కోనేటిపై తిరుగులేని
సేవఁగలదయ్య మట్టిపూడికి మిరాసి. 180

ఆ.వె. అతని నచట పొట్టి అయ్యపరా జడ్డి
ఔర దీనికేమి తారకాణ
కొండమీది స్వామి కొలువు పంచుకొనంగ
నెంతపన్ని తర్చకేంద్ర యనియె. 181

ద్విపద.పుట్టెడు బుద్ధుల పొట్టి అయ్యప్ప
దట్టించి యిటుపల్కె తనకు తాటోటు
కట్టంగ డెందమ్ము కలగుండు పడియు
దిట్టతనమ్ము సంధించి యాస్యమున. 182

కం. ఇది రేయేటిమాట మా జన
పదవృద్ధుల కెల్ల నోటిపాటై కోనే
రది మఱిపూడి పొలము లో
నిదంచు వా రనెడు మాటె నే నంటి నిటన్. 183

తే.గీ. ఈ జనశ్రుతి కా దందురేని చెప్పు
డనిరె సంజీవి-జనవాక్య మభిమతమ్మె
పొదిలెకొండపై మఱిపూడి పొలమదేదొ
కలదనుట నమ్మ శక్యమ్ముగాకగాని. 184

తే.గీ. దీని కేదైన గ్రంథస్థమైన మంచి
దాఖలా యున్న నీదు వాదమ్ము పొసగు
సర్వజనసమ్మతమ్మైన సరణి వనిరె
పొదిలె శివరాజు వాదనైపుణులమోజు. 185

ఆ.వె. కుంచెకోలత్రిప్పుకొను నాకు గ్రంథస్థ
మైన సాక్ష్య మెట్టులమరు నట్టి
దాఖలాకు మీరె తగుదు రయ్యా గంట
మునకు తాళపత్రమునకు దొరలు' 186

తే.గీ. అనియె సంజీవి జనసమూహమ్మునందు
ముందు తిష్టవేసిన యొక్క ముసలి బలిజ
నాయకుడు లేచి నోటిలో నాను తమ్మ
నెగయ నుమిసి కంఠము సవరించు కొంచు. 187

కం. ఈ దరు వెక్కడ నేర్చితి
వాదివిగద నీదు వాదవైఖరికి బలా
పాదకమగు సాక్ష్యముఁ బ్రతి
వాదుల తెమ్మందు వెంతవాడవు రన్నా. 188

తే.గీ. అనుచు గర్జింప కొందఱౌననిరి కొంద
ఱచట ప్రతివాదు నెవరని రిట్టునట్టు
మల్లగుల్లాలుగా రచ్చమంటపమ్ము
కరయుగమ్మెత్తి వారించి కలకలమ్ము. 189

తే.గీ. అన్నలార ధర్మాసనమ్మున్న మనకు
నదియు కర్తవ్యమే సత్యమరయు కొఱకు
ననుచు నెల్లమరాజు వెంకనను చూచె
కోవిదుండు పోలంరాజు గురవరాజు. 190

మ. అనఘుం డెల్లమరాజు వెంకనయు నష్టాచూపు నాంతర్యమున్
కని మందస్మిత కాంతిరేఖ లెలమిన్ గండద్వయిన్ ప్రాకి క
న్గొనల న్వెన్నెల మొగ్గలై నిగిడి రేకుల్విప్పగా దస్తర
మ్ముల తాటాకుల పుస్తకమ్మొకటి సంపూజాత్మతన్ తీయుచున్. 191

తే.గీ. పుర్వగాథల జవిలె యప్పొదిలెసీమ
దండ కవిలెను విప్పి పత్రములు తిరుగ
వేసి యొకపట్టు చదివివిన్పించె నిట్టు
లెల్లవారును చెవులు ఱిక్కించి వినగ. 192

" గ్రామ దక్షిణాన కొండమీద నరశింహులు సంబురాయన్కి ప్రసంన్నము లయినారు. అప్పుడే గర్భగృహం మాత్రము కట్టించి కోనేరు త్రవ్వించి స్వాములకు అనేక సమారాధన చేశి తీర్థప్రసాదాలు పుచ్చుకొనెను. దేవళం పొదిలె పొలంలోది. కోనేరు మర్రిపూండి పొలంలోది." 193

మాలిని.

పొదిలె నగరవీథిన్పోవు నిమ్మయ్యతే ర
ప్పదటున నొక వాలున్ పల్లమై దూక చొప్పా
కదిసి నిలిపి నట్లా గ్రంథ సాక్ష్యమ్ముఖన్ త
త్పదము సకల మత్యాశ్చర్య సంస్తంభ మొందెన్. 194

కం. అప్పుడు విజయానంద
మ్ముప్పర మంటుకొన మా వయోవృద్ధుల ప
ల్కిప్పుడు నిజమాయెంగద
యిప్పుడు మీ తీర్పుచెప్పరే మా యప్పల్. 195

కం. అనియె సంజీవి యనియె నయ్యప్పరెడ్డి
ఘనుడు వెంగనకట్టడ మునుగకుండ
మఱ్ఱిపూడికి న్యాయమ్ము మఱగకుండ
నిర్ణయించు మల్లపగుండనేని యిపుడు. 196

శా. అన్నీతిప్రభు చాకచక్యమున కాహోపుట్టగా నేని యో
యన్నా అయ్యపరెడ్డి నీ హృదయ మూహాతీతమై యిట్టు లీ
పిన్న న్నొకపెద్దచేసితివి నీ పెంపెంచి మాయింటి వెం
గన్నన్మించినదేవునెంచి భవదీయాజ్ఞప్తిఁ బాలించెదన్. 197

సీ. అని సభాస్తారుల కభివందన మొనర్చి
వినరయ్య సమరసాపీనమతులు
కొండపై భగవంతు డుండు దేవళమది
పొదిలె పొలమ్ములోనిది మిరాసి
పొదిలెదై మఱిపూడి పొలములో రంజిల్లు
రసరాశి కోనేర్మిరాసి మఱ్ఱి
పూడిదై స్వామికి పూజానివేద్యముల్
నడప పొదిలెనంబి గుడికివచ్చు

ప్రజలకు శఠకోప తీర్థప్రసాద
ములు సమర్పింపగా మఱ్ఱిపూడి నంబి
యిదియ నా తీరుపని నివేదించె సభకు
గుణగరిష్ఠుండు మల్లపగుండనేని. 198

కం. ఇది సామరస్యమార్గ
మ్మిది సౌకర్యంపు పక్ష మిట్లొప్పునె యీ
చదురుని నిర్ణయమనుచున్
సదస్యు లగ్గించి రతని సమతాదృష్టిన్. 199

కం. ఒకడై వచ్చియు దివిష
త్సకలానీకముల మధ్య సాహసవిద్యా
ధికత కృతార్థుండగు ప
క్షికులేంద్రునివలె ప్రహృష్ట చిత్తుండయ్యెన్. 200

తే.గీ. అంతవఱ కొక్కమాటయు నననె మాధ
వయ చివాలున లేచి పైపంచె దులిపి
కటి బిగించుచు సంజీవిఁ గదిసి యొక్క
గంతున మొగమ్ములోన మొగమ్ము పెట్టి. 202

ఆ.వె. పొదినలెయప్ప మఱిపూడి చెల్లెలు తమ్ము
డా యిదేమి శంక పాయుమింక
మన యదృష్టమిట్లు పెనగొన్నదని వాని
కదియ బట్టి బిగ్గ కౌగిలించె. 203

తే.గీ. గంతుగొను మాధవయ్యను గని యిదేమి
బెడద వచ్చెనురా యంచు బెగడు జనులు
నృహరిసేవార్థ మిర్వురు నేకమైన
చందమున కతి విస్మయానందు లైరి. 204

మ. జనతా నిర్భరహర్షదీపిత జయోచ్చైర్నాదముల్ కొండపై
స్వనితప్రక్రియఁబ్రాకి కోవెల ధ్వజస్తంభోచ్చల ధ్ఘంటికా
స్వనసందోహములందు తేలిన రమావామాంగితో శైలఖే
లనలోలుండనె మందెమేలముల మాలమ్ముల్పిసాళింపగన్. 205

తే.గీ ఓసి నీ భోగముల కింక నొడ్లులేవు
క్షీరరత్నాకరుని యింటి చిన్నదాన
వింటివే యిట పూజారిజంట మనకు
పొదిలెనంబియు మఱి మఱ్ఱిపూడినంబి. 206

తే.గీ. అందులకు హరిప్రియము నోయయ్య గిరుల
వింగడమ్ములు మఱగిన సింగరయ్య
మేటి తామేటి రూపమ్మునాటి ప్రథమ
దాసి నిటు చిన్నసేయుట తగవటయ్య. 207

తే.గీ. అనగ నరసింహు డోసి యన్యాయ లతిక
హృదయ రాజ్ఞివి నీవు నిన్నదిమి యదిమి
గుండెగొబ గద్దెఁ బట్టి కూర్చుండపెట్టి
వే విధమ్ముల నర్చించు సేవకుడనె. 208

మ. అనగా నిందిర పూతకొత్తిమిరిచేనై నవ్వె నవ్వె న్సదా
తనుడున్విచ్చినపండ్ల బూరుగయి తద్దాసద్వయమ్మేకమై
తెనుగుల్ సంస్కృతముల్ పరస్పర రసోత్సేకమ్ముగా మేళగిం
చిన కావ్యాత్మగతిం జగమ్ములలరించె న్నిత్యమాంగల్యమై. 209

మంగళమహాశ్రీ.

శ్రీపొదిలెకొండ నరసింహునకు పర్వత వశీకరణ దక్షునకు లక్ష్మీ
నూపురఘులంఘుల వినోదపద వక్షున కనూనకవితా విదిత కీర్తి
ప్రాపునకు సంబునృప భక్తిఫల రూపున కభాగ్యజన మానసిక దుఃఖో
త్క్షేపునకు సంసృతివిశీర్ణజన మోక్షరస సింధునకు మంగళమహాశ్రీ.210

మ. పరపక్ష ప్రతివాదఖండనకళా ప్రావీణ్య నవ్యోన్మిష
త్సరసాలోచన సంప్రమోది నిజపక్షవ్రాత న్యాయాధిపా
దరసంభావితశేముషీనిశితవాదప్రౌఢ 'మద్రాస్' పురో
దరపద్మాకృతి 'లా' కళాలయ సముత్థ న్యాయవాగీశ్వరా! 211

కం. పొదిలె పురాతన చారి
త్రదర్శనౌత్సుక్యభావతత్పరమత్యా
స్పదబహుశాసనగాథా
త్యుదాత్తపరిశీలన ప్రయోజనచతురా! 212

మాలిని.

ఉరుతరపదవేగాహోబలాధీశ సద్య
స్స్ఫురిత పొదిలె హృష్యద్భూధర శ్రీనృసింహా
దర తరళకటాక్షోద్గంధి కారుణ్యమాధ్వీ
భరిత హృదయరంగాపాస్త సర్వాఘరాశీ. 213

నాయని సుబ్బారాయ క
వీయ మీమ్మ జన్మభూమి నిది భూధర భూ
నాయక భూమ్యుద్ధర్తృ వి
గాయన ధరణీధరాఖ్య ఖండము పొదలున్. 214

----- 0 -----

# శక్తిఖండము

శ్రీచక్రాత్మిక పొదిలె
మ్మా చిన్మయశక్తి భక్తి మధురమరంద
ప్రాచుర్య సమభిషిక్త స
దాచారపరాయణాంతరంగ నృసింహా. 1

## పొదిలెమ్మకథ

ఆ.వె. పొదిలె సర్వజనుల పుణ్యసారసవనీ
వికసనమునకైన వే వెలుంగు
కరుణజాలువాఱు కన్నుల పొదిలెమ్మ
మేలుసేయు జగములేలుతల్లి. 2

చం. అతులితభక్తియుక్తి జను లామెకు కొల్పులుసేయుచుందు రం
చితబహుచిత్రవర్ణముల చీరలతో కనువిందుగా పరి
ష్కృతములు గూండ్లు గల్గి విలసిల్లెడు కుంకుమబండ్లు కట్టి యూ
ర్జితశివవాహవేగత వరించిన గిత్తల గట్టి వానికిన్. 3

ఆ.వె. కాపుబండిముందు కరణమ్ముబండి ముం
దనుచు శుష్కవాదములకు దిగరు
పూర్వసంప్రదాయము విధించు క్రమమున
సాగిపోవు బండ్లు జనని గుడికి. 4

ఉ. వేటలు కుక్కుటమ్ములు నివేదనగా బలియిచ్చి శక్తి కు
త్పాటిత తద్వపుఃపలలపాకవిశేషము లర్థిమై నిరా
ఘాట మనోముదమ్ము సెలగన్ కడుపారభుజించి కొల్పుజం
జాటము నిస్తరింతురు ప్రజల్ పొదిలెమ్మకు గూర్చుభక్తులై. 5

ఆ.వె. ఇంతచేటు జీవహింస దేవతపేర
చేత ఘోరమండ్రు హేతుమతులు
జీవములను కోసి దేవతకిడి తిన్న
పాప మంటదండ్రు భక్తిరతులు. 6

కం. ఇది జీవహింసరైయె య
య్యది కాదో యూరనూర నమరు కబేళా
లొదవించు నిత్యవిశసన
ముదరంభరతా మహాప్రయోజనమునకై. 7

కం. ఏడాదికొ రెండేండ్లకొ
మూడేండ్లకొ యొక్కమాటు ముడివడు కొల్పుల్
పీడార్తమానవ మనః
క్రోడమ్ముల జననిభక్తి గురువులు వాఱన్. 8

చం. పొదిలె యొకండెగా దిరుగు పొర్గుల యూళులు సైత మమ్మహా
భ్యుదయనందు పాలుగొన నుత్సుకతంగను నమ్మకంచితో
పదలును చిన్ని కుంకుమపు బండ్లును నై విలసిల్లి యట్టిప
మ్మదమున కింత నోచనిది మాధవరాయనిపాలెమొక్కటే. 9

కం. ఆయూరి వారలమ్మకు
నేయుపదలు- పసుపు కుంకుమేనియు - తేరా
దాయూరు తల్లి పుట్టి
లైయుండియు నేమి కర్మమది వారలకున్. 10

కం. అమ్మాధవరాయని పా
లెమ్మున కది దేవి మందలించిన పటు శా
పమ్మందు రక్కథావిష
య మ్మిటులు మందలింతు రప్పొదిలె జనుల్. 11

సీ. గండరించెను మింట కమల బాంధవ బింబ
మెఱ్ఱనిప్పులగుండ మీది యాది
పడమటిగాలి నిశ్వాస దాహోర్చి పై
కొనె తోక త్రొక్కిన కోడె త్రాచు
విలయతాండవరుద్ర విచలజ్జటావళుల్
చెట్లకొమ్మలు కళాసికలు వోయె
బ్రహ్మాండభాండముల్ పగిలించు వెట్ట కు
ర్వీ జీవనమ్ము లిఱ్ఱింకు లింకె

పొదిలె నొక మిట్టమధ్యాహ్నమునను మారి
మసగినట్లు విజృంభించె మండుటెండ
దాని వెల్లువబడి వచ్చె తరుణి యొర్తు
తప్తజీవ సమాశ్వాస ధన్యశక్తి. 12

ఉ. అన్నులమిన్న కుండలినియౌ కుదురూదిన శీర్షశేఖరం
బన్నపు భాండముం బెసుకునంచునొ గట్టిగపట్టి చేతులన్
కన్నులవెల్గు కస్తురియు కప్పురమున్ చిలికింప దిక్కులన్
వెన్నెల వాకయై పరిఢవిల్లెను స్విన్న శరీర రేఖలన్. 13

కం. అవతలి వైపున పెద్ద చె
రువు కొకవైకుంఠ మగుచు రూపొందిన మా
ధవరాయనిపాలెము నుం
డి వెడలి యక్కన్య గతి పటిష్ఠత మెఱయన్. 14

సీ. ఎండ మండించు నిట్లేల యీనాడు నా
రాయణుం డమృత సంధాయకుండు
భువన జీవన బిందు భోక్త మాయన్న త్రి
భువన జీవన బిందు మూర్తిగాడొ
యీ పెద్దచెరువు కిట్లీ వట్టిపోవుట
లేమి యవ్యయ రస ధామమునకు
మాయన్నలకు క్షుధామందేహులకు కనుల్
కాయలౌనో మదాగమ నిరీక్ష

నను తలంపుల పరవశస్వాంత విధిషి
డార మడ్డమ్ముపడి తత్తటాకమునకు
క్షిప్రగతి వచ్చివచ్చి దక్షిణపుటలుగు
ప్రక్క కట్టపైకెక్కినదక్కుమారి. 15

మధ్యాక్కర.

చెరువు కట్టకు సమీపమున నుడుకుల చింతల తోపు
అరుదుగా దాని చెంతను చలువల మహాలక్ష్మి చెట్టు
వరుస నెద్దులు బంతి నేడు నన్నలు వరుస నేడుగురు
గుఱిపెట్టి నుఱుతురు సజ్జకంకుల కుప్ప కళ్ళమున. 16

తే.గీ. ఆకలియు దప్పి తీఱె మాయన్నల కిక
నింక నా కష్టమిదియు గట్టెక్కె నంచు
కట్ట యెక్కిన యాయాస కజ్జలమ్ము
కరుగ నక్కన్య కనుమూసి తెఱచులోన. 17

సీ. నిత్యధావనమైన నీర్కావి దోవతి
కటిపైని గజచర్మ కళలు బోవ
వలె వాటుగా విరాజిలు నుత్తరీయమ్ము
గళసీమ పాము వంకరలు తిరుగ
బూదిమెత్తిన ఫాలభూమి నల్లని చాదు
బొట్టు మూసిన కన్ను పొలుపు తెలుప
వలకేల పట్టిన బారు పంగల కఱ్ఱ
ముమ్మొనవాలు సొంపులు వెలార్ప

గంట డాపలికరమున కక్షమందు
జోలె మెడవ్రేలు సంకు తాంబూల రాగ
రంజితమ్మగు నోరునై రమణి ముందు
తరుణ జంగము డొకడు ప్రత్యక్షమయ్యె. 18

మధ్యాక్కర.
ఇట నొక్కక్షణము ముందెవ్వరిని కాన మిదియేమి వింత
యెట నుండి వచ్చెతా నైంద్రజాలికుం డీ జంగమయ్య
కటుతర గ్రీష్మమునకును వర్షమ్మగతి నంచు లోన
గుటకలు వేయు కోమలికి జంగమ గురు డిట్టులనియె. 19

శా. ఈ కర్కోటపు టెండ బిచ్చమునకై యిల్లిల్లు నూరేగుట
న్నాకు న్నాలుక పిడ్చకట్టినదిపో నారాయణీ దానభం
గీకైలాసము నిక్క నీయెడద పూగీఖండ సత్కార దీ
క్షా కైంకర్యము పట్టి యేలుకొనవే కల్యాణి యీ ప్రాణముల్. 20

కం. ఆప్పలుకుల నయనమ్ములు
విప్పారగ వదన కళల వెన్నెల క్రోవుల్
కప్పురము చిమ్మ కంఠము
విప్పి వెలది నవ్వుముడులు వీడగ నతనిన్. 21

శా. లోకమ్ముల్ పదునాలుగింటగల యాలోకాళిపే శ్లేకసం
థాకౌశల్యము మీఱ గుర్తుగొని యున్నావేమి యో జంగమ
య్యా కైలాసము నుండి యూడిపడినావా యేమి లేకున్నచో
నీకు న్నాయభిధాన మెట్లుతెలిసెన్ వింతయ్యె నీ చందముల్. 22

తే.గీ. అడుగనిటు వాడు నవ్వు మీగడలు కోర
మీసములు మ్రింగి చెక్కిళ్ళుమేయ ననియె
మాధవునిపాలెమున కదా మనికి నీది
యింక నారాయణివి కాక యెవ్వరీవు. 23

శా. ఆ కైలాసము మాట యెందు కిపుడోయబ్జాక్షి! యీ దక్షిణా
శా కైలాసమె చాలుపొ మ్మిచట నీశాన్యమ్మునం దొక్కయి
ల్లై కైకోలుగ మత్పురాపరిచితవ్యాపార మీ నిత్య భి
క్షా కార్యక్రమ మీశ్వరయ్య యను సంజ్ఞ న్నే నభివ్యక్తుడన్. 24

తే.గీ. ఈ పొదిలెసీమ యందు నా కెఱుక పడని
యూళ్ళులేవు ప్రాణులునులే వుత్పలాక్షి
సర్వనామరూపక్రియా సంగ్రహమున
నాయెడంద మహేశతంత్రమ్ము సూవె. 25

శా. ఆ నారాయణి వాని పల్కుల కవశ్యమ్మున్ సహస్రార ప
ద్మానందామృతసింధుమధ్యగ మహేశాంకస్థలాధిష్ఠిత
శ్రీనారాయణినైయె వెలింగియు పునః స్వీకారితాధారమా
యానిర్మోకత నేమియున్ తెలియన ట్లాజంగమస్వామితోన్. 26

ఆ.వె. ఔర యెంత చదివి తవ్యక్త శబ్ద వై
భవ యలంతి నాదు పలుకు వెంట
నంత చదువవలెనె యమృత మూరించు చ
ర్వణ పదమ్ము వక్క పలుకు కొఱకు. 27

కం. వక్కాకు సంచి బొడ్డున
చెక్కితి నిలువెడలు వేళ చేతులు వీల్గా
వక్కట సడల్ప దానిన్
తక్కక నీ దాహమెట్లు తలగెడి దానన్. 28

తే.గీ. వరుడవీవు నన్నంటగా భద్రమగునొ
కన్యకనునే ననాహతకామకళను
భ్రాత లరయగా నేమి దెప్పరము కలదొ
యెట్టు లీబ్రహ్మముడి విప్పు టీశ్వరయ్య 29

మ. వెరవారన్వచియింప నిట్లతడు తన్వీ మెచ్చితి న్నీ పరా
పరసంవాద విదగ్ధ వైఖరి పరుల్ వారెవ్వరోహో! పరా
పరదృక్కీజగ జంగమయ్యె కికనీ భ్రాతల్ వృథా వేశపా
మరులా వారికి నేత్రముల్ చెదరనిమ్మా దాన నేమయ్యెడిన్. 30

మ. అతితీవ్రమ్మగు నెండ దాహ మిక నా కావంతయున్ సైపరా
ద తిరమ్మై నిలుమంచు నప్పరమ తంత్రజ్ఞాండు సౌవర్ణ శో
భిత కాంచీ మణిపూరకద్యుతులు చుంబింపగ రక్తప్రభా
న్వితి తన్నాభిసరోజ మాత్మకర సంస్పృష్టమ్ము కావించినన్. 31

ఉ. అక్కలకంఠి బిట్టు వివశాత్మికయై యిదియేమి మాయరా!
ఒక్కెడ చుట్టుచుట్టుకొని యున్నదదేదియొ నిక్కిచూచుచున్
చుక్కలు రాయునట్లు కడుచోద్యముగాగ మదంతరమ్మునన్
చక్కిలిగింతయౌ పరమజాలిక నీ కరమంట పొక్కిలిన్. 32

తే.గీ. చరగురూ తల్లిదండ్రుల చాటుదాన
నన్నలకు బువ్వ కొనిపోవుచున్నదాన
పనికడపి వేగ మిలుసేరవలయుదాన
నన్ను దయజూడు మనివేడ నవ్వియతడు. 33

తే.గీ. ఓసి యాత్మాపహరికా యోసి మాయ
లాడి చూడు బ్రహ్మగ్రంథి వీడిపోయె
కలిత నారాయణప్రభాకర్షణ ప్ర
వర్ధన ప్రాణరక్తశోభావిభూతి. 34

మ. అవలోకింపు తమోవధూతహృదయ వ్యాపారమేపార వై
ష్ణవముల్ రౌద్రములైన యప్పరమతేజశ్చక్ర లీలావిలా
సవికాసమ్ములు నివ్వరించె నిక నిచ్ఛాశక్తిమై నీ మహా
భవకర్తవ్యము పూను మీశివపురీ భాగ్య మ్మ శేషమ్ముగన్. 35

తే.గీ డమరుకోద్భూతములు ప్రగాఢములు సప్ర
ణవమహానాదములు నిరంతరములౌ ప
థముల దయివాఱు నీయూరు ధన్యనరుల
పరమపుణ్యఫలముల కల్పకనగమ్ము. 36

ఉ. రమ్మనికోరు నిన్నిది కర మ్మనురక్తి నదేదియో నికా
రమ్మనుకోక యీశ్వరుని రాగసముజ్జ్వల భావనావికా
రమ్మనుకోక దైవము శిరమ్ముసకెత్తిన మేరువంత భా
రమ్మనుకోక లెమ్ము శివరంగము పొంగగ శక్తిసంగమై. 37

తే.గీ. పొదిలె పుణ్య పాప సమూహములకు నభ్యు
దయ వినాశ కారిణివిగా నయితి వీవు
నిత్యపాలనా సంహార నియతశక్తి
నింక నీకేటియాస పుట్టింటి మీద. 38

మత్తకోకిల.
అన్నలందువు చెల్లెలందువు నన్నమందువు మంచిదే
అన్నలెవ్వరొ చెల్లెలెవ్వరొ అన్నమెవ్వరు తిందురో
అన్నలన్ కనుమంచు నద్భుతహావభావవిలాసి చే
సన్నజూపగ కన్య చూపులు చాచె కళ్లమువంకకున్. 39

సీ. అవియెద్దులా జగదంతవేళా భయా
వహ కాలమహిష రూపక్రమములు
వారన్నలా మానవప్రాణమూల ని
ర్దళనోగ్ర యమకింకర స్వరూపు
లవి సజ్జకంకులా ప్రవిఖండి తానేక
గాత్రరక్తాక్త శల్కవ్రజమ్ము
లది కళ్లమా తాండవాభీలరుద్ర పా
దాహతోన్మథిత మహోశ్మశాన

మత్యపూర్వ బీభత్సుక మ్మగుచు కాన
బడిన యాదృశ్యమునకు మే న్వడక నామె
యింతకును మూలమనదగు నీశ్వరయ్య
కొఱకు నిటుచూడ నాతని గుఱుతులేదు 40

తే.గీ. మఱల నటు చూడ కళ్లమ్ము నుఱుచుచున్న
యన్నలు యధాప్రకార నిష్పన్ను లక్షి
గోళకము లెఱుపుల సుడిగుండములుగ
నెంచు చుండిరి తన్ను తదేక దీక్ష. 41

ద్విపద. ఇదివఱ కేనాడు నిట్టిది యెఱుగ
పొదిలెకై నా యాత్మ పొంగులువాఱు
నెటునుండి వచ్చినా డింతలు సేసి
యెటువైపు సురిగినా డీ జంగమయ్య
నడిమింటిలో మండు నారాయణుండు
పడబోయు నెండ కీభ్రాంతి కల్గినదొ
కనలు నన్నల కర్మగతి యెవ్వడెఱుగు
ననుకొంచు నటుసాగె నా కాతరాత్మ. 42

తే.గీ. కట్టపై నావిధమున సంగ్రథితమైన
కన్యకా జంగమేశ్వర కపట నాట
కము కనులబట్టె యాత్మలు కప్పివడగ
నపరమృత్యూగ్రరూపులై యన్న లపుడు. 43

మధ్యాక్కర.

వరుసగా నేడ్వురు కొడుకుల వెనుక వైష్ణవీ భవ్య
కరుణచే నొక్కగానొక్కకూతురు కలిగెనటంచు
మురియుచు నల్లారుముద్దుగాపెంచి ముసలిపీనుగులు
పరమేశ్వరా దీని పాడుచేసిన పాపమ్ము పండె. 44

మధ్యాక్కర.

పరమేశ్వరుండట:- దీనిపాడెయు పచ్చిబద్దలును-
వరియించెనట తన్ను వేదవాక్యమై పసిముండపాట
పరమేశ్వరీ యంచు ముసలివగ్గులు ప్రక్కతాళముల
హరుసింప తెగి యిది పొదిలె జంగమయ్యను తగుల్కొనియె. 45

మధ్యాక్కర.

పోయెరా వంశమర్యాదనేటితో పొలిసెరా పేరు
మాయన్వయపు చల్వమడతనంటెరా మాయని మఱక
యీాయకృత్యము జూడగనియు నీకన్నులివి వ్రయ్యబడ వి
సీ యీాచెడిపె బొందిలోన నింకను చెలగు ప్రాణములు. 46

మధ్యాక్కర.

చఱవరా చర్నకోలను వృషభముల చర్మముల్పగుల
నుఱవరా కంకులకుప్ప పడలాగి నుగ్గునూచముగ
గుఱుతురా కళ్లమ్ము నేడు నరబలి కోరెరా యంచు
హరహరా ప్రళయకాలాగ్నులైమండి రన్న లేడ్వురును. 47

ఉ. చింతలతోపునిప్పులు గ్రసించిన పశ్చిమవాయువుల్ సుధా
నంతసమార్ద్ర శీతలములై పురణించెడి వేపచెట్టు ఛా
యాంతరవేది దింపుకొని యన్నపుభాండము ఘర్మవారిసం
క్రాంతముఖమ్ము చేలము చెరంగుల చిత్తడివాయ నొత్తుచున్. 48

కం. నారాయణి పరమదయా
పారాయణి ఖలవిధిప్రభావుల నసువుల్
సైరింపరాని యంగద
చీరెడు సోదరుల నిట్లు చీరె న్వరుసన్. 49

సీ. బచ్చలి పప్పన్న పరవశమ్మగుదు నీ
కని పంపెనమ్మ పెద్దన్నరావె
గోగు పచ్చడి యన్న కొండయెక్కెదవు నీ
కని పంపెనమ్మ చిన్నన్న రావె
కొఱవి కారమ్మన్న పెరిగిపోయెదవు నీ
కని పంపెనమ్మ బుల్లన్న రావె
వంకాయ కూరన్న ప్రాణములు విడుతు నీ
కని పంపెనమ్మ బుచ్చన్న రావె

కరగిపోదురు ప్రాచింతకాయ త్రొక్కు
కో మిగిలి నన్నలార మీ రొక్కరొక్క
రమ్మ వాత్సల్యధాత్రి మీ కదియు పంపె
నంగదకు చిక్కనేల రండన్నమునకు. 50

తే.గీ. ఆ పిలుపు విన్న పెద్దన్న యరుణనేత్ర
కోణముల దొంగనవ్వులు కోరగింప
నిట పని రవంత మిగిలిపోయినది చెల్లి!
యదియు తీఱినగాని రామన్నమునకు. 51

తరల. ప్రిదుల నీయక యెంతనేర్పున పేర్చి యెద్దులు త్రొక్కినన్
చెదరి కళ్లమునుండి చుట్టును జీబువాఱుచు నున్న యీ
కొదమ కంకుల కన్నె ముచ్చుల కోడెగమ్ములు మాయగా
కదిసి వేగమ రొళ్లి యన్నిటి కళ్లమందెగద్రోయవే. 52

తే.గీ. అంత నీపనితీఱుపొ మ్మంతతీఱు
మాపనియు నంత కన్నమ్మమాట దేవు
డెఱుగు రారమ్మ నారాయణీ! యటంచు
చీరె నాపిల్పు వికృతమై చెవి ధ్వనింప 53

కం. ఇదియేమి యావటించితి
సదాశివా యంచు దక్షసవనస్థలికిన్
కొదుకుచు పోయిన సతిగతి
కదలె న్నారాయణియును కళ్లము జేరన్. 54

తే.గీ. చేరి పనిపూని నడుము వంచినదొ లేదొ
జుట్టొడిసిపట్టి పెద్దన్న నట్టనడిమి
కళ్లమున పోయి నేలకు కఱచు కొనగ
రేసి పడలాగె నపరదుశ్శాసనుండు. 55

చం. చఱచిన చర్నకోలల రుషాహతులన్ సివమెక్క తక్కు సో
దరు లదలించి రెడ్ల నతిదారుణచిత్తులు దుర్భరవ్యథా
భరకుపితమ్ము లెడ్లు పరివర్తనవేగ పరంజసామ్య ని
ర్భరవలనమ్ములై నుఱిచె పచ్చడి పచ్చడి గాగ కళ్లమున్. 56

కం. లయకాలదండచండము
లయోమయ ఖురప్రఘట్ట నాభీలము ల
త్యయ విభ్రమకేళీ ని
ర్దయాతి వికటమ్ము లుక్షతతి పాదమ్ముల్. 57

కం. ఇరువది యెన్మిది గిట్టల
పరంపరాహతుల చితికి పావని మే న్నె
త్తురు లురుల సన్నెకంటన్
పరిమర్దితమైన మిరపపండై మెఱసెన్. 58

ఉ. ఆయమ కాయమందెగయు నస్రము సూదులు చిమ్మి యా పశు
ప్రాయుల కన్నులన్ పొడువ వారు భరింపగరాని వేదనన్
కోయని యార్చుచున్ తమకు క్రొత్తగ నేనిరయమ్ముపుట్టెనో
పోయిరి చెట్టుకొక్కడును పుట్టకు నొక్కడునై యసద్గతుల్. 59

ఉ. ఆయమ కాయమందెగయు నస్రము ఱంపపుకోతకోయగా
వేయిపగుళ్లుపోయి ఖురవీథులు బాధలఱంకె లభ్రమున్
ప్రేయగ బంతికట్టు తెగద్రెంచి యభద్రములైన భద్రముల్
పోయిన పోకగా వఱచె పుట్టకునొక్కటి గుట్టకొక్కటై. 60

మధ్యాక్కర.

ఆ రక్తమున ద్రుంగి సజ్జగింజలు హారిమాణిక్య
సారరోచిర్బిందు సముదయమ్ముల సరణి రాగిల్లె
నా రక్త మెంత యూర్ధ్వాభిసరణమో యవని నింకియును
చేరె నంతర్గామియగుచు నట చింతచెట్ల కాయలను. 61

సీ. చలదభిరామ కోమల విలాసము జమ్మి
యాకు సోకుడుముడుగట్లు ముడిగె
వటశాఖికనువ్రేలు పగలుకానని ఋషి
పక్షి యల్లలనాడె పట్టువీడి
యేచి ముంగాళ్ళపై నెగయు బిడాలమ్ము
వెనుగాళ్లమీద స్తంభించిపోయె
పుట్టపై నొయ్యారముగలేచియాడు ద
ర్వీకరమ్మట్లె నిర్విణ్ణమయ్యె

ననవరత మూలమాయాప్రయస్త మెల్ల
ప్రకృతి వెతగుందె నమ్మహాప్రకృతి కొరకు
నర్థి నారాయణియును మాయావరణము
సజ్జ కంకుల కళ్లమం దుజ్జగింప. 62

తే.గీ. ఆమెనెత్తుట తడిసినయంతమేర
కళ్లమది సదాశివమంచకమ్ముగాగ
నట సుధాసారవర్షిణి యగుచు పండె
సతి పొదిలె భాగధేయ మూర్జితముగాగ. 63

సీ. ఊరి తూరుపుమొగనున్న పోలేరమ్మ
చెమ్మచెక్కాట కుత్సేకమొందె
నూరి యాశాన్య మందున్న కైలాసయ్య
సాంధ్యలాస్యముల కుత్సాహమొలికె
నూరి దక్షిణవీథి నున్న గోపాలయ్య
సొగటాలయాటపై సొగపుమెఱసె
నడియూరనున్న యంగడి వీరభద్రయ్య
దాగిలి మూతకై వేగిరించె

నూరి పడమర నేతదభ్యుదయమూని
యక్క నతి చెల్లె లమ్మయై యాదిశక్తి
తనకు తనకును తనకును తనకు కలిగె
నంచు నొక్కట హృదయమ్ము లలరుచుండ. 64

తే.గీ. ఎండకైనాడుగా వానకేలకాడు
రవి హృదంతరవర్తి నారాయణుండు
తచ్చికురబంధసిత సితదామరమ్య
మొక మొగలిరేకు మొగులు పెల్లుబికి యుబికి. 65

సీ.. వలితసుశ్యామలవర్ణసుందరధూమ
పిహిత వై హాయస వీథి యగుచు
మలసెనో చంచలామాలికాజాలాంత
ర జ్యోతి రాపూర్ణరమ్యమగుచు

వెలిగెనో హృద్యశీతల సమీర నిరంత
 రాలింగనాలోలితాంగ మగుచు
కులికెనో గర్భసంగూఢ నిర్మలమధు
 రాంబుధారా వినిష్యంది యగుచు

వెలసెనో నందినీపయో విలసనములు
పంకసంక్షాళనాత్యంత పావనములు
పరమశుభకార్య పుణ్యాహవాచనములు
క్షీరపూరముల్గురిసె నయ్యూరిమీద. 66

ఉ. దుర్భర దోషకర్దమ విదూషిత మా ఖలరంగమప్పు డా
నిర్భర వర్షపాతముల నిర్మల రత్నమయాంతరీప నం
దర్భరమణ్యమై సకలదైవతసేవ్య పవిత్ర దివ్య రో
చిర్భరితమ్ముగా వెలిగె చిన్మహనీయకళానివాసమై. 67

మ. కరుణాకంధులు కన్నులై డమరువున్ కంజాతమున్ శూలము
న్నరలోకాభయము న్వహించు కరముల్నాల్గై సహస్రప్రభా
కరసౌవర్ణరుచిన్ హసించు విలసత్కాయమ్మునై దివ్యసుం
దరరూప మ్మొకడుద్భవించె జగదానందమ్ముగా నచ్చటన్. 68

వసంతతిలక.

ఆ విస్మయావహ మహా కరుణావతార
శ్రీ వీక్షణన్ పరవశించి ప్రహృష్టచిత్తుల్
త్రైవిష్టపు ల్గురియు నంచిత పుష్పవృష్టిన్
ద్యావాధరాంతరము తావులవెల్లి యయ్యెన్. 69

తే.గీ. నిర్ఘృణా కఠోరము దైవ నిర్ణయమున
కట్లు తలయొగ్గు ధర్మదీక్షాచలాత్మ
ఆమెయే పొదిలెమ్మ తద్గ్రామము పయి
నీగయుని వాలకుండ రక్షించు తల్లి. 70

తే.గీ. పొదిలె జనముల చిరతపః పుణ్యమెల్ల
పండి ప్రాదుర్భవించిన భవ్యరూప
మామె యే పొదిలెమ్మ భవాగ్ని కుండ
తప్తజీవ సమాశ్వాస ధన్యశక్తి. 71

పంచాగ్నికథ

ఆ.వె. పొదిలెరక్ష తనకు ముఖ్యమై మలుసంజ
కట్టబెట్టు కొత్తపుట్టముండు
దుమ్ముగ్రమ్మి ముండ్లతో నిండి యమ్మ శ
రీరమందు తెల్లవాఱె చూడ. 72

ఆ.వె. పాముమీద నెంత వాత్సల్య మమ్మకు
పిల్లిమీద నెంత ప్రీతి జనని
కవుగి పెనగి యాటలాడు నన్యోన్యమ్ము
పిల్లి పాము తల్లివెన కజేరి. 73

ఆ.వె. పిల్లి పిల్లి గాదు వెలుగు పామును పాము
గాదు తెలివి వాని క్రమకేళి
నాత్మచిద్విలాస మనిశమ్ము పొదిలెలో
పిల్లలకును పంచిపెట్టు నమ్మ. 74

చం. అనయము సత్కవిత్వ మహితాప్తిగ నాతని దీర్చి నైజ దా
సునిగ నను గ్రహించిన విశుద్ధచిదంబరవైఖరీసనా
తనగతి కాళికిన్ జగముతల్లికి స్వీయపదాబ్జభక్తి నొ
ప్పిన యొక పాపనిన్ సకలవిద్యల విశ్రుతు జేయు టబ్రమే. 75

తే.గీ. ఆ పసినిసుంగు పొదిలెయం దద్భుతపు మ
ఖమ్మొనర్చి యశమ్ము దిక్కందరముల
పనలు వెట్టిన సత్తెనపల్లి గేహ
నాముడైన యజ్ఞేశ్వరు నందనుండు. 76

కం. ప్రజ్ఞానిధి కవితా మ
ర్మజ్ఞుడు శ్రౌతక్రియలను స్మార్తక్రియలన్
విజ్ఞుడు వ్యవహారజ్ఞుడు
యజ్ఞేశ్వరచయను లత్యహంయువు తలపన్. 77

శా. కాళీభక్తుడతండు తీవ్రతపమున్ కావించి శ్రీశైల భూ
కైలాసమ్మున దేవి యిచ్చు వరముల్ గైకొంచు నానంద మా
ధ్వీలిప్తాత్ముడు వచ్చి గేహమునకున్ వేమూరి వంశాబ్ధి క
న్యా లావణ్యధనమ్ము చూఱకొనె గార్హస్థ్యాటవీ వాటికన్. 78

తే.గీ. ప్రథమ సంతానలాభమ్ము పడసి యతడు
పెదచెరువు తూర్పుదెస దీక్షగదుర నొక మ
హాక్రతు వొనర్చి దాని చిహ్నముగ నచట
పాదుకొల్పెను రాతి కంబములు రెండు. 79

మ. సవురై వేదికి మూడు దిక్కుల జ్వలించన్ గార్హపత్యమ్మునా
హవనీయమ్మును దక్షిణాగ్నియును తోడైకూడి సభ్యావస
థ్యవిశేషాగ్నులు చంద్రమౌళి విదిశం దైవాఱ యజ్ఞేశ్వర
ప్రవరుం డొయ్యన దీర్చె నాసవనమున్ పంచాగ్ని పక్షమ్ముగన్. 80

ఆ.వె. సోమపీథి వలపుసొల పపూర్వమ్మయి
సోమిదమ్మకనియె సుతుని మఱల
వాని కిడియె తండ్రి పంచాగ్ని యనుపేరు
తన క్రతుప్రశస్తతను తలంచి. 81

మత్తకోకిల. పచ్చసంపెగ మొగ్గ బంగరువన్నెచిన్నెల మేనితో
ముచ్చటల్ ముడివడ్డ రెండవపుత్రు పొంకము జూచి నా
డచ్చటన్ జగదంబ యిచ్చిన యవ్వరమ్ములనెంచి లో
నిచ్చ లబ్రము రాయ హర్షపు టెత్తిపోతల నాతడున్. 82

కం. ఏమే ముత్కుల పాలిక
యీ మన్మథుడెవరిపోలికే చెప్పగదే
వేమూరి వంశ జలధి మ
హామంగళదేవతా యటంచడుగ సతిన్. 83

ఉ. అన్నలినాక్షి పల్వరుస యంచుల పొంగిన నవ్వు వెన్నెలల్
చిన్ని గులాబి పూసొగసు చెక్కిలి గుంటల నింక బల్కె నా
పున్నెపురాసి యీనిసువు పోలిక కావలెనేమి బుద్ధిసం
పన్నిధి నీకు వీని దొకమానిసి పోలికగా నెఱుంగుమా. 84

కం. ఆ నెఱతనమునకు మనసు
లీనమ్మై ప్రణయరాగలీలారస ని
ధ్యాన ప్రవాహములు కన్
గోనల విరియంగ నతడు కులసతి తోడన్. 85

తే.గీ. జనని పోలిక సుతు డదృష్టపు కొటార
మోసి పండితురాల వక్రోక్తి చతుర
ఘనతపస్సృత్వ జగదంబికా ప్రదత్త
వరుని యిల్లాల యీమాత్ర మెఱుగలేవొ. 86

మ. అనినన్ కోమలి నేనుమాత్ర మది కాదన్నానటయ్యా తప
మ్మనుచుం దేవివరమ్ములంచు నొకపాటై నన్ను నూరించుటే
పనియయ్యెంగద నీకు తద్వివరముల్ పాపిష్ఠి యీ కర్ణముల్
విన నర్హమ్ములు గావొ లే కవి రహోవృత్తాతి గూఢమ్ములో. 87

తే.గీ. పరమ శోభా వసంతప్రభాత కుహూ కు
హూమధురనాద నవకోకిలామృదూక్తి !
వీను లలరింపు మా కథ విప్పి యిప్పు
డనగ నుల్లాసితస్వాంతుడై యతండు. 88

కం. ఈ కాళీభక్తు తపః
ప్రాకాశ్యమ్మిట జనాభివర్ణితమై నీ
శ్రీకారవర్ణ కర్ణ
ప్రాకారములందు నెపుడు పడనే లేదా! 89

కం. ఆర్షమహాధర్మ దురా
ధర్షనయోజ్జ్వలము మనదు దాంపత్య మ్మ
త్కర్షానురాగనిత్యో
ద్ధర్షిణి ! కలదే రహస్యమని మనమధ్యన్. 90

తే.గీ. తరుణమెఱిగి యెఱిగి సందర్భశుద్ధి
పలుకు నౌచిత్యవేదియై పండితుండు
తరుణమెఱుగ కెఱుగక సందర్భశుద్ధి
వదరు నిచ్చవచ్చినయట్లు పామరుండు. 91

ఉ. ఎవ్వని గూర్చి యవ్వరము లిచ్చె కృపార్ణవయై యపర్ణ య
మ్మవ్వవు కోశ మీనిసువు మత్కుల కేతువు నీతపన్యకున్
పువ్వయి పుట్టినా డిదియపో సమయ మ్మిక చెప్పువాడనో
జవ్వని సావధానవికసన్మతివైవిను మత్తపః కథన్. 92

ఉ. పుట్టిన పుట్టువున్ సఫలమున్ పొనరింప హృదంతరమ్మునన్
పట్టి భవాని శ్రీచరణపద్మము లాపయి నాదు నేత్రపుం
బుట్టల నిండ తద్భువనమోహనరూపము బట్ట భక్తిమై
మెట్టుల మెట్టు శ్రీనగము మెట్టితి తీవ్రతపశ్చరన్మతిన్. 93

కం. అన దేవీదర్శన భా
గ్య నిమిత్త మ్మింత దూర మరుగవలసివ
చ్చినదా యనె సతి విసుగుల్
కొన కన్నుల తిరుగ నతడు కోమలి కనియెన్. 94

ఉ. ఇక్కడ నేమియున్నదని యే నతిదీక్ష తపమ్మొనర్పగా
నక్కడ కాదె పిక్కటిలు నమ్మ జగన్ను తమూర్తివైభవం
బక్కథమధ్య నడ్డపడి యిట్లు కుశంకల చంకతాళివై
నిక్కక కట్టిపెట్టి విను నీదు కథంకథిక ప్రతాపముల్. 95

శా. బాలా ! యేమని చెప్ప నాదగు తపఃప్రాగల్భ్య మొక్కొటనే
వేలల్పొంగె సహస్రవత్సర తపోవీర్యమ్ము శ్రీశైల భూ
కైలాసమ్మున నందుకేగదవె మత్కల్యాణవంశమ్ము భూ
కైలాసాహ్వయమయ్యె నియ్యదియు నీ కర్ణమ్ములందూఅదో ! 96

శా. వేళాకోళముతోప నిట్లను విభు న్వీక్షించి పద్మాక్షి య
య్యాలాపమ్ముల నేను వింటినిగదయ్యా! బ్రహ్మకైలాసమం
చేలో యయ్యది నీ కథాకథన సాహిత్యమున న్మాఱె భూ
కైలాసమ్ముగ దీన నొండొక చమత్కారమ్ము భాసించునో! 97

కం. అని మోమునలము నవ్వులు
కనత్తటెల్లతల సోయగమ్మై పృచ్ఛిం
చిన వెల్లదనము కదురు వ
దనమున బింకంపుపొరలు తచ్ఛాదంగన్. 98

కం. పతియనె శబ్దాధ్యాసము
చతురా! యిది నీ వినికియెసరి యైనను సా
మెత వినవొ 'ప్రమాదో ధీ
మతామపి' యనంగ నింక మత్కథవినుమీ. 99

ద్విపద. అతిలోకతప మట్టు లబ్దమ్ము సాగి
వితత శబ్దబ్రహ్మ విద్యోతి తాభ్ర
గతి మేఘనాదసంకాశమై యిట్టు
లతికె నా వీనుల నశరీరవాణి. 100

ఉ. మెచ్చితి నీతపమ్ముల కమేయగుణాఢ్య గృహస్థధర్మసం
పచ్చతురాస్యమూర్తివయి వర్ధిలు మింటికినేగి లోకమం
దెచ్చట లేనియట్లు వెలయింపుము యజ్ఞము దానికోసమై
యచ్చులు నచ్చులే వలసినంత సువర్ణమను గ్రహించితిన్. 101

శా. ఈజన్మన్న హి నాదు దర్శనము నీ కెవ్వాడు మద్భక్తిని
ర్వ్యాజారంభుడు నీ ద్వితీయతనయుం డవ్వాని కచ్చోటనే
తేజోరూపత నేను తోచెద ప్రవర్ధిల్లంగవాడంత వి
భ్రాజత్కీర్తుల వంశకర్తయయి విద్వల్లోక మార్తాండుడై. 102

వసంతతిలక.
ఆ దివ్యవాణి విననైన ముహూర్తకాల
మ్మాదిత్యలోకముల కావల నిక్కినట్లై
యా దివ్యవాణి వెలియన్ భువినక్కినట్లై
శ్రీదేవికి న్నతులు చేసితి చిత్తమందే. 103

తే.గీ. కాళి దర్శనభాగ్యమ్ము గనని చింత
కడుపులో మూటగట్టి బంగారు మూట
గట్టి చేపట్టి యింటిముఖమ్ముపట్టి
వచ్చి నీ పాలబడితి నావర్తనాభి ! 104

వసంతతిలక.
శ్రీమన్మహానగ విశృంఖల మోక్షలక్ష్మీ
ధామమ్మనం దభిమతమ్ముగ మత్తపమ్మై
శ్రీమాత మన్నయనసేవితమూర్తి కాలే
దేమేసతీ ! జనని కెందుకె కింక నాపై. 105

చం. అనియడుగ న్విభుండు సతి యల్లని తెల్లని నవ్వులందు కో
పనటన కెంపులొత్తనవె పట్టున నేనడుగన్ కుశంకయం
చును కథమధ్య నడ్డమనుచుం బుసకొట్టితి విప్పు డిష్టమ
య్యెనె సమయజ్ఞశేఖర మదీయ కథంకథిక ప్రతాపముల్. 106

తే.గీ. పంతములు పోక తెలిసినయంతపట్టు
భర్త యడుగంగ చెప్పనేవలయు భార్య
సమయ మసమయ మ్మను వృథా శంకబట్టి
వలదు పతియెడ విషయగోపనము సతికి. 107

తే.గీ. ఇచట నేమియులేదంచు నచటికేగ
నచటగూడ నేమియునుండదంద్రు విబుధు
లిచట కాళికలేదంచు నచటికేగ
నచటగూడ కాళిక లేనిదయ్యె నీకు. 108

తే.గీ. ఇచట నున్నది కాళికయే యటంచు
నీకు తెల్లమ్ము సేయనే యీ కుమార
రత్నమునకని జనని వరాలమూట
నీ తలకు నెత్తెననుకొందు నిర్మలాత్మ! 109

తే.గీ. అంబ కనపడలేదన్న యలత గుంద
వలసిన పనేమిలేదు నీ కలఘుచరిత!
తండ్రిప్రతిబింబమే గదా తనయు డితని
కగపడిన యంబ నీకును నగపడినదె. 110

శా. అపల్కుల్ తుదముట్టగా వినినవాడై యజ్వనైజాంతర
వ్యాపారమ్మఖిలమ్ము పుత్రుని పయిన్ హత్తించి నిధ్యాన చాం
ద్రీపూరమ్ముల వాని ముంచుచును తద్దేవీ దయాడోలికా
శ్రీపర్యంకు భవిష్యదభ్యుదయ సుశ్రీ లాత్మ భావించుచున్. 111

కం. తరుణీ ! వీనికినై యెద
హరుసమ్ముల క్రొత్తచెలమలై యూరుచు గ
ట్లొరసెడి ' పుత్రాదిచ్ఛే
త్పరాజయ' మ్మని కదా విపశ్చిద్వాక్కుల్. 112

తే.గీ. పరమవిద్యాప్రపూర్ణుడై వంశకర్త
యై వఱలు గాత మీనిసు వంబకరుణ
వీని పువ్వులలో పెట్టి పెంచవలయు
ననగపతితోడ నామె విన్ననువు మెఱయ. 113

తే.గీ. ఏమి పువ్వులో పెంచుట యేమొ తెలియ
దాకలి యెఱుంగ డింగిత మ్మంతుపట్ట
దంబదయ ముందు ముందు నెట్లైన నిపు డి
తండు నా పాలి జడభరతుండు నాథ ! 114

కం. అని తనయు నెత్తుకొని తీ
యని బుగ్గలు కంద ముద్దులాడె సుదతియున్
తన యొారచూపు కోపుల
మనసిజబాణములు రేగి మగనిన్ కలపన్. 115

ద్విపద. ఐదవ యేడు పంచాగ్నికి వచ్చె
నైదవనెలయందు నైదవనాడు
విదిత శాస్త్రోక్త సద్విధి పూర్వకముగ
చదువవేసిరి వాని జననీజనకులు. 116

మధ్యాక్కర.
ఓనమాలను దిద్దబెట్టె యయ్యవా రోరిపంచాగ్ని !
వీని రాజేయము దిద్ది రేవు నీవేళకు నన్ను
నోనమాల్ దీక్షమై దిద్దు పంచాగ్ని కో వచ్చునెట్లొ
నా నాయనా బల్పు మఱుగదిద్దియు నలుగుడు పడదు. 117

మధ్యాక్కర.

వచ్చెనా యోనమాలంచు నయవారు పంచాగ్ని నడుగ
వచ్చులోనే యమ్మ మూటగట్టి యవ్వాని దాచినది
పిచ్చినాతల్లి య మ్మూటముడి నెట్లొ విప్పక పోదు
వచ్చులే యయ్య నెమ్మదిగ నవియంచు పల్కు పంచాగ్ని. 118

మధ్యాక్కర.

అప్పల్కులకును లోలోన నవ్వుకొం చయవారు చెప్పి
చెప్పి దిద్దించి విఫలుడై చీదఱరేగి
మొప్పెవురా యంచు కసరి తొడపాసెమును పెట్టి బుడుత
డప్పాట గ్రుడ్లప్పగించిచూచు కుఁయ్యనడు కఁయ్యనడు. 119

మధ్యాక్కర.

ఏమిరా నీ యోనమాలమూట తా నేల దాచినది
రా మంచియమ్మయే యని నతీర్థ్యులు రాగాలుతీయు
పామెఱుంగును పిల్లియెఱుగు మాయమ్మపద్ధతి మీర
లేమెఱుంగుదురు పొండంచు వారి గద్దించు పంచాగ్ని. 120

తే.గీ. శుద్ధబుద్ధావతారమ్ము సోమయాజి
కొడు కనెడు నూరి గుసగుసల్ మడిసికొట్టు
కర్ణముల కుమ్ములో దోసకాయపగిది
హృదయ ముడికిపోవంగ యజ్ఞేశ్వరుండు. 121

మాలిని.

కదలు లొదవు భ్రూ భంగమ్మునం దుల్కలూగన్
చెదరు లొదుగు చూపుంజీలికల్ వాలికల్లాన్
పదము లదుము నేలన్ పాంసుజాలమ్ము రేగన్
కదిసి సదన మాలింగాంచి గర్జద్గళుండై. 122

కం. ఏమే విన్నావా యిది
నీ ముద్దుల చిన్నకొడుకు నిర్వాహ మ్మా
ర్యామహితవరము లేమని
యీ మందుని తెలివితేట లేమని మగువా! 123

సీ. వాడు పోలంరాజువారి బిడ్డడు బుద్ధి
చుఱుకులోపల కొండమిరపకాయ!
వాడు వేమావారి బాలు డెక్కాలలో
చికిలిచేసినయట్టి చిక్కటారి!
వాడు గంటావారి పాపండు పద్యాలు
పఠియించు నొడుపులో పాపరమ్ము!
వా డీదరాన్వయపర్థి వాచకపాఠ
పాటవమ్మందు నాగేటి కఱ్ఱు!

వారి నటులుంచు మన పెద్దవాడయిన న
దాశివుని చూడు మెంత విద్యాప్రవణుడొ !
వీని నింకను నోనమాలైన రాని
మలప నేమని కంటివే మాన్యురాల! 124

కం. అలబరి మూకల పలుకుల
ములుకులు నోనాటి యట్లు పోవగవీథిన్
తల కొట్టివేసినట్లై
తలకాడెద నింత యెల్లిదపుబ్రదుకగునే. 125

మ. బగళా తామసయంత్రయంత్రితముగా భక్తాళికిన్ మిక్కిలిం
బెగడౌ పార్వతి శుద్ధసాత్త్వికమహోవిస్ఫూర్తి దీపింప న
బ్బగళా యంత్రము దీసి పుష్కరిణిలో వైపించి శ్రీచక్రమున్
దగ నచ్చోట ప్రతిష్ఠ సర్వజనసన్మాన్యమ్ముగా చేసితిన్. 126

శా. అంబాభక్తిని మించితిన్ క్రతువు పంచాగ్ని ప్రయుక్తమ్ముగా
సంబాళించితి నిప్డు సర్వకవితాసారావతారమ్ముగా
జంబూభారతమున్ రచింతు గదె నా జన్మమ్మిటుల్ వమ్ముగా
తుంబీశాకపు చచ్చుపాకమటు లీతుచ్ఛుండు నా కబ్బునే. 127

ఉత్సాహ.
అమ్మ తన్ను కొల్చువారి నాదుకొను నటంచు లో
నమ్మియుండ నొక్క మాయనాటకమ్ము పన్ని వీ
సమ్ముగాని తెలివిలేని చవట నంటగట్టి మా
యమ్మ నా యెడంద నిట్టు లంకుశమ్ము దించునే. 128

తే.గీ. అక్షరము నేడు రానివా డౌనొ రేపు
పండితుం డోనమాల్‌రాని పరమశుంఠ
బుద్ధిగన శత్రుడౌగాక పుత్రుడగునొ
చెప్పు వేమూరివారింటి చిన్నదాన. 129

తే.గీ. కలికిరో ! వీని వట్టి యాకారపుష్టి
కట్టివేసె నీమతి వీని పొట్టపొడిచి
కంచుకాగడావేసి గాలించి చూడు
కాంచనగునేమొ యొక్క యక్షరపుముక్క. 130

తే.గీ. భరితవైదుషీకీర్తిప్రభాసమైన
కులము పొనుపడుగదవె యీ కుంకవలన
వీడు కొడుకేమిటే ప్రాజ్ఞి వీని తాడు
తంబళుల గుంట యొడ్డున తడిపి తెంచ.. 131

కం. అని చిఱ్ఱురేగు పెనిమిటి
మనోవికారమ్ము కన్నమమతయు మదిలో
పెనగొన ననునయభంగీ
స్వనాతిమృదుమధురఫణితి సతి పతితోడన్. 132

శా. కోపమ్మింతగ పెంచనేల కరుణాకోటీర వీడింతకున్
కౌపీనమ్మును చక్కదిద్దుకొనుటే కానండు వాత్సల్య ల
క్ష్మీ పుణ్యామృతధార నీకొడుకుపై చిందింపు మేపుట్టలో
నే పామో యెవరేమెఱుంగుదురు నా యీవాక్య మాలింపవే. 133

తరువోజ.

అనుచుండ తూగాడు నాతోకగోచి
నంటిన యంత్రెంత లవి పాపుకొనుచు
తనువునిండినధూళి తనుఘర్మవారి
దడిసి యుప్పారియు చందమ్ము తోపింప
మొనయుగాలికి మోము ముంగురుల్గప్ప
మునిముని చీకట్లు ముసరెడి వేళ
ననఘుండు పంచాగ్ని యరుదెంచి జనని
యాడిన చివరి వాక్యమ్ము నాలించి. 134

మధ్యాక్కర.

పుట్టలో లేదమ్మ పాము లేదమ్మ బుట్టలోపలను
నిట్టనిటారుగా కొండకైవడి నిక్కిన చెరువు
కట్ట తూర్పున చింతతోపుచెంతను కల పెద్ద రాతి
పెట్టెలోపల చేరి యాడుచున్నది పిల్లితోకలసి. 135

మధ్యాక్కర.

ఓనమాలను దిద్దబెట్టి యయ్యవా వారొక్కటే కునుకు
గా నదేసం దుడాయించి యొఱచింతకాయలు కోయ
పూనుదునో లేదొ పాము వే బుస్సు బుస్సంచు వచ్చి
మానుగా పిల్లియు వెంటనే మ్యావు మ్యావంచు వచ్చి. 136

మధ్యాక్కర.

చెట్టెక్కు కిటుకు నీ కేమితెలియురా చిన్నారి! ముందు
పట్టు చిక్కించుకోవలయు చెట్టెక్కు వారికి మమ్మ
పట్టుకొ మ్మామపట్టు చిక్కునని చెప్పు పాము నను పిల్లిఁ
బట్టబో నవియు తప్పించుకొనిపోయి పడుపెట్టెలోన. 137

కం. అని జననితోడ నాడెడు
తనయుని వాక్యములు వినుచు ధరణిసురుడు మే
నను తేళ్లు జెఱ్ఱులును ప్రా
కిన యట్లై బిట్టు కంటగించుచు మదిలోన్. 139

తే.గీ. బళిబళీ పుట్టుపిచ్చి యంబ్రహ్మ జనని
పాముతో నాడుకొను నంట్లపక్షిమాత
కుత్సిత బిడాలరాజ సుహృత్సవిత్రి
కడుపు నిండెను పొమ్మ నీ కొడుకు నుడుల 140

మహాస్రగ్ధర.

కొరడాజళిపించినట్టుల్ కులపతి నిటు లాక్రోష్టరై పల్కి యజ్ఞే
శ్వరు డంత న్నింగి నెత్తై మసకొనిన యమర్షంపు నిశ్రేణి యందున్
చరమమ్మౌ మెట్టుమీదన్ చటుల కుటిల సంస్థానుడై పుత్రువంకన్
కొరకచ్చుల్ రెచ్చు చూడ్కుల్ కురియుచు పలికెన్ క్రూరనారాచవాక్కుల్
141

తే.గీ. ఓరి వైదికాచార కుఠారధార
రక్తతింత్రిణీఫల దురాసక్త జిహ్వ
క్షుద్రదేవతా పూజా దరిద్రభూమి
మత్పురాకృత పాప జంబాలరాశి. 142

కం. చెడబుట్టినావురా నా
కడుపున భీ వంశనాపకా యెందైనన్
పడి చావరాదురా విఱ
గడయౌ నీపీడ మాకు కలుష విచారా. 143

ఆ.వె. కటములదర పండ్లు పటపటమన ముక్కు
పుటము లెగయ మొగము మటమటలుగ
కనులు చిటచిటలుగ గాత్రమ్ము తటతట
లాడ నిట్టురేగు నాత్మవిభుని. 144

శా. శూలాగ్రాతినిశాత నిష్ఠుర పదాస్ఫోటమ్ములన్ కర్ణముల్
వ్రీల న్వత్సలతాపరిస్ఫురిత మాతృస్వాంత ముద్వేల క
ల్లోలక్షోభిత శోకసాగరముగా లోలాక్షి యో నిర్దయా
వాలా యేమిది యిట్లు పెట్టినవి నీ వాజశ్రవోవైఖరుల్. 145

తే.గీ. మాతృకాసత్కృపాప్తి నమంగలమ్ము
ప్రతిహతమ్మగుగాక నా పట్టియెడల
నల్ల నచికేతునట్లు వీ డరయుగాత
తండ్రి శాపమ్మునం దమృతత్వ సిద్ధి. 146

కం. అని తనయు హత్తుకొని ఈ
మ్మున నిమురుచుమేను మూర్ధమున్ తడిపె న్వే
చ్ఛని బాష్ప సుధాధారల
జననీ స్తనయిత్ను వొక నిషాదపునవ్వై. 147

సీ. యజ్ఞేశ్వరుని యహంతావేశితాధ్వమ్ము
కలరూపు మాయ కజ్జలము పులిమి
తద్ధర్మపత్ని వాత్సల్య హృత్సరసిఁ దాపుల
నీలకజ్జలమ్ములను లేపి
పగలుగ్రుడ్డి కబోదిపక్షి రెక్కలు విప్ప
నయనమ్ములకు రసాంజనముపెట్టి
ప్రజ్ఞాన ముద్ర విస్పష్టమ్ముగా
పాము పడగనిండుగ మషీ పంకమలది

చదలు క్రమ్మిన మబ్బు మార్జాలమునకు
కన్నులుగ నొండు రెండు చుక్కలు మిగిల్చి
రంగు గర్భితమగు కాలరాత్రి మాయ
పొదిలెపై కాఱుచీకటి కదను త్రొక్కె. 148

మాలిని.
ముదురుటిరుల ద్యావాభూమి లేకమ్ముగాగన్
పొదిలె జగతి నిద్రాముద్రితమ్మైన వేళన్
కదలె భువనరక్షాగాథకారుణ్యమై య
ప్పొదిలె జనని జాగ్రత్పూర్ణ సంచార కేళిన్. 149

మహాస్రగ్ధర.

బలిమిన్ దుర్వార సంరంభమున పొదిలెపై పైకొనం దుష్టశక్తుల్
పొలిమేరల్‌దాట నెప్డబ్బునొయను తివుటన్ పొంచియుండంగ
జ్వలన జ్వాలా ప్రతాపచ్ఛట విలయసముచ్చండ భీష్మమ్ముగా న
చ్చలమారన్ మాడ్చెవానిన్ సకలజనని స్వచ్ఛంద సంచారకేళిన్. 150

తే.గీ. చెరువుకట్టలు మోడలు జెముడుపొదలు
క్రంతలును రాజమార్గముల్ పుంతలును హు
షారుగా చూచుకొని వేగుజామునందు
తిరిగి నిజనివాసమున కేతెంచి జనని. 151

కం. వాకిలి కడ్డమ్ముగ ని
ద్రాకీలితుడై లలాట రంగమ్ము ప్రశాం
తైకాగ్ర భక్తిమకరం
దౌకమ్ముగ నేల పండియున్న కుమారున్. 152

చం. అరసి మనమ్మునందొలయు హర్షము పైకుబుకంగనీక కన్
తెరువుల విస్ఫులింగములు దీటుకొనం భ్రుకుటీప్రయుక్త భీ
కర నటదాస్యవీథి లయకాల వలాహకముల్ చరింప ని
ష్ఠురతర హృద్విదారణపటుస్వరతర్జదుదగ్ర గర్జనైః 153

శా. నారమ్మెక్కడలేదు పండితివిటుల్వాడాది కడ్డమ్ముగా
నోరీడింభక జీవితమ్ముపయి లేదోతీపి వీక్షించి యీ
ఘోరాకారము గుండె యెవ్వనికి సాగున్ పిండిరైయినావు వో
రా రక్షోబలగాత్రఘట్టనసమర్థమ్మైన మత్పాద్ధతిన్. 154

కం. అని ధరణీమండల ఘూ
ర్ణనమ్ముగా ప్రళయమేఘరంహస్తనిత
ధ్వని హుంకరించు జననిన్
కని యబ్బాలుండు కుదురుగా నిట్లనియెన్. 155

మధ్యాక్కర.
పాము చెప్పెను పిల్లి చెప్పెనమ్మ నీపద్ధతి నాకు
నీ మోహనాంఘ్రినీరేజ నిస్సీమ నృత్యరంగమ్ము
శ్రీమహాదేవుడేనాడొ చెప్పనేచెప్పె త్యక్తత్ర
యీమార్గు లానిశాచరులమాట నాకెందుకే తల్లి. 156

మధ్యాక్కర.
ఎంతఘోరాకారమైననేమి ధరింపుము వీస
మంతైన బెదరు లేదమ్మ నా యంతరంగమం దంత
కాంతకదేవీ త్వదీయ కారుణికాకారరేఖ
వింతగా నాస్వాంతమం దెటులు తాండవించునో చూడు. 157

మధ్యాక్కర.
ఎండైనపడి చావరాద యని విసుగెత్తి మద్గురుడు
నందిట్టె నక్షరజ్ఞానశూన్య మీ నాబ్రదుకింక
నెందుకంచును రోసి తల్లి భవదీయ హృద్యపాదార
విందసన్నిధిఁ గడతేరగానెంచి వే వచ్చినాడ. 158

మధ్యాక్కర.

ఖలరంగమున వృషభముల గిట్టల కసిబిసి యయ్యు
నిలువెల్ల నిచ్చోట నమృతమూర్తివై నెలకొన్నతల్లి
చలమాన వలమాన దివ్యతాండవ చరణ ఘట్టనల
నలువవే నన్ను నాపీడలేకుండ నాతండ్రి కింక. 159

కం. దేవీ గర్జా నిపత
ద్ధ్రావధ్వని లేచి లేవకయె దిటముగ నే
దోవేదాంతము చదివెడు
నా వత్సుని తొక్కుపల్కు లాలించినదై. 160

శా. భుగ్నభ్రూకుటి వీడి ఫాలతల మింపుల్గుల్క సామర్ష నే
త్రాగ్నిజ్వాలలు చంద్రశీతలములై యంకింప నుద్యద్దయా
మగ్నార్ద్రీకృత మందమందమృదువా జ్మాధుర్యమై యోరి పం
చాగ్నీ నీవటరా కుమార యనుచున్ సానంద సౌమ్యాకృతిన్. 161

తే.గీ. ముగ్ధుడా మత్పదాఘాతములకు నొగ్గి
పిప్పికానెంచినావురా పిచ్చితండ్రి
లేవరా లేవరా చిరంజీవి సకల
జన పనాయితవిద్యా ప్రశస్తకీర్తి. 162

తే.గీ. వాడు నీతండ్రి క్షుద్రదేవతగ నన్ను
తలచు వాని యహమ్మతి తలగు కొరకు
పడవలసివచ్చె నీకిట్లు పసితనాన
బాధ లోరి పంచాగ్నుల వంశకర్త. 163

తే.గీ. వాని యవినయముల నింత పడితి వీవు
కార్యకారణ సంబంధగతులు తెలియ
నెన్నరాని యీ లోకమందున్నదె గద
యొకడు చేసిన తప్పున కొకడు పడుట. 164

కం. అని పొదిలె తల్లి పంచా
గ్నిని లేవందీసి సర్వగీర్విద్యాత
క్షణదాన మహా మహిమము
తన దక్షిణ కరము వాని తలపై నుంచెన్. 165

మ. సకలజ్ఞానకవాటపాటనవిధా సామర్థ్య మా హస్తమ
స్తకసంయోగముచేత నాభికుహరద్వారోద్ధమోపాయ నం
దకసంపన్న వికాస మక్షరసమామ్నాయమ్ము జ్యాముక్త సా
యకవేగోద్ధతి కంఠమున్మిగిలి జిహ్వాగ్రమ్మునం దాడగన్. 166

కం. పంచాగ్ని కృతకజడతా
చంచాదహదగ్ని పొదిలె జననికి నతిగా
వించి నిబద్ధాంజలియై
ప్రాంచితగతి నామె నిట్లు ప్రస్తుతి చేసెన్. 167

మధ్యాక్కర.

శ్రీమత్సదాశివ మంచకస్థిత చిత్కళా కళిక
శ్రీమాధవ ప్రియ సోదరీ దయాశేవధీ నిత్య
కామేశ్వ రాంచిత ప్రేమకంచుకకాంత్యుజ్జ్వలాంగి
కామేశ్వరీ మన్మనోగత స్నిగ్ధకల్యాణమూర్తి. 168

వసంతతిలక.

బ్రహ్మాచ్యుతేశ సురరాజ సమర్చితాంఘ్రీ
బ్రహ్మాండ భాండ పరిరక్షణ మూలశక్తీ
జిహ్మాధ్వసంచరణశీల సమస్తజంతు
బ్రహ్మాధ్వగామి పరివర్తనకార్యభారా. 169

మాలిని.

సురుచిరతరగాత్రా సూర్యచంద్రాగ్నినేత్రా
పరమశుచివిలాసావర్తమగ్నాంగజారీ
నిరతిశయదయా నిర్ఛిద్ర సంచారకేళీ
భరిత నిఖిలధాత్రీ భద్రభావాభిరామా. 170

పృధ్వీ.మసార తరళేక్షణా మధురమందహాస ద్యుతి
ప్రసారఘుసృణాయిత ప్రథమపాల చేతోంగణా
అసద్విషయసంతతవ్యసనయంత్రితాజ్ఞప్రజా
గ్రసిష్ణుతిమిరాపహాస్ఖలితకంజబంధు ప్రభా. 171

మేఘవిస్ఫూర్జితము.

నమస్తే మాయానిర్దళన పరమజ్ఞాన విజ్ఞాన హేతీ
నమస్తే సర్వాంతఃకరణవసదానంద సౌందర్యమూర్తీ
నమస్తే వీక్షా మాత్ర నిశరణ సోన్మత్త రక్షస్సమూహీ
నమస్తే కళ్యాణీ సకలజనతానంద నాశ్చర్యవాణీ. 172

కం. ఆప్రస్తుతి విని యత్యం
తప్రీతిఁ గుమారుఁ బొదిలె తల్లి నిమిరి మే
నప్రతిమకారుణికవీ
క్షా ప్రభ లాశాంతమల్లికమ్ముల రేపన్. 173

శా. అంతర్ధానము చెందె పిల్లియునుపా మంతంతతోతెంచి నీ
చింతల్ వో నమృతాప్రగర్భిత మహోచించాఫల స్వాదనా
సంతానందుడవైతి పొమ్మనుచు పంచాగ్నిన్ ప్రశంసించి దే
వ్యంతర్గేహము దూఱె పూర్వదిశ తెల్లవారా నపూర్వమ్ముగన్. 174

సీ. ముసలిచీకట్లనల్లులు చీల్చి ప్రసరించు
పిల్లి కన్నుల కాంతివెల్లువలన
ప్రజ్ఞాస్వరూపమ్ము పాము తూరుపుకొండ
గుండ్లరాపిడి నూడ్చు కుబుసములన
యజ్ఞేశ్వరుని యహంతాంబరశుద్ధికౌ
చౌడుసున్నపునీటిచాటికలన
తద్ధర్మపత్ని హృత్సరసినొద్గొరయు స
మ్మోదవీచీ ఫేనపుంజములన

తల్లి ముడివిప్ప నాభికందరమునుండి
యాగకుబికెడు పంచాగ్ని యచ్చతెల్వి
యోనమాలన ప్రాగ్దిశా యోజితములు
తెలివెలుగురేక లూర్పిపై మలయునేళ. 175

కం సకలజనలోచనానం
దకరుడు జననీజనక హృదయపద్మవికా
సకరు డుదయమార్తాండ
ప్రకారు డింటికిని మఱలె పంచాగ్నివెసన్. 176

## బ్రహ్మ విష్ణు మహేశ్వరులకథ

చం. అతడుపనీతుడై యధిగతాఖిల కావ్య పురాణ శాస్త్ర సం
గతుడయి సంతతాధ్యయనకర్మఠుడై బుధలోకమాన్యుడై
యతిశయవాదకౌశలపరాస్తవిపశ్చిదనేకుడై జయో
ద్ధతుడయి కీర్తికేతువుల తన్కెను రాజసభాంతరమ్ములన్. 177

తే.గీ. యజ్ఞదీక్షితుడై సోమయాజియైన
వానిపేర పంచాగ్నుల వంశమైన
తత్కులము పరాశక్తి వాత్సల్యనిత్య
ధామమై భూమిఁ దామరతంప మయ్యె. 178

మ. ఆమలోదారవదాన్యతాపరిణతప్రారంభులై పేర్చు రె
డ్డి మహీనాయకు లాదరమ్ము మెయి దొండ్లేరగ్రహారప్రదా
నమున న్మానితుజేయ నొక్కఘును నంత న్వంశపారంపరీ
స్వము పంచాగ్నులవారి కయ్యె నది శశ్వద్భోగసంపత్తియై. 179

తే.గీ. ఇట్లు కొంతకాలమ్ముపో కృష్ణరాయ
లేలుబడి వచ్చి పరమదుశ్శీలుడైన
యొక్కయధికారి దౌర్జన్య మొడ్డువిఱిగి
వారిచేతులనుండి దొండ్లేరు జాఱె. 180

కం. ఆ వంశమ్ముల నప్పుడు
మూవురు సోదరులు వారు మొనసిరి తద్దు
ర్భావుని దౌశ్చర్యోదధి
నేవిధినైనన్ తరింప కృతనిశ్చయులై. 181

సీ. చెడినహక్కును పునస్స్పృష్టించు యోజనా
భూమి మార్కండేయ సోమయాజి
తన్నిరంతరరక్షతర్కించు తాత్పర్య
సీమ సదాశివసోమయాజి
అగ్రహారచ్యుతియగునే యటం చుగ్రు
డయిన యజ్ఞేశ్వరచయను లనఘు
లా త్రిమూర్తులు దుర్ణయాధికారికృతావ
మానచింతోద్విగ్నమానమతులు

మూరురాయరగండ పెండారధారి
యైన శ్రీకృష్ణదేవరాయ క్షితీంద్రు
సమ్ముఖమ్మున విజ్ఞాపనమ్మొనర్ప
కదలిపోయిరి విద్యానగరముచేర. 182

కం. చేరి మహీజాని సభా
గారము చొరబాఱువేళ గ్రక్కున వారిన్
వారించెం ద్వాఃస్థుం డె
వ్వారలు మీ రిచట నేమిపని మీ కనుచున్. 183

తే.గీ. అంత వారు వానికి క్షమాకాంతుతోడ
బ్రహ్మవిష్ణుమహేశ్వరుల్ వచ్చిరనుచు
చెప్పుమని చెప్పగా పోయిచెప్ప వాడు
సంభ్రమాశ్చర్యనిలయమై జనవిభుండు. 184

కం. అప్పాజీ ననుమోదము
చిప్పిలు చూడ్కులను చూడ చెచ్చెర వారిన్
రప్పించె మంత్రిమణి కను
విప్పుల చిఱునవ్వుతేనె విరియంబాఱన్. 185

తే.గీ. పులుముకొన్న విబూదినెమ్మోములందు
బ్రహ్మవర్చస్సు తాండవింపంగ వచ్చి
కోవిదాంక గంభీర వాగ్గుంఫనముల
వారు సార్వభౌముని కూర్చి పలికిరిట్లు. 180

సీ. స్వస్త్యస్తు విశ్వవిశ్వంభరా ధారణో
ద్ధామ దక్షిణభుజా స్తంభ నీకు
విజయోస్తు సకలపృథ్వీపాల మస్తక
న్యస్త ప్రశ స్తపాదాబ్జ నీకు
శ్రీరస్తు ప్రాక్ప్రతీచీ సముద్రాంతస్థ
నాయకార్పిత భాగధేయ నీకు
నిర్విఘ్నమస్తు వాణీప్రసాదాపూర్వ
కవితా మహాచమత్కారి నీకు

నిత్యకల్యాణమస్తు మానితబుధాగ్ర
హార సంతతనహనశోభాఢ్య కంధ
రా వినమ్ర కర్ణాటసామ్రాజ్య పద్మి
నీ వికస్వర హృదయాధినేత నీకు. 187

ఆ.వె. పొదిలెసీమ మాది భూవరా యచట దొం
డ్లేరు రెడ్డిరాజు లీయ నగ్ర
హారమొకడు నీదు నధికారి యిప్పు డ
న్యాయశీలి దాని కడ్డుతగిలె. 188

ఉ. ఓ సముదారధర్మచరణోజ్జ్వలమార్గవిధాయి సేవకుల్
చేసిన పాపకృత్యములు చెందుగదే యజమాను నిప్పుడీ
మోసము నిన్ను పొందుటకు ముట్టిన చింత గలంగు బుద్ధితో
ధీనముపేత వచ్చితిమి దేవరకింతయు విన్నవింపగన్. 189

సీ. అంబాకృపామృత ప్రాప్తరూపుండైన
పంచాగ్నివంశ సంభవులమేము
వైదికాచార ప్రవర్తనాభ్యుదయమ్ము
వెన్నతోపెట్టిన విద్యమాకు
కావ్యనాటకముఖాగ్రశ్రేణి సాహితీ
పరిచయమ్మునకు లోపమ్ము లేదు
కరతలామలకముల్ ధరణీశ మాకు శ్రౌ
తస్మార్త కర్మతంత్రమ్ములెల్ల

నగ్రహారవిహీనులమైన మాకు
సప్తసంతాన సుప్రతిష్ఠాయశస్వి
వైన నీదు దర్శనభాగ్యమబ్బె యిపుడు
రాజదేవేంద్ర మావిచారమ్ము తీఱె. 190

ఉ. ఆ వచనప్రపంచమున కాసభవారనుమోదపూర్ణ సం
భావనలై మనమ్ములు సెబాసని మెచ్చులు క్రుమ్మరించి ర
మ్మ్మావురపై ధరాభరణ భూరిభరాత్త గభీరతా ముఖ
శ్రీవిరియన్ సహాసమృదు శీతలరేఖల సార్వభౌముడున్. 191

కం. ఆముక్తమాల్యదా న
వ్యామోదము శాశ్వతముగ నాశీర్వాద
శ్రీమంతమొనర్చితి ర
త్యామోదమ్మయ్యెమాకు నవనీదేవుల్. 192

చం. అని సెలవీయగా సభికులందఱు భూరిజయస్వనమ్ముల
న్వినుతులువెట్టి రయ్యవనినేతకు సర్వశిరఃప్రధానుడు
క్తినలువ యుక్తిగీష్పతి ప్రతీతచరిత్రుడు వృద్ధమూర్తి స
జ్జనహితుడైన తిమ్మరుసు సాకతమొప్పగ వారి కిట్లనెన్. 193

తే.గీ. భృత్యుపాపమ్ము తత్స్వామి కెక్కునంచు
చెప్పి మీయనుభవము మేల్ చేసినార
లీ విశాల సామ్రాజ్యమం దిట్టిభృత్యు
లరయ నిక నెందరో కదా యందువలన. 194

కం. సర్వప్రాయశ్చిత్త
మ్మర్వీజాని తలపెట్టియున్నా డుర్వీ
గీర్వాణులు రేపే త
త్పర్వము తిలకింప మీరు దయసేయవలెన్. 195

తే.గీ. అవ్వచస్సుల కానందమందు రాజ
మౌళియనుమతిమీద నమ్మంత్రిమౌళి
నాటికాసభచాలించె నాటిరేయి
నగ్రజన్ముండు సాలోచనాత్మకుండు. 196

తే.గీ. తమ్ముదోయినిగూర్చి కర్తవ్యశీలి
ధరణినాథునాస్థాని విద్వత్ప్రకాండ
మయు మగాథము మంత్రిమనము రేపు
మనకిది పరీక్షయనుకొందు ననినయంత. 197

తే.గీ. అట్టిదేదియో కావచ్చునని ద్వితీయు
డపుడు మూడవవా డభయప్రదాత్రి
మాతృకాసత్కృపాప్లావమతుల కేమి
భయము రేపటికథ నాకు వదలుడనియె. 198

కం. మఱునాడు తుంగభద్రా
పరాపగా చక్రతీర్థపావనభువి నం
దఱు కూడబడిరి ధరణీ
వరాహువేష్టించి కుతుకభరితస్వాంతుల్. 199

మ. పనితప్రజ్ఞు డమాత్యలోకమణి యప్పాజీ సమావిష్ట వి
ప్రనికాయమ్ముమను చూచి యిప్డుధరణీపాలుండు సర్వాఘ నా
శనదక్షాద్భుత సత్క్రియాచరణ దీక్షాబద్ధుడైనాడు తె
ప్పున మీలో నొకవేత్త పూనుకొని చెప్పుంగాక సంకల్పమున్. 200

కం. అనియడుగ నొకరినొక్కరు
కనుగీటుచు తలలనడ్డుగా త్రిప్పుచు మా
కునురాదు మాకురాదని
పనిగా నదియేమొ వంతపాడిరి వారల్. 201

ఆ.వె. అంత మంత్రిచూడ నా త్రిమూర్తులవంక
వారిలోన పెద్దవాడు లేచి
విబుధులంద ఱిచట విబుధగురూపముల్
మా యదృష్ట మింత మంచిదగునె. 202

తే.గీ. బెస్తలందున పెద్దయు విప్రులందు
పిన్న యన్న యాభాణకమ్మన్నదెగద
విన్ననువు చెంగలింప మా పిన్నవాడు
పూనుకొనె నిష్ఠ సంకల్పమునకు ననియె. 203

మ. క్రమబద్ధాంచితశబ్దసౌష్ఠవమునన్ కాసంతయున్ పొల్లుపో
వమిగా కంఠరవమ్ము త త్తదుచితవ్యాపృత్త్యుదాత్తానుదా
దాత్తమనోజ్ఞస్వరితప్రపంచితముగా తద్జ్ఞుండు యజ్ఞేశ్వరుం
డమలోత్సాహుడు చెప్పె నెల్లరకు నాహోపుట్ట సంకల్పమున్. 204

ద్విపద. అంతట సశాస్త్రోక్తమై ప్రవర్తిల్లి
సాంతమ్ముగాగ నా సత్క్రియాకాండ
వండినమతి యిట్లువల్కె మంత్రిప్ర
కాండు డా సిద్ధసంకల్పులగూర్చి. 205

ఉ. మెచ్చె రసాధినాయకు డమేయగుణాకరులార మీ విప
శ్చిచ్చరితమ్ము సమ్మదవశీకృతమానవపంకజుండు మీ
కిచ్చెను పాపజాతియగు భృత్యుని దుర్దయతాపథమ్ము కో
ల్పుచ్చిన యగ్రహారమును పూర్వవిధానవిధిప్రకారమున్. 206

కం. ఏ నృపుడో యిచ్చిన య
ద్దానిన్ పునరుద్ధరింప తానిచ్చిన య
ట్లానో తానైయిచ్చెన్
మా నృపశేఖరుడు మీకు మఱి నైయిదూళ్ళన్. 207

తే.గీ. ఓ మహేశ్వర యో బ్రహ్మ యోయివిష్ణు
మిమ్ము మమ్మును సకలజగమ్ము నేలు
నప్పరాశక్తి కరుణామయావలోక
ఘృష్టి విశ్వకల్యాణ పారీణమగుత. 208

మధ్యాక్కర.
ఆ మంత్రిశేఖరు ప్రౌఢవాక్యవిన్యాసవైఖరికి
సామోద హృదయుండు రాజశేఖరుం డతి ముగ్ధుడయ్యె
నామూవు రాఱూళ్లబరువుతో నింటికై వే మఱలిరి
శ్రీమాతృచరణాందుకమ్ము లాత్మల చిఱుమ్రోతలీన. 209

మంగళమహాశ్రీ.
శ్రీమహితచక్రమయ చిన్మధురరూపిణి కశేష భవభీతజనతా చిం
తామణికి విశ్వభయద ప్రబలపాశవిక దౌష్ట్యపద దైత్య మదనాగో
ద్దామసృణి కభ్యుదయితైజన వినాశకవిధానసముదగ్రబహుళాంధ్ర
స్తోమఘృణికత్యయవిధూనిత విపన్న జనతోషణికి మంగళమహాశ్రీ. 210

మ. అతులోదారచమత్కృతిప్రణిహితవ్యాహారగంగాఝురీ
సతతాపూర్ణమనస్తటాకవికసత్సంతోషవీచ్యుజ్జ్వల
న్మతిమల్లోక పురాతనాంధ్రకవితామర్మజ్ఞ ప్రజ్ఞాసమ
న్వితనవ్యాంధ్రమహాకవిప్రవరసుస్నేహప్రమోదాకృతీ. 211

కం. మిత్రహృదయాబ్జమిత్రా
క్షేత్రజ్ఞపవిత్రగోత్ర శ్రితజనవాంఛా
సత్ర సమస్తాభ్యాగత
సత్రాయిత నిజగృహప్రశస్తచరిత్రా. 212

మాలిని.
శితమతి దివిజేజ్యా సిద్ధపద్మేక్షణేజ్యా
మితహితఋతభాషీ మిత్రసౌఖ్యాభిలాషీ
వితతవినయభావాన్వీత నైజానుజన్మ
త్రితయ సతతసేవా తృప్తిమ న్నవ్యరామా. 213

నాయని సుబ్బారాయ క
వీయ మీమ్మజన్మభూమి నిది విశ్వ
శ్రేయస పరమాద్భుతగా
ధాయతనము శక్తిఖండమందముచిందున్. 214

----- 0 -----

# శివఖండము

శ్రీనిర్మ మేశచరణ
ధ్యానామృతపూరితాంతరంగగభీరా
జ్ఞానావధి నత్సంప
ద్ధానోపనిషద్రహస్య తత్వవిచారా. 1

## నిర్మమేశ్వరదేవస్థానము

తే.గీ. అవధరింపుము పొదిలె దేవాలయముల
కెల్ల తలమానికము నిర్మమేశునగరు
మన కుమారదశాముగ్ధమధుర కేళి
కావ్యయానందములకెల్ల నాటపట్టు. 2

శా. ఉండెంగా ప్రథమమ్ము నన్ పొదిలెయం దుగ్రుండు కైలాస నా
థుండై తద్వసనమ్ముతో తనివిలేదోకాక శ్రీనిర్మమే
శుండై పర్వతకన్యకాసహిత మచ్చో వెండియు న్నిల్వగా
ఖండేందూద్వహు డేమనన్ పొదిలెభాగ్య మ్మిద్ధరామండలిన్. 3

తే.గీ. ఎంతసక్తు డన్నేలపై నంతతోడ
తృప్తిచెందడ త్రిపథగాపృక్తమౌళి
యేచి భీమేశ్వరుడు నగరేశ్వరుండు
నై రహివహించె నచట శీతాంశుమౌళి. 4

మ. ఒకడై యుండియు నాల్గురూపముల నధ్యాఢుండు భాసింపగా
ప్రకటోత్తుంగసమీహితైకవరణవ్యావృత్తముల్ తూరుపున్
మొకముల్ సోత్తరదక్షిణక్రమములై పొల్పొందు ప్రాసాద నా
యకముల్ నాలుగు భక్తలోకనయనాహ్లాదమ్ములై యచ్చటన్. 5

శా. ప్రాకారమ్మున బోరుతల్పుల మహాద్వారమ్ము ప్రాచీదిశన్
శ్రీకంఠోత్సవ వాసరమ్ములు వినా నిద్రించుచుండన్ సదా
ప్రాకారమ్మున దిడ్డి దక్షిణ దిశన్ వర్తిల్లు చైతన్యని
త్యాకీర్ణమ్ముగ సర్వభక్తజన యాతాయాత సంరంభమై. 6

తే.గీ. ప్రహరిలోవైపునంటి వైశ్రవణుని దిశ
శిఖిదిశ నశ్మవేశ్మముల్ చెలగు వాన
కొన్ని చిల్లర యంగడి కొట్లు గాగ
మిగిలినవియెల్ల శాలలై నెగడు నందు. 7

ఆ.వె. ఒకటి యాగశాల యొక్కటి యుగ్రాణ
మొకటి పాకశాల యొకటి భోజ
నముల శాల యొకటి నలువైన వాహన
శాల మందుగుండుశాల యొకటి. 8

## నగరేశ్వరాలయము

ఆ.వె. ఊరిమధ్య పేటనున్న వైశ్యుల కెల్ల
నిష్టదైవము నగరేశ్వరుండు
ఊరి తూరుపుమొగ నుండెబో మొదట స
ర్వస్వతంత్రుడై పరాత్పరుండు. 9

తే.గీ. కాలవశమున నొకనాడు కాంచె పొదిలె
సీమయును ముసల్మానుల స్వామికమ్ము
నన్యధర్మవ్యవచ్ఛేదనాతిలోల
మానసుడు పాలకుడు మతోన్మత్తు డొకడు. 10

మ. పడగొట్టించి సమత్సరుండు నగరస్వామీడితాగార మ
య్యెడ గట్టించె మసీదొకండు తనవా రెంతేనియు న్సంబరం
పడ నైకాభిధుడయ్యు నొక్కపాడవై వర్తిల్లు నేకేశుడున్
వడకన్నొత్తడ సుంత నూత్నవిభుతా ప్రాబల్య సమ్మోహమో! 11

ఆ.వె. నిలువనీడలేక నిఖిలలోకైకనా
థుం డనాథవోలె బెండువడియె
నకట యింతమంది మాయన భక్తుల
ముండి యొట్టులూరకుండుటంచు. 12

మ. అభిమానించి కిరాట శేఖరులు నవ్యావాసనిర్మాణ మ
త్యభిరామమ్ముగ నిర్మేశ్వరుని దివ్యాగారసాలాంతరా
ళభువిన్ తీర్చి ప్రతిష్ఠచేసిరట లాలాట్యక్షినిర్దగ్ధ భా
వభవున్ శ్రీనగరేశ్వరున్ త్రిజగతీభద్రంకరున్ శంకరున్. 13

శా. కామాక్షీ హృదయేశు డాతవి కృపాగంగార్ద్రమై యూరు కాం
చీమాహాత్మ్యము సంతరించుకొనగా శ్రీనిర్మమేశాలయ
క్షేమస్థానమునందు దిడ్డికిని కించి ద్దూరమై యాత డెం
తేమోదమ్మునునుండు మాటికిని ప్రాయిక్కన్ కటాక్షించుచున్. 14

భీమేశ్వరాలయము

ఉ. శ్రీనగరేశ్వరాలయముచెంత నుదీచ్యధరా ప్రదేశమం
దానమదింద్రముఖ్యకలామరమస్తకిరీటరత్నపా
ళీనిచితాంశుపుంజశబలీకృతపాదుడు భక్తలోకసం
తానము భీమనాయకుని ధామము పొల్చు జనాభిరామమే. 15

తే.గీ. భీమనాథుండు త్రిజగతీభీప్రదుండు
పరమసాత్వికభావ విస్ఫారు డచట
నిట్టులగు కొట్టులందురో యిట్టులగుట
పొదిలె సత్వధాత్రీసమభ్యుదయమహిమ. 16

తే.గీ త్రిపురసంహరు డాతండు త్రిపురసుంద
రీసముల్లోక శోభాపహృతహృదయుడు
ప్రణయినీ రాగరస సమాప్లావమూర్తి
త్రిపురవనసదాశివదీప్తి యచట. 17

తే.గీ. చిల్మకూరగ్రహార మిచ్చిరట పూర్వ
మెవరొ కైలాసనాథ భీమేశ్వరులకు
నా శిలాశాసనస్తంభ మమరు భీమ
దేవమందిర పూర్వప్రదేశమందు. 18

తే.గీ. ఎసగుదాని తూరుపుననందీశ్వరుండు
ఘనశిలాశిల్పిత ప్రాణకళల వాడు
స్వామి దిక్కు మొగమ్మయి యేమి యాజ్ఞ
వీని కన్నట్లు సతతావధానమూర్తి. 19

## ఉద్దండనృసింహభారతికథ

ఉ. మానుష జన్మదుఃఖ పరిమర్దనఁ గల్పపుగుండు నాకృతిన్
మానితుడైన భీమపతి మంజుల మంగళ మందిరాపుర
స్థాన పవిత్రభూమి నొకస్వాములవారి సమాధి కట్టడ
మ్మానమిత ప్రవేశము శిలాక్షరబంధము చెన్ను గొల్పెడిన్. 20

ఉ. దండివరేణ్యు డద్వయ విధానవిధా పరిపాలన క్రియా
శౌండుడు భద్రపుష్పగిరి శంకరపీఠమహాపదస్థు డౌ
పండిత సార్వభౌమునకు పట్టె సజీవసమాధియోగ ము
ద్దండనృసింహభారతికి దైవనియోగము దుర్నివారమై. 21

మ. సగణస్థాణుడనంగ భృత్యగణ శిష్యవ్రాత సంసేవితుం
డగుచున్ పల్లకినెక్కి రాజసమదీవ్య ద్వైభవభార పు
ష్పగిరిస్వామిమఠాధిపత్య విదితాంచల్లాంఛనాఢ్యుండు శే
షగిరిస్వామిని చూచువేడుక మనశ్శాలాంత రాపూర్ణమై. 22

ఉ. కొండొకకొండపై వెలయు గొప్ప యదెంతటిదంచు కొండపై
కొండగ నేడుకొండలగు కొండపయి న్వెలసిల్లు నెవ్వ డ
క్కుండట శాయి ధామమునకుంగల మార్గము పట్టిపోయి యు
ద్దండ నృసింహభారతియు తద్ధరణీధర పాదమేదినిన్. 23

ఆ.వె. కపిల తీర్థమందు ఘనుడు సుస్నాతుడై
యలవి మీఱినట్టి యలబలముగ
కొండ యెక్కదొడగె కొట్టికోలాహల
మ్ముగ నగాగ్రమెల్ల బోరుకొనగ. 24

చం. అదివిను చూర్ధ్వపుండ్రముల యయ్యలు వేదిగివచ్చి మార్గమం
దెదురుగ పట్టభంగముల నెక్కు ఘనార్భటి మిన్నుముట్టగా
పదపదమంచు త్రోసికొని పైకరుదెంచు విబూది పెండెక
ట్లదొరల నేమి యాకలకల మ్మెవరీరని యడ్డగింపగన్. 25

శా. ఈ రాజద్యతినాథులన్ తెలియరో యేమీదివాంధత్వముల్
వీ రుద్దండ నృసింహభారతుల విద్విడ్భీకరుల్ పుష్పగి
ర్యారాధ్యోజ్జ్వలపీఠవర్తుల సువర్ణాందోళికాస్యామహ
మ్మై రా నడ్డెదరేల దారివిడువుం డాస్యోర్ధ్వపుండ్రాంకితుల్. 26

తే.గీ. ఈ జగద్గురునా మీర లీసడింతు
రెంతయపచారమౌర వాయించుకొనుడు
చెంపలంచు వార్మోములు జేవురిల్ల
నేచి పైపైకి వచ్చుచు నెగిరి పడగ. 27

తే.గీ. ఈ జగత్త్రయీగురుని సేవింపవచ్చు
వాని కింత యార్భాటమ్ము వలయు నోటు
కలదె లోకమందిట్లు జగద్గురుండొ
మఱి గిగద్గురుడో వాడు మానవుండు. 28

శా. శ్రీమద్వేంకటశైలనాయకపరిస్ఫీతప్రపత్తిప్రభా
వామృష్టాత్ములు మామహంతుల యమోఘాజ్ఞన్వినుం డెవ్వడే
నీ మర్త్యుం డిటు పాదచారియయి రానేగాని రా వీలులే
దామోహాత్ము డహంకృతిప్రతిరతుం డాందోళికారూఢుడై. 29

ద్విపద. అని పంగనామమ్ము లదరిపడంగ
వినిబూదిపూత లావేశవిస్ఫూర్తి
కనలి లడాయికై కాలుద్రవ్వంగ
కని కార్యవాది జగద్గురుం డపుడు. 30

కం. సిగపట్ల గోత్రములుగా
తెగి యీగతి నెవరునేల తిరుగుడువడ ని
న్నగవర్తి షోడశకళో
పగతుని సెలవుగనినపుడె వచ్చెద మటకున్. 31

తే.గీ. అందనుక నిచ్చటనె వేచియుందు మంచు
నచట విడియంగ తనవారి కాజ్ఞయిచ్చె
యతిశిఖామణి ప్రత్యర్థులచటు విజయ
గర్వితులు వీడి చనిరి నగమ్ము పైకి. 32

తే.గీ. విడిదిలో తనకొఱకు కావించియున్న
పటకుటీరంపు టీశానేయపావనప్ర
దేశమున ప్రతిష్ఠితమయి దివ్యదీప్తి
వెలయు శ్రీదేవతార్చనా పీఠిముందు. 33

పృధ్వీ. పరాత్పరకళాపకర్షణ విపర్యయప్రోద్యముం
డరుంతుదమహావమానదళితాంతరుం డయ్యతీ
శ్వరుం డభిమతార్థమంత్రసముపాసనా శ్రీధురం
ధరుండు తపముండె సజ్జపవిధానమగ్నాత్ముడై. 34

శా. ఆ మంత్రజ్ఞా జపప్రభావబడిశవ్యాకృష్టి లక్ష్మీపతి
శ్రీమన్మూర్తికళైకదేశము తటిద్రీఢాంశు సందీపిత
వ్యోమ మ్మూగుచువచ్చి యాతని మరుత్పూజాలసత్ప్రతికా
వ్యామిశ్రస్థితివెల్గె నన్నిసి తురీయమ్మైన యామమ్మునన్. 35

తే.గీ. దృష్టితగిలిన యవ్వానికెట్టు లట్టు
లఖిలలోకైకనాథున కావులింత
వచ్చి వేసినచిటికతో వచ్చిపడిన
యడరు దివ్యచిత్తమ్మున నట్టెమెఱసి. 36

శా. ఓరీ! లాగదొడంగె నాకళలు వా డొక్కొక్కటే లేవరా
యేరా యింతటిమొద్దునిద్దుర యటం చిభ్యుండు వ్రేళ్లైదు పెన్
చాఱల్తేల కరమ్మునన్ పటితళించ న్నీవు స్వప్నమ్మునం
దౌరా యంచు మహంతు త్రుళ్లిపడి శయ్యన్వీడి వేగమ్మునన్. 37

తే.గీ సపరివారుడై దిగిపోయి స్వామి స్వామి
మీకు మాస్వామి సెలవయ్యె మీరలింక
నిచ్చవచ్చినయట్లు కొండెక్కవచ్చు
ననగ నుద్దండపిండ మయ్యతివరుండు. 38

తే.గీ. కలకలముమీఱ పల్యంకికానివిష్టు
డైనగమ్మెక్కి వైభవమ్ముచ్చుపడగ
నచట రాజిల్లు శేషాచలాధినాథు
నగరిమోసాల తీవి నందలము డిగ్గి. 39

తే.గీ. ప్రకటయతిధర్మనిష్ఠ వీడకధరించు
పావలెడలు కాళ్లకు ధరాస్పర్శ సోక
కుండ పఱచు తివాసులై కుండలీంద్ర
శయు మనోహర గర్భవేశ్మము జొచ్చి. 40

కం. నరనారీ సందోహా
చరితదురితకర్దమానుషంగవికారా
కరధరణీప్రక్షాళన
పరాయణోదారచరణపద్మమరందున్. 41

కం. శిక్షిత దుష్టజనము సం
రక్షిత శిష్టజనతాభిరామము రక్షః
ప్రక్షోభశంఖచక్రస
మక్షము జగదవనబాహుమండలి వానిన్. 42

కం. ఇతరేతర సంశ్రయణ
ప్రతివర్ధితసుప్రకాశవైభవ నిత్య
స్థితనుతకౌస్తుభకమలా
ప్రతీతపరిణాహరమ్య వక్షస్సదనున్. 43

కం. రాజసభావము నొరసెడి
తేజోమయ సాత్వికప్రదీప్తులన న్వి
భ్రాజల్లలాటతల సం
ధాజృంభములైన బుంగనామాల దొరన్. 44

కం. స్ఫురదరుణరాగవిలస
త్తరణిసహస్రప్రభావితానాపహాస
త్పరిపూర్ణషోడశకళా
స్ఫురణాసర్వాతిరిక్తమోహనమూర్తిన్. 45

మ. కని సాశ్చర్యవిధేయు డర్పితనమస్కారుండు సర్వేశ్వరా
స్యనటన్నిర్మలచంద్రికాచ్ఛదరహాసశ్రీల కొండొక్క యె
జ్జని క్రొంజీర పరంపరాభ్యుదయసంరంభమ్ము తూగాడగా
కని యుద్దండనృసింహభారతి మనఃకంపమ్ము వాటిల్లగన్. 46

ఉ. ఓ యతిలోకవైభవసముజ్జ్వలసర్వవిభూతిమత్ప్రభా
వాయతవిగ్రహా ప్రణమితాఖిలలోకనిరస్తకిల్బిషా
యేయుగమందు నెయ్యెడల నెన్నడు నెట్టి నికృష్టచిత్తుడున్
చేయగబోనిదాని నిటుచేసితి నిష్కృతిలేని పాపమున్. 47

కం. ఒక నిముసమైన నీ ది
వ్యకళవెలిగె నాదు దేవతార్చా పీఠిన్
సకలేశా యీ ప్రాణము
లికనేగతి బోయెనేమి యే ధన్యుడనే. 48

కం. ఇదిమొదలుగ ప్రతివత్సర
విదితశ్రావణికమందు విశ్రుతవిభవా
స్పద ముత్సవమ్ము నీకై
పొదలుల్ పుష్పగిరిపీఠమున విశ్వగురూ. 49

శా. నీయచ్ఛాచ్ఛదరస్మిత ప్రభలు నిండింపంగదే నా మతిన్
మాయావర్త్మ చరిష్ణువైయిది యహంభావమ్ము పండించుకో
నై యిట్లీవికృతాపచారకృతి నీయందెంచెబో దీనికిన్
ప్రాయశ్చిత్తము చేసికొందును ప్రభూ ప్రాణాంతపర్యంతమై. 50

తరువోజ.

అని యతినాయకుండనుతాపతప్తు
డఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని
పునరభివందనస్ఫూర్తివీడుకొని
పోయి యప్పుడు గల పొదిలెపాలకుని
కనివెలుగోటి వేంకటగిరి విభుని
కని వానియనుమతి ఘనశివక్షేత్ర
మన వాసికెక్కిన యా నిర్మమేశ్వ
రాంచి తాలయ వరణాంతరస్థలిని. 51

కం. భీమేశ్వరుగుడిముం ది
చ్ఛామహితుడు పుష్పశైల శంకరపీఠ
స్వామి సజీవ సమాధి
శ్రీ మండితుడయ్యె జనులు జేజేవెట్టన్. 52

కం. భీమేశ్వరాలయోత్తర
భూమిన్ శేఖరిత చంద్రముడు భక్తజనాం
హోమర్దనుండు భువనము
లోముచు కైలాసనాథు డుండు వరదుడై. 53

శా. మీనాక్షీతరళావలోకతటిదున్మేషోచ్చల త్కాంతిరే
ఖానిర్ధారిత సుందరేశ్వరుడు మాకైలాసనాథుండు ప్రే
మానందుండు ప్రియాప్రమోదరచనావ్యాపారుడై సర్వవే
ళానర్మాంకితవర్తనన్ త్రిభువనోల్లాసమ్ము పూరించెడున్. 54

శా. ఆ నిత్యప్రణయైకజీవనకళావ్యాసంగ శృంగార లీ
లానృత్యన్మతు లాదిదంపతుల సల్లాపామృతమ్మానుచున్
వీనుల్ విచ్చుకొనంగ మైమఱపునన్నేత్రమ్ములున్మాతలై
తానుండున్ముఖమండపమ్ముల బృహన్నందీశ్వరుం డొక్కడున్. 55

మధ్యాక్కర.
ఆ నందివల్లభు మండపమ్ము పూర్వాశను నిడివి
యైనట్టి కేతనస్తంభమలరారు నద్దాని చివర
జానైన చిఱుగంట లనిలచాలిత సరసస్వనముల
మానక కీర్తించుచుండు నద్దేవు మంచితనమ్ము. 56

తే.గీ. అటమొదట నద్వితీయుడై యందగించి
వెనుక వెలసిన నిర్మమేశునకు నచటి
పెత్తన మ్మంటగట్టి సంప్రీతి విరియ
నద్వితీయ ద్వితీయుడై యలరు నతడు. 57

## నిమ్మవ్వగుడి

కం. కైలాసనాథసుందర
శాలోదగ్దిగ్ధరిత్రి శైలసుతాకే
ళీలోల చరణ వినమ
త్ఫాల వెలయు నిమ్మవ నిజ భక్తులు కొలువన్. 58

కం. ధవువెంట పొదిలె గడ్డన్
తవిలి మునుపుకనని తీయనలు కాంచిన యా
నవగంగసవిధ పశ్చిమ
భువినొప్పెడు నామె భక్తిపూచిన యట్టుల్. 59

కం. శితిగళదీక్షాపరురా
లతివ యొకేపిడత వండుసన్నము తోనే
శతకోటిసంఖ్య జంగమ
తతిఁ దన్పెడిదంచుచెప్పెదరు పొదిలె జనుల్. 60

ఆ.వె. జిట్టెడంతలేని చిన్నవా డొకడు ని
మ్మవ్వకాళ్లయొద్దనడగియుండు
నమ్మనంటుకొన్న యాతని చిన్ని మొ
గమ్మునం దమాయికత రహించు. 61

కం. ఆదారకున కొసగె నెవ
రోదైవాయత్త చిత్తరోచిష్ణువు ని
ట్పొదేవమాన్యముగ న
త్యాదృతి కోరళ్లపల్లె యను గ్రామమ్మున్. 62

శా. ఎల్లంరాజుకులాబ్ధిరాజు గిరిజా హృన్నాథ సద్భక్తిసం
వల్లీలాగతి తేజు దేవహిత సమ్యక్కార్య సంతానమం
డల్లోకావళి కూర్చుమోజు పెదకొండంరాజు కీర్త్యంసభా
జ్మల్లీమాలగ కూర్చె నాలయ వినిర్మాణమ్ము నిమ్మవ్వకున్. 63

## నిమ్మవ్వ కథ

కం. పదివంద్రెండేడుల చి
న్నది పొదిలెన్వేలయు శివుని నా మాంకితమై
నది పుట్టుక ముందో శివ
పదపంకజ భక్తిముందొ బాలామణికిన్. 64

ఆ.వె. భూమిమీద బడ్డ మొదటి కేరుటలోనె
మొగ్గదొడిగెనంట పురహరుండు
ఉగ్గుపాల మొదటి యుంగలోనేపూచి
పరిమళించెనంట పరమ శివుడు. 65

ఆ.వె. తుమ్మిపూవులన్న జమ్మిపత్తిరియన్న
కనులు కౌగిలించు కర్ణములను
తగని వలపు పచ్చమొగలిరేకన నత్త
పత్తిననుకరించు బాలమొగము. 66

కం. ఆడునని శివుని యాటలు
పాడున నీశాను మీది పాటలు చెప్పన్
పాడివి శివకథలు శిశు
క్రీడా పరమార్థదృష్టికి న్నిమ్మవకున్. 67

తే.గీ. అఖిలలోకగురుం డమృతాంశుమౌళి
పైనదెటువంటి భక్తిభావమ్మొ నిమ్మ
కనుపదమ్ము కుమారపదాభి మంత్ర
ణమ్ముగా నీశు సంభావనమొనర్చు. 68

మత్తకోకిల.
నిర్మమేశ్వర దివ్యదర్శన నిత్యలాలస నిమ్మ త
న్మిర్మమేశ్వరు పెచ్చులేచిన నెత్తిజూచుచు వేదనా
ముర్మురమ్ముగ డెంద మెంతటి మోసమయ్యెర తండ్రి నా
కర్మరా యిదియంచు వందురు కన్ను లశ్రుమయమ్ముగన్. 69

కం. శివపర్వరాజము మహా
శివరాత్రి నిశీథకాల చిహ్నిత లింగో
ద్భవ భావనావశత ని
మ్మవడెందము పానవట్టమై పురణించున్. 70

కం. శివరాత్రికి శ్రీశైల
మ్ము విరాడ్రూపఘనలింగమూర్తిఁ గనని జ
న్మవితాయనగా విని ని
మ్మవ తీవరపాటు సూవు నగ్గిరికేగన్. 71

తరల. ఇతడు నాతడు నొక్కటే యను నింగితమ్మతిమాత్రమై
యితనిత్రవత్నుని నిమ్మయంగని యిచ్చగించెడు నిమ్మ తా
నతని నూత్నుని మల్లయన్ పశుయంత నాత్మభువున్ కనన్
కుతుకమున్ కనె నట్టి దైవము కోడి గమ్మిటు లుండునే. 72

కం. తలిదండ్రులు కడు సామా
న్యులు కలవారిండ్లయందు నూడిగమై ప్రొ
ద్దులు వెళ్లబుచ్చువారికి
తలమే తమబిడ్డముద్దు తామై తీర్పన్. 73

తే.గీ. నిర్మలాత్ముల సంకల్పనియమ మమృత
గంధమైపూచి ఫలియించుగాని చెడద
అమలినాభవభక్తి నిర్యత్న నిభృత
బుద్ధి నిమ్మవ్వ సంకల్ప శుద్ధియేమొ. 74

తే.గీ. ఇరుగు పొరుగు వారైన మహీసుపర్వ
దంపతులు చిరపుత్ర సంతానహీన
తాదురంత వ్యధాపరితప్త హృదయు
లన్నిటికి శ్రీగిరీశుడే యండ యంచు. 75

కం. ఒక శివరాత్రికి భ్రమరాం
బికామనోనాథు పుత్రభిక్షాదాన
మ్మొకవరము వేడ నొకరే
పకడన్ శ్రీశైలయాత్ర పచరించుటకై. 76

శా. ఆయత్తమ్మగుచుండ నిమ్మవయు నత్యౌత్సుక్య మగ్మాత్మయై
యోయమ్మా ననుబంపు పంపగదె నన్నోయయ్య యీ జంటతో
మాయయ్యన్ కని వత్తునంచు నొకటే మారాము సేయంగ కా
నీయమ్మా యని తల్లిదండ్రు లనుప న్నిమ్మవ్వ యవ్వారితోన్. 77

ఆ.వె. బండిమీదపోయి బండిపోయినమేర
బండి మొండికెత్తు గండ శిలల
తండమేలు నడవిదారుల కాల్నడ
గుండె పొంగు మెండుకొనగ పోయి. 78

శా. స్థాణుంగూర్చిన తీవ్రనిష్ఠురతపస్సారమ్ము పేరంగనై
స్థాణుస్థావరమైన పర్వతు శిరః స్థానమ్ము దృజ్మాత్రని
ర్వాణశ్రీదము బాలభాస్కరకరభ్రాజిష్ణు సౌందర్యసా
రీణమ్ముంగని డెందపుంబులుపు మూరింబోవు నిమ్మవ్వతోన్. 79

మ. తనకున్ తోడయివచ్చు పుణ్యహృదయుల్ తద్విప్రజాయాపతుల్
కనినావేగద శ్రీనగమ్ము కొపు రింకన్నీకు జన్మమ్ములే
దన నా బాలయు మీకు నెట్లొ మఱి నా కట్లేగదా యంచు పే
ర్చిన కౌతుహల మూర్తియై కదలి చేరెన్ తన్నగాంఘ్రిస్థలిన్. 80

తే.గీ. చేరి యాకాశమంటు నా శ్రీధరాధ
రేంద్రు నౌన్నత్యమునకు రెట్టింపుగాగ
పరమ శివభక్తి తన్మయత్వము భజించు
స్వాంతముప్పొంగి యాకాశమతకరింప. 81

తే.గీ. మల్లయా మల్లయా భక్తమౌళి నాడు
బాలకుడ పశూత్కరమేలు ప్రాబుడుతడ
చేదుకో చేదుకోవయా శ్రితభవాబ్ధి
తారకా నన్ను నీ మహీధరముపైకి 82

తే.గీ. అనుచు హృద్గతేంద్రియ సమాహార నిమ్ము
హృదయ భంగమ్ముగాకుండ హృదయభంగ
పర్వతమ్మెక్కి నక్షత్రభక్తిభార
భరముగా నెక్కి నక్షత్ర పర్వతమ్ము. 83

సీ. పర్వతీకృత భక్త పర్వతోత్తుంగ సం
హనన శిఖా స్థానమైన వాని
చంద్రవతీ సమర్చా మల్లికాదామ
సమ్మతసితశిరోగ్రమ్ము వాని
భ్రమరాంబికామనః ప్రణయ హర్మ్యవాటి
కాకుంచికాభ వీక్షణమువాని
లోకాఖిలాంధావలుంచనజ్యోతిర్మ
య స్వయంభూలింగమైన వాని

చుక్కలంటెడు పర్వతమ్మెక్కలేక
తేలగిలు వారినెల్ల నదృష్టరూప
నైకరజ్జువుల న్నిరంతరము చేదు
కొను కృపాళుని మల్లికార్జునుని జూచి. 84

సీ. సెగకంటిమంటలనెగయు తాపము వాయ
శిరముపైనొక శీతకరుని నిల్పి
గళహాలాహల విషాగ్నులుమాయ తలనొక్క
యాకాశవిషకన్యనవధరించి

మసనంపుక్రొంగొత్త నుసికాకలుడుగ కై
లాసతౌషారతల్పమున పండి
పొరలు పాముల వేడిబుసలు గాలికివోవ
బయలులో తాండవ క్రియలుమెఱపి

గుణముగానక యొకరాచకొమిరెవెట్టు
మల్లెపూదండ చలువలు మరగి భక్త
పర్వతునిమూపుపై చేరబడితివటర
కన్నడుల యల్లుడా తెన్గుచిన్నవాడ. 85

సీ. ఉతుకవేయగరాని యొకపద్మికడవస
మ్మది పట్టుదోవతి యటర నీకు
ముడుతపెట్టగరాని మువ్వన్నెమెకముతో
లది జరీకండువా యటరనీకు
కుతిక ఔమ్ముకను ఔచుకొనురుండమాలిక
లలరు మెత్తని దండలటర నీకు
కొకిబికినడకల వికృతరూపములు బూ
తము లటరా చోపుదార్లు నీకు

వేసమెటులున్న నేమిలే విపులవిశ్వ
పరమ మాయావిలాస వైభవవిచిత్ర
గతుల నెటుజూచినను విలక్షణము నీదు
నటనమో మల్లికార్జున నటమహేశ 86

సీ. ఆది దాంపత్య విన్యాసమ్మునకు తోడు
సవతికయ్యపుటాట సంతరించి
తగువారితోబాటు తగనివారికిని వ
రమ్ములు త్రవ్వితండమ్ములెత్తి
అమృతాశనత్వమాహాత్మ్యమ్ముతోగూడ
కాలకూటాహారకలన మించి
లోకసంగ్రహకళాలోలుపత్వము తోడ
లోకనిగ్రహకేళిలోన మున్గి

యను పదమ్మును నీ కతలన్ని యిటు వి
రోధసమ్యగలంకార రూపితాద్భు
తమ్ములుగ భక్తుల మనోధనమ్ము లాహ
రింతువుర భ్రమరాంబికా హృదయచోర 87

సీ. వేడుకమై పసివా డైదుపూవుల
నినుతాకెనో సనాతన మహోగ్ర
గతి ఫాలనేత్రాగ్నినతనుని నతని గా
వించి నీవేమి సాధించినట్లు
హృదయమ్ము నీయందె పదిలించి గిరిజ సా
రించు దివ్యప్రణయాంచితాను
రాగవీక్షాశ్రయాభోగుడై హృదయ జ
న్మండు సాధించె నాతండు నిన్ను

మదనసంహార వైరాగ్య పదవిహార
ప్రత్యుషఃకాల వికసనౌచిత్యమల్లి
కాసుమప్రకల్పితదామవాసనాను
షంగ భ్రమరాంబికా సమాలింగితాంగ. 88

సీ. కొడుకు నిమ్మనియమ్మకోర లంబోదరు
నేనిక మోయయ్య్య నిట్టి యిచ్చి
యికనొక్క కొడుకన్న నెవరికిబుట్టిన
బిడ్డరా యేడ్చెడు వెక్కి వెక్కి
యనినట్టు లగ్నిగర్భుని నంతగాంగేయు
తదుపరి శరవణోద్భవుని పిదప
కార్తికేయుని షణ్ముఖస్వామి జూపించి
వీడుగో కొడుకన్న వీర్యవంత

కోరువారికోర్కులనిట్లు కొదువలేక
తీర్చువరదుండ వింకేమి దిగులుమాకు
శ్రీమహాపర్వతోత్తుంగ శిఖరనిలయ
మల్లయా చేకొనవే మన్నమశ్నుతమ్ము. 89

మాలిని. పరమ శివ పదాబ్జ భ్రామ్య దిందిం దిరాంతః
కరణయగుచు నిట్లక్కన్య భూషించుచుండన్
సరస పుడమివేల్పుల్ంజంపతుల్ పుత్రునీవే
హర! హర! కరుణాబ్ధీ యంచు నర్థించు మాటల్. 90

తే.గీ. వినగనైనంత నేమి పుట్టినదొ చిన్న
తనపు చిలిపి మనస్సులో దైవవిలస
నమ్మదెట్టిదొ మల్లయా నాకునొక్క
కొడుకు నీవయా యని మ్రొక్కుకొనియె నిమ్మ. 91

ఉ. మ్రొక్కన చిక్కచేతులకు మోక్షము వచ్చియు రాకమున్న ని
మ్మక్కకు గర్భగోళమున నర్భకు డూగిసలాడినట్టులై
యొక్కట జాతి భూపతన మొందిన యట్లయి యక్కజమ్ముగా
ప్రక్కదశార్ధవర్షముల బాలకు డొక్కడు చేదె మల్చుచున్. 92

ఆ.వె. అమ్మ అమ్మ యంచు నాముకో మేపుల
కించి చంకకెత్తుకొంచు వాని
మోము పుడికి కనులు మూతలు వడ ముద్దు
లాడి యాడి యక్షులంత విచ్చి. 93

మత్తకోకిల.
మల్లె పూవుల దండచుట్టిన శితెల్పు మఱింతగా
తెల్లనై విమలాంశువు ల్దశదిక్కుల న్వెలిగింపగా
మల్లికార్జును జూచి నిమ్మవ మాయురే ! మన మాయకీ
పిల్లకుం దడపుట్టి గుండెలు వ్రీలునంచు తలంచితో! 94

ఉ. నీమది నాకు క్రొత్తయటె నిత్యపరీక్షక ! వీనినెట్లొ యే
బాముసకైన నోర్చుకొని వర్ధిలజేసెదగాని మల్లయా
నీమదిపెట్టి యీనిసువు నీపదభక్తమహాపచారమన్
గాముస పోవకుండ కనుగల్గుము వీడు మనంగనెంచినన్. 95

పృధ్వీ. అనన్య సదృశమ్ముగా నిటులనాడి నిమ్మవ్వ య
వ్వినన్ చెవిటి మల్లయన్ సెలవువేడి మున్నెన్నడున్
కనీవినని యద్భుత మ్మిచట కంటి మిమ్మాన్యురా
లనింద్య సుకృతాత్మయంచు కొనియాడ యాత్రాజనుల్. 96

తే.గీ. తనకు నబ్బు సద్యః పుత్రధనము జూచి
సమ్మదరసంపు జోతుల ప్రమ్మిదలుగ
నెమ్మనమ్ములు తన్మెచ్చు నేలవేల్పు
మనుపరులవెంట నింటికి మఱలిపోయె. 97

తే.గీ. ఒకతెగా పోయి రెండుగా నూడిపడిన
నిమ్మవను జూచి తజ్జననీజనకులు
చిత్తముల బిత్తరమ్మును తత్తరమ్ము
నొత్తుకొన నిల్వ్రగుడ్లయి యుండ నామె. 98

మత్తకోకిల.
ఉల్లపున్ కుతుకంపుభావన లొడ్లు రాయగపోయి యా
మల్లయన్ కని వానిచేసిన మాయ ముంచుకొనంగ నీ
మల్లయన్ కని వీని మీకగు మన్మడంచుని.తెచ్చితిన్
కల్లకాదిది వేను కుంతినికాను సూను త్యజింపగన్. 99

కం. అనగా నిది యంతయు నే
మని వారా బాపనయ్య నడుగంగా నా
యన మన నిమ్మవ్వ కత
మ్మున నేడీ పొదిలెగడ్డ పూతమ్మయ్యెన్. 100

తే.గీ. అనుచు శ్రీశైల మల్లికార్జున ఋతంభ
రారచిత నరలోక కుమారసంభ
వక్రమము సవిస్తరముగ పల్కి హర్ష
మయుల వారల వీత సంశయులజేసె. 101

కం. లోక మనేక విధ మ్మా
లోకితములనే విభిన్నలోకనమై పల్
పోకలు పోవ నిక ననా
లోకితములయం దభిన్నలోకన మగునే. 102

ద్విపద. ఊరిలో నెటువంటి యూసు పుట్టినను
కోరి పూసుకతిర్గు కోలాటకత్తె
లొకతెయచ్చమ్మ వేఱొకతె బుచ్చమ్మ
యొకతె కిచ్చమ్మ యింకొకతె పిచ్చమ్మ
యొకతె చంటక్క వేఱొకతె కుంటక్క
యొకతె చిట్టక్క యింకొకతె బుట్టక్క
మఱియును కల ముళ్ళమూరు లూరెల్ల
తిరుగుడు పడుచు నదేపనిగాగ. 103

సీ. ఏమి పోగాలమే యీ పిల్ల కిటు పుట్టె
నకట నల్వురు నవ్వనపరబుద్ధి
బుద్ధిభూములనేలబో గాడిదలు కాయు
వ్రాతయ్యెనే దీని బైసిమాల
మనయూరికెటువంటి మచ్చ తెచ్చెనె గాడు
పట్టె దీనికి లేవు పుట్టగతులు
కల్మషమ్మను మూటకట్టి మన్మండంచు
కులుకు వారిని తిట్టులొలువవలదె

యనుచు దుయ్యబట్ట నమ్మలక్కలు వెలి
వెట్ట చుట్ట లచట వేగలేక
కూతు నేమియనుటకు నోరురా కార్తిఁ
దల్లడిల్లి నిమ్మ తల్లి తండ్రి. 104

కం. ఒక చీకటి నడురే వా
రికర్మకున్ వారి నిద్దిటెన్ వదలి కుమా
రికఁ దత్సుతు నిబిడతమ
మ్మొకతోడుగ వారుపోయి రొక యెచ్చటికో. 105

సీ. నారీ జనానీక నానాపవాదవా
గ్బాణచ్ఛిదాహృది కాక నిమ్మ
సర్వబాంధవ తిరస్కార దుస్సహతరై
కాకిత వికతలాత్మకాక నిమ్మ

మాతాపితృవియోగజాతాతికాతరో
త్కంపమానస్వాంతకాక నిమ్మ
నిత్యజీవనమార్గణాత్యర్థసంకట
కల్లోలమానసకాక నిమ్మ

నిర్మమేశ్వర చరణ నిర్ఛిద్రభక్తి
బలసమీచీన ధైర్య విస్ఫార నిమ్మ
తద్విపత్కాల కష్ట సందష్ట ధీవి
చలితకాక సుస్థిర వృత్తి నిలిచె నిమ్మ. 106

ఆ.వె. హరుని భక్తులిండ్ల పరిచారికా వృత్తి
నిమ్మ జీవితమ్ము నెట్టుచుండ
వేడినీళ్ళకింత తోడు చన్నీళ్ళను
కరణి కొడుకు పసుల గాయుచుండు. 107

కం. దూడల గాయుటలో నే
దూడల కాపరియు వీనితో సరిపోల్పన్
రాడంచు నెల్లరాడగ
దూడల మల్లయ్య సంజ్ఞతో వా డొప్పున్. 108

తే.గీ. కొడుకునకు తనకీగతి నడుములువడ
పనులు సేయనై బ్రదుకెంత భారమైన
నర్థిదా ననుష్ఠించు నిత్యవ్రతమ్ము
నేమఱద శివభక్తినిస్సీమ నిమ్మ. 109

తరల. అనుదినమ్మొక జంగమేశ్వరు నర్చనాన్వితు జేసి యా
యన తినంగ కాని నిమ్మవ యారగింపద యన్వ్రతం
బనవరోధత సాగి సాగినయన్ని నాళ్ళను నొక్క దు
ర్దినము వచ్చెను తన్మహానియతి ప్రయోగవిఘాతమై. 110

సీ. కైలాసహిమగండశైల ఖండములు భూ
భాగమ్ము వాహ్యాళి వచ్చినట్లు
తనయ క్షుధాపనోదత్వరాశయ సర్వ
మంగళపాలిండ్లు పొంగినట్లు
తాండవజనిత శ్రముండైన గగనత
త్వతను చెమ్మట జాలువాఱినట్లు
వ్యోమకేశుని జటావ్యూహబంధము వ్రీలి
పుడమిపై గంగమ్మ పడినయట్లు

పూని నడురేయి మొదలయి బొట్లు బొట్లు
కాఱి జల్లులు మితిమీఱి ధారకట్టి
కుండపోతగా వర్షమ్ము కురిసి పొదిలె
జనపథమ్ము లన్నియును నిర్జనములయ్యె. 111

ద్విపద. ఆ వాన కాత్మ నియమధార త్రెవ్వి
పోవునో యను శంక పొడమి నిమ్మవ్వ
మానస వీథి నుమాసహవాసి
ధ్యాన సమాధి సమాధానుజేసి

ఓరి నిమ్మయ్య యోరోరి యర్భకుడ
ఓరి నిమ్మయ్య యోరోరి దారకుడ
అక్కడ మల్లయ్య వటుపూనుకొంటి
విక్కడ నిమ్మయ్య విటు పూనుకొంటె
భక్తుని రూపాన వచ్చి ప్రత్యహము
భుక్తి నాచే గొనిపోదు వన్వహము
జడుపు పుట్టెనె నేడు జడివాన కౌర
తడిపుచ్చి పొడియిచ్చి దగతీర్తులేర
రారోరి నిమ్మయ్య రారయర్భకుడ
రారోరి నిమ్మయ్య రార దారకుడ
అని దీక్షమై తన యారాధ్యదైవ
మును పిల్చుచుండ నబ్బురముగా నంత. 112

ఆ.వె. మౌళిమీది గంగ మనసు పొంగి శరీర
మంత ముంచుకొనిన యాదిభిక్షు
వట్లు తప్పదడిసి యవ్వాన ముక్కాలి
ముసలియైన జంగముండొకండు. 113

కం. వడవడ వడకుచు నజ్జడి
నడుగులు తడబడఁగ నాట్యమాడినయట్లై
నడకలు సుడివడ నట గ
న్పడ నెడద న్మదము మిడిసిపడ నిమ్మవయున్. 114

ఆ.వె. నడక నటనమైన నటరాజ నాదుజ
న్మమ్ముపండి వచ్చినావు తండ్రి
రమ్మటంచు నిజకరమ్ముల యూత నా
యనను పంచలోని కల్ల తెచ్చి. 115

కం. అప్పటి యవసరసేవల
నొప్పగ చెల్లించి తొంగియుండు మిట క్షణ
మ్మిప్పుడ కూడున్ కూరయు
నప్పమ్మును వండి పిలుచునంతకు ననుచున్. 116

తే.గీ. నిత్యభక్తిశుచీభూత నిమ్మి వంట
చేసిపెట్టి వాకిలి చేరవేసి నిర్మ
మాలయము బావి నవగంగ యమలజలము
పాన విధికయి కొనితేర బయలుదేరె. 117

తే.గీ. అనవరత పశుపాలనా వ్యగ్రమైన
మానసమువాడు వట్టి యమాయికుండు
నిత్యమును లేచు వేళకే నిద్రలేచి
ఖుసిగ పనిలోని కేగిన కొడుకుకుఱ్ఱ. 118

ఉ. మూడిన వజ్రపాతహతి మూర్ధము వ్రక్కలు వోయినట్టులై
దూడలగాయు సంబరము తూలగ మల్లయ కట్టుమట్టులన్
వాడిన మోములై పడిన వానిని దూడలజూచి వీని కీ
నాడిల పచ్చికన్మెసవు నందములేదని యుమ్మలించుచున్. 119

చం. వలిపిరివాన( దోడి పశుపాలకబాలకు లాటలాడగా
పిలువగ వారిజేరి యతివేలపు జల్లులు నోలలాడి దూ
డలకయి కొందలంపడు నెడందకు నూఱటగాగ పొట్టలో
నెలుకలుత్రవ్వ నంత గృహమేగిన మల్లయ పంచపాకలోన్. 120

తే.గీ. ముసుగు బిగదన్ని యొక మంచమున శయించి
గుఱకవెట్టెడు జంగమగురుని జూచి
ఓరిదేవుడా! యాహారయోగ మింత
లోనలేదురా మనకంచు లోనికేగి. 121

ఉ. అక్కడ నొక్కమూకుట శివార్పణకై నియతమ్ము లావిరుల్
క్రక్కెడు నప్పముల్లని కర మ్మనుకాంక్ష మనమ్మునూప నో
ర్మిక్కుట మూర నమ్మపొడ మేకొనదిచ్చుట నిప్పు వీనిలో
నొక్కటి తిన్ననేమని యయుక్తుడు మల్లయ సంభ్రమమ్మునన్. 122

మత్తకోకిల.
ఒక్కయప్పముతీసి యాదట నొక్కసారిగ నోటిలో
క్రుక్కుకోనయి నిర్మమాలయకూపవారిసమేత ని
మ్మక్కరానయి చూడనై సుతునాగడమ్మును చూపు కెం
పెక్క నెప్పుడు బిందెదించెనొ యెప్పు రోకలియెత్తెనో. 123

స్రగ్ధర. పాకప్రాప్తప్రపంచప్రకరవిలయసంపాదనాభీలరౌద్రో
ద్రేకప్రస్ఫారరేఖోత్థితదహనశిఖోద్దీప్తసర్వాంగభీష్మ
శ్రీకాళీమాతవై చచ్చితివి చెడుగ నాచే శివద్రోహివై ఛీ
ఛీ కుక్కా యంచు సత్రాసితు తలపగులన్ చేతిరోకంట వ్రేసెన్. 124

మధ్యాక్కర.
స్వరుఘోరపాతమ్ముబోని ముసలదుర్భరఘోరపాత
భరముఁ శిరము ద్విధావిభిన్నమై పరగునెత్తురుల
నిరు మునిపైపండ్లు చాఱికలగట్టి యెఱసంజలీన
హరహరా విరహితాసువు ధరణిద్రెళ్లె నద్దారకుండు. 125

కం. అది మొదలుగ పదిలములై
పొదిలెం జనియించువారి మునిపైపండ్లన్
విదితము లెట్టని చాఱలు
వదల వదేపనిగ నెంత వానిన్తోమన్. 126

చం. బిరబిర కాళ్ళు పుచ్చుకొని బిడ్డని కాయము గాటిలోనికిం
బరబర నీడ్చి పుచ్చి సుతువర్తన నెంగిలియైన యన్నముం
గిరగిరద్రిప్పి పోనడచి గేహము శుద్ధియొనర్చి వెండియుం
గరగరికైన వంటకము గ్రక్కున సిద్ధముచేసి నిమ్మియున్. 127

సీ. ఆరగింతువుగాని యపర నిర్మమదేవ
లేవయ్య ప్రొద్దువాలినది స్వామి
యని పిల్వ నా జంగమయ్యయు నిజ్ఞ నీ
లిగి యంత బిట్టావులించి లేచి
యాస్నానలింగనమభ్యర్చనమ్ము కా
ర్యకలాపమెల్ల వే యాచరించి
యన్నమ్ము వడ్డింపనైన విస్తరిముందు
కుశలాంతరంగుడై కూరుచుండి

పలుమొనలయందు సెలవుల ప్రక్కలందు
కనుగొనలయందు చెక్కిళ్ళ కడమలందు
మోము నిండ దువాళించు ముసలిముడుత
లందు లేనవ్వ వెన్నెల లందగింప. 128

కం. నిమ్మవ్వా నీ కొడుకే
డమ్మా మల్లయ్య బుడుత డంగద( బడెను గ
దమ్మా తనయున కెత్తిన
యమ్మవుగా వేగ పిలువ మ్మా వానిన్. 129

మ. అరుదౌ నీగతిఁబల్కు నిమ్మవయు సద్యఃస్ఫూర్తినర్తింప బా
పురె సేబాసుర నిమ్మయా యిటుల నా పున్నెమ్ము బ్రాకించు పం
దిరి తీర్చన్ పఱతెంచితా యుడుకవీ నీ పప్పు లీనిమ్మి ద
గ్గఱ నీకంతటి ముచ్చటేన్ పిలుచుకో గారావు నీ మల్లయన్. 130

ద్విపద. శివభక్త భక్త ముచ్ఛిష్టమ్మొనర్చి
యవిసి మూర్ధమ్ము వా డవగతుండయ్యె
చెప్పనే యప్పుడే శ్రీగిరి మీద
నిప్పుడు తప్పు నన్నెంచు టేపాడి
శివభక్తులకు నవచితి నెంచు జాల్ము
డెవడైననేమి నాకేమౌను వాడు
పంతమ్ముతో నిట్లు పల్క నాతండు
వింతగా నిమ్మవ్వ వీక్షించుచుండ. 131

సీ. వామార్ధదేహమై వఱలు పార్వతితోడ
జాహ్నవీకలిత ధూర్జటలతోడ
మూర్ధభూషణమైన మొలకచందురుతోడ
చిలువపోగులు వ్రేలు చెవులతోడ
నేత్రీకృత దినేశరాత్రీశ్వరుల తోడ
నిద్రాణ నిటలాక్షి ముద్రతోడ
వాహనాయిత బలీవర్దనాథునితోడ
జాగ్రత్త్రిశూలహస్తమ్ముతోడ

భువన సమ్మోహనమ్మైన పొడవుసూపి
మానస హృషీకములు తనమయములైల
యింప భక్తిమై సాష్టాంగమెఱగు నిమ్మిఁ
బట్టి యెత్తి సమాదర మ్మట్టిపడగ. 132

కం. మెచ్చితి నిమ్మవ్వా నీ
యచ్చపుబత్తికిని మల్లయన్నికిపుడే
నిచ్చితి కైలాస పద
మిచ్చితి మఱియేమిగోరె దిచ్చెద ననగన్. 133

శా. నా నిమ్మయ్య యెటన్ వసించు నదియే నాకైనకైలాస మా
ర్యా నిత్యప్రణయామృత స్నపిత హృద్రాజీవ నీ యింటిలో
నే నీ నిమ్మిని నిల్పుకొమ్ము కరుణానిర్ణిద్రభద్రావతా
రా నీ తోడిదె లోకమై వెలయ తారానాథమౌళిస్రజా 134

మ. అని ప్రార్థింపగ నామె భక్తసులభుం డాదేవుడు న్మేలు మే
లని నిమ్మవ్వను సూనుతో నిలిపె నాత్మావాసకైలాసనా
థనివాసమ్ములమధ్య సర్వదివిషద్వర్గమ్ము కీర్తింపగా
జనులెల్ల న్వెఱగంద సమ్మదరసస్ఫారీభవన్మానసుల్. 135

## నిమ్మయ్య దేవళము

కం. శ్రీనిర్మమేశదేవ
స్థానావరణస్థితాయతనములలో సం
ధ్యానార్హవైభవమ్మై
దీనుమిగిలి నిర్మమయ్యదేవళ మొప్పెన్. 136

కం. నవగంగబావికి న్ని
మ్మవగుడికి నుదీచ్యభూమి నదియింపై హై
మవతీ సతీ సమేతుడు
భువనావను డందు నిర్మముడు వెలుగొందున్. 137

తే.గీ. భాసుర విమానకలిత గర్భగృహమందు
పెచ్చులేచిన పెడతల మచ్చతోడ
పానవట్టమ్ముపై భాసమానుడై చె
లంగు నా స్వయంభూమహాలింగమూర్తి. 138

మధ్యాక్కర.
ఆగర్భగుడిముందు పరమరమణీయ మంతరాళమున
శ్రీ గణాధిపుడుండు దక్షిణస్థలి చింతితార్థదుడు
రాగాంధజననముద్ధర్త్రి యందుత్తరస్థలి స్వీయ
మౌగేహమున నుండు పార్వతీమూర్తియై వరాశక్తి. 139

తే.గీ. అఖిలలోకైకజనయిత్రి యగుట నంత
కుని యకాలవిజృంభణ మ్మెనయకుండ
కంటి బెదరున వారించుకరణి దక్షి
ణాభిముఖమై విరాజిల్లు నంబ గుడిని. 140

కం. ఆచారుపదము గుడి వా
మాచార పరాయణులకు నగ్గమ్మై దు
ష్టాచారపదము కాన్ నమ
యాచార పరాయణుండు యజ్ఞేశ్వరుడున్. 141

మ. బగళా తామసయంత్ర యంత్రితముగా భక్తాళికి న్మిక్కిలిం
బెగడౌ పార్వతి శుద్ధసాత్వికమహోవిస్ఫూర్తి దీపింప న
బ్బగళాయంత్రము తీసి పుష్కరిణిలో వైపించి శ్రీ చక్రమున్
తగ నచ్చోట ప్రతిష్ఠచేసె జనతానందానుసంధాయియై. 142

మధ్యాక్కర.
శ్రీ పార్వతీదేవి దివ్యచరణ రాజీవ సన్నిధిని
దీపించు ఘన శిలాఫలకమునయందు దృశ్యమానము మ
హా పావనమ్ము శ్రీచక్రయంత్ర విన్యాసమ్ము దిగువ
చూపట్టు నమ్మహాతాంత్రికుని యశస్స్ఫురితాహ్వాయమ్ము. 143

మ. హరగర్భాలయభూషణాయితపద మ్మయ్యంతరాళమ్ము ముం
దఱ నొప్పున్ ఘనమండపమ్మొకడు నందమ్మొప్పగా నందికే
శ్వరు డందున్ కొలువుండు నిర్మము కటాక్షశ్రీలకున్ పాత్రుడై
యిరు పార్శ్వమ్ముల చిన్ననందు లొకరెండెల్లప్పుడున్ కొల్వగన్. 144

చం. అనయము నావుపాలతమి యయ్యకు నొయ్యనతీఱ నాకు నీ
గ నలవికానియట్టి సెనగల్ తినుకోరిక యెట్లు తీఱునో
యను శివదేవవాహమున కచ్ఛపుభక్తినిధాన మొక్కయం
గన తినిపించెనంట సెనగల్ జనులెల్లరు నబ్బురంపడన్. 145

తే.గీ. అట్లు సెనగలు తిను వృషభాధిపునకు
నమరె సెనగల బసవన్న యన్న పేరు
నిత్యచణ కాప్తిగాగ వానికిని నంది
పాలెమది దేవమాన్యమై వరిఢవిల్లె. 146

కం. వరమాద్భుత మీగతి క
న్పఱచి నతివ యామునాలవలి బసవమ శం
కరభక్తిరతులకుం దు
ష్కరమనిలే దదియు కట్టుకత యితరులకున్. 147

తే.గీ. తెలుగురాయండు పొదిలెధాత్రిపతి యామె
కర్థి సుంకరచెన్నాగ్రహార మొసగ
చెలగె నాయమ సుంకరచెన్న బసవ
మ యను నామమ్మునన్ జనమాన్యయగుచు. 148

కం. శివపురమని దానికి నభి
నవ నామమ్మొంచి యామె నట్టువడని ధ
ర్మ విధిఁదనిపె బహుకాలము
శివభక్తుల దెసల కీర్తి చిందులు త్రొక్కన్. 149

శా. ఆసర్వేశ్వరవాహ మట్లు చణకవ్యాసంగమైయుండ ఢి
ల్లీ సుల్తానునిసేన మార్గగత పల్లీపట్టణ ధ్వంస వి
న్యాసాఘోరత పేర్చి రంగముపయిన్ దండెత్తిపోనుండి ధా
త్రీసంధుల్ ప్రిదులంగ వే పొదిలెచేరెన్ దుష్ప్రధర్షక్రియన్. 150

మత్తకోకిల.
అందు కొందఱు బంట్లు నిర్మము నాలయమ్మున దిడ్డి వెం
టందురాత్ములు దూఱి వజ్రకుఠారహస్తులు దారిలో
నంద మొల్కుచునున్న నందుల యంగముల్ పడజెక్కుచు
న్నందికేశుని జేరి వేగమునన్ కుఠారము లెత్తగన్. 151

మ. నలువారన్ సెనగల్ నెమర్చు చొకట న్మాగ్రగమ్మగానున్న గో
వులనాథుం డతివిహ్వలుండగుచు శంభో నిర్మమా యంచు అం
కెలువేయన్ జగతీ సమభ్యుదయ సక్తిన్ యోగనిద్రా సమా
కలనాంతర్ముఖుడావిరూపదృశు డుగ్రంపశ్యు డైనంతనే. 152

తే..గీ. కమరి హస్తమ్ము లన్నరాధములు చేతి
గొడ్డుళులు జాఱ నెత్రుక్రక్కుకొని చచ్చి
రడలి ఢిల్లీంద్రు సైనికు లాక్షణమ్మ
బుద్ధిమంతులు కాలికి బుద్ధిసెప్ప. 153

కం. ఆ సెనగల బసవన్నని
వాసము మంటపము నంటి ప్రాచీదిశ ను
ద్భాసిల్లు నవగ్రహతీ
ర్థాసమచక్ర మొకకంబ మట నందపడున్. 154

శా. కాలాత్ముండగు నిర్మమేశ్వరు దయా కర్పూర శీతేక్షణ
శ్రీలాలిత్యము లేక కాలకృతుడేరీతిం గ్రహాధీశ్వరుం
డాలంబమ్ముగు కాలచక్రగతి కుద్యద్భక్తి వాడందుకే
క్రాలున్ సానుచరగ్రహుండట మహాకాలాంఘ్రిసేవారతిన్. 155

మ. సవురౌ నాగ్రహతీర్థ చక్రమునకున్ స్వారాడ్దిశా దేశమం
దు విరాజిల్లుచునుండు దారుమయ ముత్తుంగధ్వజస్తంభ ము
త్సవకాలోదయకేతువై నెలయ నాస్తంభాగ్రమం దెత్తుకే
తువు కీలించును మింట నిర్మముని సంతుష్టాంగకేతుచ్ఛటల్. 156

కం. అమరార్చితచరణుడు ని
ర్మమ గర్భాలయ విమానరాజపు టౌన్న
త్యమునకు కన నెత్తున సరి
సమానమై నిక్కు నాధ్వజస్తంభమ్మున్. 157

మధ్యాక్కర.
కలలోన నిర్మముం డొక్కమలకకు కన్పించివంపు
బలితంపు టెక్కెంపుమాను నాకంచు పలుకంగ వాడు
వలనుగా మారెళ్ళసీమచేయు హవల్దారు డర్థి
వలము చేవయు కల నందనవనమ్ము బారుమానంపె. 158

మ. స్వమటం చన్యమటంచు సర్వసమతాసంధాత కేముండు న
న్యమతస్థున్ కరుణించె వాని కలలోనన్ తోచి కాకున్న ని
ర్మముడై నిల్చిన యాశ్వరేశ్వరున కమ్మోడ్కిన్ ధ్వజస్తంభ కా
ర్యము కార్యమ్ముగపోయి యొక్కమలకన్ యాచింపగావచ్చునే. 159

తే.గీ. షడ్గుణైశ్వర్యపూర్ణు డాస్వామి దైవ
దర్శనార్థమ్ము వచ్చు భక్తతతి ముందు
వాని దర్శనమొనరించికాని చూడ
బోవ దటనుండు తక్కిన దైవతముల. 160

తే.గీ. ఏమి నిర్మముడా పార్వతీశ్వరుండు
వంతులమర మూలంరాజు వంశ్యు లర్చ
కులయి మూడిండ్లవారు సేవలొనరింప
నంగరంగ వైభోగసమాస్పదుండు. 161

మ. ఆవలోకోత్సవదాయి నిర్మముని ప్రత్యగ్రప్రభాదీపితో
త్సవకాలైధిత శోభనమ్ము వివిధాంచద్వాహనారూఢవై
భవు డూరేగెడి వేళలం దనుగతాపర్ణాయుతుం డూరి వై
దువలెత్తున్ కపురంపుటారతుల కాంతుల్ క్రమ్మి యడ్డడ్డునన్. 162

తే.గీ నిత్యనూతన వాహనాంచితుడు నిత్య
నూతనాలంక్రియాపరిస్ఫీతు డతడు
మాసహితు డేమి హౌసులమళిగ మాఘ
మాసమందు బ్రహ్మోత్సవ వాసరముల. 163

రథోద్ధతము.
ఊరిరథ్యను సముద్ధతి న్నడం
గూరు నా పొదిలకొండ యీశు తే
రారథోత్సవ మహావిజృంభణ
మ్మూరి కెంత కళయో నమన్సమన్. 164

చం. అగునటె నిర్మమేశ్వరున కానవగంగపవిత్రవారి పం
డుగనెలపెట్టినంతటు కడుంగడు శీతముకించిదుష్ణతా
ప్తిగుణ సుఖావహమ్మయిన వెంకటరాముని బావినీరె స్నా
నగణుతి బిందెతీర్థముగ నందన మానెలనాళ్ళు స్వామికిన్. 165

స్రగ్విణి.ఆధనుర్మాస నిత్యాభిషేక క్రియా
సాధితార్ద్రోత్సవోత్సాహసంపన్నుని
ర్బాధబోధక్షమప్రత్యుషస్సూర్యసు
శ్రీ ధరామంగళత్సిక్తమై శోభిలున్.
166

తే.గీ. విజయదశమీ శమీపూజ వేడ్క పాటు
వేటసంబరమున్ తీర్ప వెడలి దారి
వచ్చి కలసిన వేణుగోపాలుతోడ
నిర్భరోత్సాహకమనుండు నిర్మముండు. 167

తరువోజ. అరిగి వే పొదిలెమ్మ యాలయస్థలికి
నతిభక్తి జనులిచ్చు నర్చనల్గొనుచు
సరసమ్ములాడుచు స్వాలునితోడ
సరసాక్షి పొదిలెమ్మ స్వాగతమ్మునకు
పరవశమ్మునవడు స్వాంతమూగాడ
పడు బావమఱదితో పార్వేటవెంట
హరిహరాద్వైత భావావిష్టహృదయు
లాయూరివార లింపార వీక్షింప. 168

చం. అతుల విభూతివర్ధిత దురంత దురత్యయ భోగయోగతా
వితతవిశిష్ట విశ్రుతవివిక్తనవీనమహానుభావ సం
స్కృతుడటె నిర్మముండతని కేమికొఱంత తదంఘ్రిపద్మసం
ధితహృదయుండొకండిడిన నిమ్మవరమ్మది దేవమాన్యమై. 169

కం. ఏవంవిధ ఘనవిభవ శు
భావాప్తి ప్రశస్తచరితుడగు నిర్మము ది
వ్యావిర్భావోద్భుతగా
థావైశిష్ట్యమ్ము హృదయతంత్రులు మీటున్. 170

## శ్రీనిర్మమేశ్వరావిర్భావము

పొదిలె సర్వ శోభకు మూల పురుషుడైన
నిర్మమేశు డిప్పుడు హవణిల్లు నెలవు
ప్రకృతి సౌందర్యసదన ప్రభాసమాన
తోరణమ్మొక్క యూవులదొడ్డి మునుపు. 171

ఉ. శ్రీవరియించివచ్చిన విశిష్టచరిత్రలు పొల్పమీఱు బ
ట్టావులు కజ్జియావు లమృతాచ్ఛమనోజ్ఞలు బొల్లియావు లి
చ్ఛావహదగ్నినేత్రునిదయన్ పరమోత్తమతం భజించు పు
ల్లావులు చిన్ని గంగమయిలావులు కత్తరియావు లచ్చటన్. 172

సీ. మాహేయులెల్ల సమాంసమీనలెకాని
యరయ నందొక్కవంధ్యయును లేదు
బహుళలెల్ల గణింప వరశృంగిణులెకాని
కన నొక్కవక్రశృంగయునులేదు
పీనోధ్నులెల్ల నొప్పెడు సువ్రతలెకాని
కరటయన్నట్టి దొక్కటియులేదు
గోవులెల్లను చెప్పుకొను సుకరలెకాని
సుకతయొక్కటియు మచ్చునకులేదు

ఉస్రలెల్ల ధేనువులె యందొకటియు నప
తోకయౌ దురదృష్ట మందునకు లేదు
భావి మాహేశలీలా నిబంధమైన
గోకులములోని సౌరభేయీకులమున. 173

సీ. ఒకవంక నుపసర్య యొఱపు వాల్జూపు లి
ట్చరసమాకర్షణసాధనమ్ము
లొకప్రక్క సంధిని యుదుట చూపులు గోప
తిప్రణయాబ్ధి కిందుప్రసవము
లొకచక్కి ప్రష్ఠౌహి చకితేక్షికలు తొలి
కానుపు మధురబాధానలయము
లొకచెంప నవసూతిక కటాక్షములు క్షుధి
తాత్మీయ దోగ్ధృ సమాదరములు

తల్లి మేనునాక తళుకులీనెడు తర్ణ
కమ్ముచూపు లచ్ఛకాంతిదమ్ము
లొలయు నూర్ధ్వలోకములమీది సత్యలో
కమ్ము సురభి శేఖరమ్ములగుచు. 174

శా. ఏకల్పమ్మున పుణ్యమేచి పొదిలెన్ హేరాళ సంప్రీతిమై
శ్రీకంఠుడు వరించెనో యచట గోక్షీరమ్ము పై మక్కువల్
సాకై పుట్టనువెంచు గోపతికి సుస్థానమ్ము గల్పింప గో
లోకమ్మే యిటు తర్లివచ్చెనన చెల్వుల్లుల్కు నగ్గోష్ఠమున్. 175

ఆ.వె. గోవిసర్గమందు గోచారణమునకై
గోవ్రజమ్మునుండి గోగణమ్ము
గోత్రు లెలమి వెలుచుకొనిపోవు దృశ్య మ్మ
భూతపూర్వ సంప్రమోదపదము. 176

చం. పొదిలె వనాంతరస్థలుల పుప్పొడితావులమత్తుపెక్కువన్
పదములులేవ కెత్తువడి ప్రాణముచచ్చిన గంధవాహు డొ
ప్పిదముగ పోకుమేయుటకు వేకువరాకడలేచి గోష్ఠమున్
వదలెడు నాలవృష్ఠముల వాసనఁ బ్రాణమువచ్చి లేచెడున్. 177

చం. పొదిలె గవాగ్ర రోహిణుల పుచ్ఛరమాభ్యుదయమ్ము గాంచకే
పొదలవు లోకలోచన విభూతులు నాయనియంచు సంభ్రమా
స్పదమతి నిద్రకన్నుల దివాకరు డస్ఖలితావధానియై
పదముల రక్తిమల్ గగనభాగము ముంచుకొనంగ వచ్చెడున్. 178

కం. తెలవాఱువేళ సంకుల
కలాపముగ నూరగొండకై వెడలు గవా
వలిఁదగులు పేడతట్టల
విలాసినీగణము నిత్యవిధియై యదియున్. 179

సీ. పుల్లావుకడి నాది ముందు నేకంటినం
చొకప్రక్క కాలితో నొత్తగించి
కఱ్ఱావుకడి నాది కంటిముందని తద
గ్రముహత్తుకో నొక్కరాయి విసరి
బొల్లావుకడి నాది ముందు నాకన్నుల
వడెనంచు నందొక్కపుడకగ్రుచ్చి
బట్టావుకడినాది పడెముందు నాకంట
నని హస్తతలముల నచ్చుగ్రుద్ది

కొసరి యాపేడక శ్లిట్టికొదుకులేక
తట్టలన్నింపుకొని వారు తనియుచుండ్రు
భావి సామ్రాజ్య నిర్మాణపరుల కొక్క
చక్కని యుపాయ మిట్లుపొసంగజేసి. 180

మ. మెడమువ్వల్వడినాఱువోయు మృదుగంభీరస్వనమ్ముల్ మడుల్
కడలందెత్తగ నూరగొండకును వేగమ్మేగి యద్దాని గో
ర్వడపున్ పచ్చని పచ్చికన్మెసవుచున్ పల్చోట్ల తారాడి య
ప్పడెల నీరముత్రావి గోగణము తృప్తిస్ఫీత జంఘాలమై. 181

ఉ. గోవులు పోయెడిన్ తిరిగి గోష్ఠసుఖమ్మున నుల్లసిల్ల నా
గోవుల యుజ్జ్వలత్వమునకున్ పనియేమికనంచు పశ్చిమ
గ్రావహృదంతరాళమున గ్రక్కున గోపతిదూఱువేళ నిం
పా వహిలంగ నింటిమొగమౌ ఖురపాతరయమ్ము నూపుచున్. 182

కం. గోధూళీప్సితభూతిస
మాధారణతనువు పొదిలె యమృతవిభూతి
శ్రీధవళాభవభావస
మాధిక్యము నెఱపు నవ్వహము గోధూళిన్. 183

మధ్యాక్కర.

నలువారు నగ్గోధనమున కలదొక్కనైచికి యదియు
చెలువారు కుచ్చుతోకయును గంగడోల్ చిక్కనిపొదుగు
పొలుపారు గుజ్జుకొమ్ములును కరుణార్ద్ర ముగ్ధనేత్రములు
నలరారు కపిలవర్ణమ్మునై యెందు నలరించు జనుల. 184

ఆ.వె. ఆలమంద కొడయడైన గోవిందున
కున్న గోవులెల్ల నొక్కయెత్తు
అపరనందినీ సమాఖ్య యగ్గోధేను
నొక్కటియును చూడ నొక్కయెత్తు. 185

ఉ. ప్రేక్షణరమ్య మాసురభిపెట్టిన ముద్దులకోడెదూడ ఫా
లేక్షణు నందిపోలికల నింపులు కుల్కుట చిత్తగించి స
ల్లక్షణ లక్షితమ్ములగు లాంఛనముల్ నుడులంచు కాంచి గో
లక్షణికుం డనంతధనలాభ మెసంగిన భంగి పొంగుచున్. 186

ఉ. తాతలనాటనుండి కులధర్మము గోపరిపాలనక్రియో
పేతము తీర్చిదిద్దుచును పెంచిన యావులమంద యిప్పుడి
ట్లీ తెలివొందె మంచి సుడులెత్తినగిత్తలభించి చిక్కణో
ద్భూతము నేతరించితిని పుట్టుక నేటికిపండె పూర్తిగన్. 187

కం. అలరుచు నిట్లాతడు తన
కులసతిగని నవ్వు కన్ను గొనలై పాల్ పు
ట్టలపాల్సేయువ్రతమ్ముల
తులసీ మనయావు కోడెదూడన్ పెట్టెన్. 188

తే.గీ. నా బులియు దూడ దొడ్డ యెద్దై బలియగ
తల్లిపా లన్ని దానికే చెల్లవలయు
నిది మదీయనిర్ణయ మెచ్చరింతు నిన్ను
చెలియ దూడపా ల్పుట్టపా ల్సేయకుండ. 189

కం. నా విని మంచిది లేవ
య్యా వందావులకు నొడయుడా యా పాలే
కావలె నని పంతము గొనె
నా వల్మీకమున నుండు నాగేశ్వరుడున్. 190

తే.గీ. పంతమేకొనినాడొ యా రంతు దీర్చ
తరమె తాతకైనను తాతతాతకైన
నావు మనదంచు దూడ నాదంచు పాలు
దూడవంచు చేసినకట్టు దొడ్డవోదొ. 191

కం. మనయావు లభించి నపుడె
మన యావులదొడ్డిఁ జిత్రమహనీయముగా
కనవచ్చెన్ పుట్టయొకటి
వినవచ్చెన్ పుట్టనుండి వింగడపు బుసల్. 192

చం. కలిపిన యెఱ్ఱమట్టి నొడికమ్ముగ కీటులువెట్టి యేర్పడ
న్నిలిపిన ముక్కుఁగ్రోళులును నేత్రములున్ మురిపెంపునోరునై
పొలుపగు లింగమూర్తివలె పుట్ట హరింప మనమ్ము నర్చనల్
సలుపగ పూనితిన్ పతిఁబ్రచండు భరంపడి యియ్యకొల్పుచున్. 193

కం. మనయా వీనంగా న
బ్బినపా లాపుట్టలోని విషధరునకు స
ద్వినియోగము సేయుదు నం
చు నపేక్షపడంగ నిట్లు చుక్కెదురగునే. 194

కం. మన సాధుగోవుపాల్ తా
కనులే నీఁక్రేపె త్రాగుగాకన్నియు నం
చును తులసి పలుకగా సం
జనితానందమున వాని స్వాంతము పొంగెన్. 195

ఉత్సాహ.
వచ్చెనంత మాఘమాస బహుళపక్షమీ శివా
భ్యచ్ఛయమ్ము తుమ్మిపూవు లొత్తుకొన్న నేల తా
నచ్ఛతెల్పులీన జమ్మియాకుతొడుగ బిల్వముల్
విచ్ఛుజూప మంద నొక్క వింతపుట్టె తేరసిన్. 196

మధ్యాక్కర.
నానాడు గోప్రవేశమున మందనెంతయు ప్రీతి జొచ్చి
తానై కొడుకు నాముకొంచు చన్నిచ్చి తనిపెడు ధేను
వానా డదేమి కారణమొ కొడుకు తానై చన్నుకుడువ
రా నడ్డకాలయి పొదుగుచెంతకు రానీద వాని. 197

కం. ఆ పసి యీ విపరీత
వ్యాపారమ్మేమి యంతుపట్టనిఁవ్రేల్ నా
నా పొట్లు వడియు నది పాల్
జేపద క్రేవుకొఱ కేమిచెప్పెడి దింకన్. 198

తే.గీ. దృష్టి తగిలెను గదరయ్య దీనికంచు
దిగదుడుపు లెన్నియన్నియుతీసియును ఫ
లమ్ముగన రిసుమంత వల్లవులు స్పృహకు
రాద గోరక్షులయ్యు గోరక్షమాయ. 199

సీ. తలుగూడదీయుటేతడవొక్కగంతున
సంభారవమ్మార నమ్మఁజేరి
పొదుగుగ్రుమ్ముచు చన్ను మునిపంటనదుముచు
తమిమీఱ చిబుకు వత్సమ్ము జూచి
పార్శ్వవు కొడుకు సంస్పర్శసుఖమ్మున
కను లరమూతలై మనము పొంగ
మోరత్రిప్పి కుమారు ముద్దుమే నందిన
యంతపట్టును నాకు నావుజూచి

దినదినమ్మును హర్షసందీప్తహృదయ
మందిరుం డగుచున్న గోవిందునకును
నాటి గోమాత వింతచందమ్ము శూల
మంతరంగమ్ము మెఱమిన యట్లు గాగ. 200

కం. చక్కని శుభలక్షణముల
చిక్కని కుండపొదుగావు చిక్కెనటం చే
స్లెక్కినటు లలర నే వే
ల్పెక్కెనొ వానితలపగుల నిది యిటులయ్యెన్. 201

తే.గీ. అనుచు నెదనిండి యుబికెడు నాగ్రహమ్ము
నుఱుముఱిమి మంగలమ్ముపై నొఱిగినట్లు
గొంతుకూర్చుండియట తలల్ గోకుకొంచు
నేలచూపులౌ వ్రేలపై నిగుడజేసి. 202

తే.గీ. ఓరి కఱినాగ యెఱజోగ యోరి చుఱకు
రాగ మీ బండపడ నేమిరా పలుకరు
మానికమువంటియా విట్టులైన మీకు
నద్దిరా చీమకుట్టినట్లైన లేదె. 203

ఉ, మొండితనమ్ము శృంగములు ముట్టగ దూడను త్రాగనీయ క
క్కుండపొదుంగు నిండ సమకూడిన యిద్దుముపాలు పూర్తిగా
కొండొకచెట్టుకో వలచుగుట్టకొ పుట్టకొధారవోయ నీ
చండి తలంపు కావలయు జాగరులై కనిపెట్టియుండుడీ. 204

తే.గీ. నేనెఱుంగుదు మీర్వట్టినిదురపోతు
లెట్టియేమఱుపాటు కన్పట్టనేని
నన్నెఱుంగుదురే కద నాదు దండ
మెఱుకయే కద మీ పుచ్చెలెగిరిపోవు. 205

తే.గీ. అని శాసించు గవాధ్య
క్షుని కని పితపితలువోవు గుండెలతో మా
పనిలో నేయొకలోపము
కనరాదు దొరా యిదేమి కైలాటమ్మో. 206

ఆ.వె. ఊరగొండదారి నూరగొండ పొలాన
నూరిదారి దొడ్డినుండువేళ
నబ్బురముగ దీని నరయుచుండుదుము మా
పతికికూర్చు దొడ్డపశు వటంచు. 207

ఆ.వె. కంటవత్తిపెట్టి కనిపెట్టుకొనియుండు
వారమయ్య తెల్లవాఱు లంత
దీనిమాయలెల్ల తెలియవో దేవరా
యనుచు విన్నవించుకొనిరి వారు. 208

వసంతతిలక.
ఆరాటపెట్టు తమ మంతట గోవతీచ్ఛా
శ్రీరంగ భూమికలు చిందర వందరల్గా
కోరాడనొక్కకనుకూరుకులేని యాతం
డా రేయి జాము యుగమట్టులు వెళ్లపుచ్చెన్. 209

కం. తెలతెలవాఱెడు వేళన్
పిల పిల నేతెంచి గోపభృత్యులు మోముల్
వెలతెలవోవన్ పలుకులు
చిలుపలు చిలుపలుగ నిట్లు చెప్పిరతనికిన్. 210

ఆ.వె. జనపనారపలుపు జంటించి యిట్టట్టు
గెంటకుండ మెడను కీలుకొల్పి
కట్టినారమావుఁ గట్టు కంబమ్మున
నొరుల కరిది దానినూడదీయ. 211

ఆ.వె. పాలదొంగ యెవడు వచ్చునో వానికి
బడితపూజసేయ పట్టుపట్టి
దండధరుల మరయుచుండితి మయ్యు మా
కన్ను పొట్ట లింత కలియకుండ. 212

కం. మసకమసక సంజచీకటి
కసిపూనినయట్లు బండికందెనయేత్రై
బుసబుసనపొంగి దెసలు నా
కసమున్నేలయును ముంచి కక్కన మయ్యెన్. 213

ఆ.వె. గొంతురంగు దేహమంతయు నలమ ని
న్నునమొలాముగన్న బూచులదొర
యగుచు రెండుకన్నులడుచుకొన్నను కాన
బడనిమాయి వచ్చె నడికిరేయి. 214

కం. మెడపలుపు దానియంతట
విడెనో యెవరేని పట్టివిప్పిరొ యావున్
మెడమువ్వలరవ మొక్కట
నడర నెటో పోవుచున్నయ ట్లనిపించెన్. 215

కం. అంతే మేమెఱిగిన దా
వంతున నే నత్తి నెత్తిపైనెక్కినదో
వింత మయికమునబడి తెలి
వింతయులేక పడియుంటి మెల్లవిధములన్. 216

ఆ.వె. మైకమెపుడు దిగెనొ మఱిచూడ నెప్పటి
మాడ్కినావు కట్టుముట్టునందు
తోచె గాలిచనిన తోలుతిత్తిని పోలి
యుండె వట్టి దాని నిండుపొదుగు. 217

ఆ.వె. అంత చుఱుకురాగడనె మైదుముంచులో
నట్టి శక్తిచిక్కబట్టి క్షణము
ఱెప్పలెత్తిపట్టి తప్పకచూచితి
నావు పుట్టవంక కరుగుచుండ. 218

మ. అన గోవిందుడు మేలుమేల్ చుఱుకురాగా మెచ్చుకొన్నానురా
నిను నీదండుగమారి మేతరులకంటె న్వాసియన్పించి నే
ననుమానించినయట్లె యయ్యెనటరా యాజెష్టపెద్దమ్మ యే
గెనురా పుట్టకు పుట్టలోని విషభోగిన్ పాలనోలార్చగన్. 219

కం. అని మోముజేవురింపగ
కనుబొమ్మలు ముడివడంగ కనదగ్నిశిఖా
జనితారుణాంశునిభములు
కనుకెంపులు విరియ నాత్మకాంతన్ కనుచున్. 220

శా. ఆవల్మీకముపుట్టినప్డె తులసీ సాంతమ్ముగా గ్రొచ్చిపో
ద్రోవన్ పూనుకొనంగ నెప్పుడిది నీతో చావునా కట్టె కా
ళ్లావేళ్ళన్ పడి బిట్టువేడుకొను నిన్ లక్షించి నేనూరుకో
నీ విడ్డూరము దాపరించె నిపుడి క్లేమందువే దీనికిన్. 221

శా. ఏమం దెవ్వడొ పుట్టలోని బుసగా డేపంతమోపట్టె నం
దామై రేగినఅంతు తీఱుప నశక్యమ్మందువెవ్వారికిం
గామై నీవటు పాలుపోసి పెనుపంగానైన యాపుట్టలో
పా మోమాయలమారి పాడిమొదవున్ పట్టెంగదే చేడ్పడన్. 222

శా. ప్రాబల్యార్థము ప్రాకులాడుటది మీ ప్రత్యేకనైపుణ్యమై
యాబద్ధ ప్రతిబద్ధులౌ మగల సయ్యాటించి లోగొందురున్
నీ బెల్లింపుల చిక్కుకొంటినికదే నేనెంత బేలైతినే
స్త్రీబుద్ధిః ప్రళయంకరీ యను విపశ్చిద్బోధ పాటింపమిన్. 223

కం. అని విఱుచుకపడు నిజ నా
థుని కని సంతానహృదయ తులసియు నే జే
సిన పాపమేమి కత్తులు
చెనకునుడుల నన్నునిట్లు చెండుకొని తినన్. 224

శా. పుట్టల్పుట్టవొ భూమి గ్రొచ్చి యెవరేన్ పోద్రోతురో వాని చే
పట్టున్ కుంచములంచు నాగములకున్ పాల్పోయరో భక్తి పె
న్నిట్ట ల్పుట్టలగూర్చి నద్వ్రతముల న్నిష్ఠించు నిల్లాండ్రు నే
డిట్టు ల్నాయొక నొప్పనే పొడిచెనే మీ ప్రొద్దు క్రొంగ్రొత్తగన్. 225

తే.గీ. పోయవలదంటి వాపాలు పుట్టలోని
నాగకులభూషణునకు నన్నాగకులవి
భూషణుడు వానియందలి పొందుకొలది
నేమి తలపెట్టినాడొ నాకేమితెలియు. 226

కం. శివలింగ సముద్భవ భ
వ్య విలాస నిధానమీ మహాశివరాత్రి
ప్రవిమల పుణ్య నిశీధ
మ్ము వెలుంగగ నెట్టివింత పుట్టునొ పుట్టన్. 227

కం. అని యూరకున్న తులసిన్
కనుగంపల విసపునవ్వు గగ్గులలో నె
ఱ్ఱని నిప్పారవలుపడి భ
గ్గున మండినయట్లు చూచి గోవిందుండున్. 228

శా. నాగిప్రేరిత మూఢభక్తి కలితాంధా వాడు నాగేంద్రుడో
నాగేంద్రాభరణుండొ యెవ్వడయిన న్నాకేమి నా యావు పాల్
త్రాగంద్రాపుడు వానికేమిపని మద్బాహానటద్దండ సం
యోగ ప్రోద్ధతి వానిపుచ్చె యెటులౌనో యీనిసిన్ చూచుకో. 229

తే.గీ. ఈ పొదిలె పోతుగడ్డపై నెవడువాడు
సముడు మనకు బాణాకఱ్ఱసామునందు
ననుచు హుంకారముఖరితాస్యముగ జబ్బ
చఱచి తొడగొట్టి కోరమీసాలు మెలిచె. 230

చం. మెలిచిన కోరమీసములమీద కుదుర్కొను నిమ్మపండన
న్నిలిచెను క్రుంకుమెట్టజగనీలితలన్ వరవర్ణినీద్యుతిన్
వెలిచిన గోసహస్రములు వెన్కకుమళ్ళగజేయుపోటునన్.
పొలిచిన యావిలో ముదుర ముగ్గిన గోపతి పుల్లగిల్లుచున్. 231

శా. ఏమందేహుఁడొ స్తబ్ధదేహుఁడగులో నెట్లో యసందేహుడై
ధామస్థానునిమేను దేనిగొని సంతాడించెనో సాంధ్య రా
గామత్రమ్ముగ పశ్చిమాంబరము రక్తాక్తాంగమాంజిష్ఠను
శ్రీమంతుండగు నర్యముం డపరవార్ధిన్ చొచ్చె నిర్లిప్తుడై. 232

ఆ.వె. పడ్డ దూడ నోటిపాలనురుగు మౌళి
నంట నాగ్రహించి యగ్గికన్ను
తెఱవ హరుడు కమరి కఱిమేనులై దిశల్
పఱచు గోత్రలట్లు పఱచెనిరులు. 233

ఆ.వె. నలువ ప్రార్థనమ్మునకు సుప్రసన్నుడై
వాని నుత్తమములుగా ననుగ్ర
హించు శివుని ముదితహితహాసకాంతిబిం
దువు లనంగమింటతోచెనుడులు. 234

మ. మకరాంకున్ పడగాల్చ ఫాలనయనామర్షాగ్ని శేషమ్ము వా
ర్ధి కృపీటమ్మును పొంద పుట్టుసురవైరిన్ పార్వతీ వక్ర కా
ముకునిన్ పీచమడంచు నింగిసిగపై ప్రోదిన్స్ఫురల్ చల్లు మౌ
క్తికశేషాతతిలీలనిండి వెలుగొందె న్నింగి నక్షత్రముల్. 235

ఉ. వానికిదీటుగా పుడమిపైగల సర్వశివాలయమ్ములం
దానటరాజభక్తుల మహాశివరాత్రిమహానిశాసము
త్థాన మ హేశలింగ సముదారదిదృక్షుల పిండిదీపముల్
మానిత కాంతికాంతములు మంగళ రంగములల్లె నెల్లెడన్. 236

శా. లింగాకారముతోప కన్పడిన వల్మీకమ్మునం దాప్తసం
సంగశ్రీ పరిపూర్ణయౌ తులసి పూజాపారవశ్యాసమా
సంగోత్కర్షిణి నాడు తృప్యదుపవాసస్ఫీతజాగ్రన్మతిన్
లింగప్రోద్భవవేళ వార్చుచును నిల్చె న్నిర్మమత్వస్థితిన్. 237

ఉ. అందపుకోడెదూడగతి కారటగూరు మనమ్మువాడు గో
విందుడు నాడు తిండితినువేళ యెఱుంగడ వత్సపీడనా
నందినియంతు తేలుచుకొనన్ కనుచీకటి పడ్డ వెంటనే
మందకునేగె దండధరమత్తవిలాసవిలోలనేత్రుడై. 238

ఆ.వె. ఊరగొండకేగి సారఘాసము మేసి
నిండు పొదుగుతోడ నిచికి దొడ్డి
చేరి తిరిగి పొదుగు చేరవచ్చిన దూడ
నడ్డగింప నిన్నటట్ల తిరిగి. 239

కం. ఉడుకుచు గోవిందుండీ
మిడిమేలపుదయ్య మిట్లు మిడుకునె దీనిన్
పడగట్టించెద నెట్ల
క్కడకేగునొ చూతునంచు కలుషితమతియై. 240

మధ్యాక్కర.
కట్టివేయించినా డినుప గొలుసుల కట్టుదిట్టముగ
కట్టుకంబమున నగ్గోవు నతివంతకాడు గోవిందు
డిట్టట్టు కదలింపనైనలేకుండ నినుపగుండులను
కట్టించినా డావు నాల్గుకాళ్ళకు కఠిన చిత్తుండు. 241

మధ్యాక్కర.

అటువైపుగోవును పుట్టయిటువైపు నగపడుచుండ
కటు తర పర్యాయదృష్టి నారెంటి గన్గొనుచు కాల
కుటిల దండము బోని దుడ్డు నానించుకొని గడ్డమునకు
పటు రోషఖుండు నిల్చుండెనొక శిలాప్రతిమ చందమున. 243

మ. అమితాకుంచిత కంఠదేశమయి, దండాగ్రమ్ము నందాత్త బా
ధముగా నిల్చిన గడ్డమై యటు నిటున్ తారాడు చూపై ముధా
శ్రముడుండె న్నరరూపరాక్షసుడు దజ్జాలందరాభాసబం
ధ మెటుల్లేపునొ పుట్ట యట్టడుగువింత న్మండలీకుండలిన్. 244

చం. సురభుల మందసర్వమును సొమ్మసిలన్ పడియుండె నంధకా
సురభయదాట్టహాస పరిచుంబితమై తదుదగ్రభావ ని
ర్ఘ రణము పూనెనో మిగిలె నచ్చటి పుట్టయు నట్టహాసితా
విఖ మహత్త్వమై పొదిలె భాగ్యచయంపు టుసుళ్ళుపుట్టయై. 245

మ. శివసర్వాయతనమ్ములందు నభవ శ్రీమన్మహాలింగ సం
భవకాలమ్మిదె చేరవచ్చె ననుచుం భావమ్ము రంజిల్ల భ
క్తవరు ల్పాయకసేయు సమ్మదచలద్ఘంటా ఘణాత్కార గౌ
రవ నాదమ్ము శివాభిమంత్రణముగా రాపాడె కైలాసమున్. 246

సీ. కైలాసహిమవాలుకామాలికావాల
మచ్ఛతెల్పులపుట్ట యవిసెనేమొ
భూషణాయిత శేషభోగి సానందసం
వేగి వేపడగలు విప్పెనేమొ
జూటాటవీనటత్సురవాహినీ స్వచ్ఛ
వారిధారలు చుట్టువాఱెనేమొ
గౌరీ మహాదేవి కమనీయచేలాంచ
లాంచిత సితకాంతు లలమెనేమొ

విఘ్నవిభు నేకదంతమ్ము విరిసెనేమొ
ధవళ గళకంబళద్యుతు ల్తారెనేమొ
శివమహాలింగ జనన సూచిక నిశీథ
మసమెనయవచ్చె తెలిమంచుముసుగు తాల్చి. 247

శా. మన్యుప్రేరితచిత్తు డుల్కిపడి గోమంతుండు వీక్షింప నీ
శాన్యాకాశపథమ్మునం దపుడు విశ్వాతీతకాంతిప్రభా
విన్యాసమ్మొక డర్బుదార్కకిరణావిష్కారతేజోమయా
నన్యాదృక్ష మహాప్రకాశమయి బ్రహ్మాండమ్ము వెల్గించుచున్. 248

ఉత్సాహ.
తోచి యొక్కనిముస మట్టె దూసికొంచు వచ్చి య
బ్రాచితాంశుమాలికా స్వయంప్రకాశదీప్తితో
రోచమాన నాగరాట్స్వరూపమొంది గోరస
మ్మాచికొనెడు తమిని పుట్టయందు దూఱె గొబ్బునన్. 249

మధ్యాక్కర.

ఆ పుట్టలోనుండి యప్పు డంగుగా వినవచ్చె బుసలు
ఆపయస్వినికైన లేలిహాను పిల్పుల గుసగుసలు
ఆ పుట్ట ద్వేషించుకుమతి కంతుచిక్కని రుసరుసలు
ఆ పుట్ట బూజించు సుమతి కంతరంగపు మిసమిసలు. 250

చం. మృదులమనోహరమ్ములయి మించెడు నా బుసలైన పిల్పులన్
మది తమకించి మైయవశమై పులకాంకుర సంకులమ్ముగా
పొదుగున పాలుపొంగి చనుముక్కులు నిక్కగ నాకుసద్మునిన్
కదిసెడు వేడ్క ధేనువు నికామ మొడల్విదిలించినంతనే. 251

చం. వదలకపట్టి నిల్పునని పంతము గంతుగొనంగ నయ్యయో
హృదయుడు నిల్పు బంధములు శృంఖలలుం గుదిగుంట్లు నొక్కటన్
ప్రిదిలె నయోమయమ్ము లతివింతగ నంతరితాంగబంధ మ
ట్లొదవ చెలంగు మోదమున నుల్లపు పొంగులు చెంగలింపగన్. 252

మ. మెడముప్వ ల్వడి నాఱువోయు మృదుగంభీరస్వనమ్ము ల్మడు
ల్కడలందెత్తగ వామలూరముదెసన్ కాల్సాచె మాహేయి య
క్కడక న్నిల్పెడుపూన్కి ముంచుకొనియున్ కాల్రాక గోవిందుడున్
మిడిగ్రుడ్లై కనుచుండె తత్సరభసోన్మేషప్రయాణోద్ధతిన్. 253

మాలిని.

అతిమృదువదలాస మ్మాన్వు నిధ్యాన చాంద్రీ
ప్లుతముగ పథమెల్లన్ పోయి నాగేశతృప్త్యం
కితము పొదుగు లోకాకీర్ణమై నిల్వపైన
ప్రతిమచతురభంగి న్వల్మీక మ్మాక్రమించెన్. 254

తే.గీ. ఎవ్వరో యూదివేసిన ట్టిట్టి యూగు
లాడి దీపమ్ములన్నియు నాఱిపోయె
కాలకాలోద్భవాపన్న మాలమంద
ప్రబలాతామసభావ నిష్పన్నమాయె. 255

మ. పదముల్ రెండును నేలకంటుకొనిపో పారాడగాలేని దు
ర్బృదు డీచేతులు రెండు మద్వశములే యింకేమియం చుద్ధతిన్
గుదియ న్మాటికిమాటికి న్నిమురుచున్ గోవిందుడుండెన్ రుషా
మృదితుం డేచిన యంధతామసమునన్ రిక్కించి వీనుంగవన్. 256

మధ్యాక్కర.

ఆ పుట్ట నప్పుడువిన్చె నావుచన్ చిబుకు చప్పుడులు
కోపుగా వెనకయ్యపెట్టు గున్నయేనుగుగీకసుడులు
వైపుగా కొమరయ్యనెమ్మి పచరించు తొలికేక జడులు
ప్రేవుగా బసవయ్యతోలు బిసిబిసి అంకె సవ్వడులు. 257

మధ్యాక్కర.

నాకువేశ్మ సలాస్యచరమకింకిణీనాద వైభవము
నాకాపగోద్వృత్తరంగమాలికానందనారవము
నాకుజా చేలాంచలోత్థమర్మరాంతర్మహాశివము
నాకురోకమునూచె చన్నుచిబుకు మంత్రస్వనోత్సవము. 258

మధ్యాక్కర.

చిబుకు చిబుకుమను రవళి వీనుల చీల్చిచెండాడి
గుబుకగ గుబుకగ గుండె గూడులు కూర్కొను కోప
ముబికి యుబికి సుడిదిరిగి డెందము నుఱ్ఱటలూప
గబుకు గబుక్కున శిరము విదిలించి గాఢనిశ్చయుడు. 259

మహాస్రగ్ధర.

ఏచి కరాగ్రకీలిత మహిష్ఠ వరిష్ఠ పటిష్ఠ దండ మ
ట్లూచి కటుత్వ ధిక్కృత లయోగ్ర కృతాంత కరాళ దండమున్
పూచిన కింక ముప్పిరులువోవ భయంకరమూర్తి యిప్పుడే
పోచనె పాలదొంగయగు పుట్టలపుర్వని గర్వముబ్బగన్. 260

మహాస్రగ్ధర.

సరిగాచేసాచి యష్టిన్ సరభసవలితన్ శబ్దవేధిత్వవిద్యా. 261
పరిపాకమ్మొప్పగా తత్పరమతి విసరన్ వాయునిర్ధారణా ఖీ
లరవమ్మై పాటివేగన్‌లగుడమది లగల్లక్ష్యభేదమ్ముగా వి
ద్వరమొందం గోపతిన్ పుట్టను భయదగతిన్ తంగుమం చీడ్చికొట్టెన్

ఉ. ఠంగను శబ్దముత్కటవిడంబనదంభము పుట్టఁజుట్టి త
త్సంగతమైన చన్చిబుకు శబ్దముతోడ నడంగిపోయెనో
రింగున పర్వి మందనువరించి హరించెనొ గోపతిక్రియా
రంగము నీరవత్వమున గ్రమ్మెనప్పడె నంత నదేమివింతయో. 262

ఉ. నాకువులేదు లేదచటనాగము గోతిలకమ్ములేదు లే
దాకటుచండదండము మహోద్భుతదీప్తి వెలుంగుచున్ స్వయం
భూకమనీయలింగ శివభోగము లేచినపెచ్చుతో నస్వ
క్ష్వీకృతమస్తమై పరవశింపజగమ్ములు తోచెనచ్చటన్. 263

ఉ. ఏచిన యింద్రజాలమన నెక్కడిగోపకులక్కడే దృశా
గోచరులైరి మందనొకగోవును కన్నడ దద్దురాత్ముడున్
చాచినచేయి చాచినదశ న్మయిగ్రమ్మెనప్పడ ప్రాణవాయువు
ల్లేచిన చందమై కదలులేశము లేకటనుండె నొక్కడున్. 264

శా. పుట్టెన్ శ్రీ శివదేవు డీ పొదిలెకున్ పుణ్యమ్ము నిండార నం
చట్టంపున్మదమొందు నత్తులసి స్వప్రాణేశ సంస్తంభమన్
కొట్టేరమ్మున నూపిరాడని మదిన్ కోరాడు శోకమ్ముచే
నట్టిట్టైవసివాళ్ళువాడియు నవశ్యప్రాప్తమౌ తేకువన్. 265

కం. లింగమ్ము దరిసె ముమ్మఱు
సంగతిగ ప్రదక్షిణించి సద్భక్తిక సా
ష్టాంగ ప్రణామమై హృద
యంగమముగ నీశునిట్టు లభినుతియించెన్. 266

దండకము.

శ్రీ పార్వతీ ప్రాణనాథా జగన్నాథ కైలాసనాథా
మహానంద సంధాయ కాత్యంతి కాశ్చర్యవిస్తారగాథా
సమావిర్భవింపంగ నీ విట్టులీ గడ్డపై మామనమ్ముల్
ప్రహర్షాంబుధిన్ తేలె మా పాపముల్ తూలె మాతుచ్ఛ
కామమ్ములున్ కాలె ఫాలానలాభీలకీలాకరాళో
ల్లలజ్జిహ్వికాలేలిహానాంగజా జహ్నుజాతామృ
తాంచత్పయఃపూరనిత్యాభిషిక్తోత్తమాంగా మహా
లింగ యీసౌరభేయీ పయఃపానసంగమ్ము నిన్నెట్లు గా
పట్టె నిస్సంగ నిర్మోహతత్త్వాభిరామా మహోద్దామ
నిర్మోక్షదానక్షమా నిర్మమా గోవులేలోకమందుండి
యీలోకమేతెంచె నీ కార్యమున్ తీర్చి యాలోకమే
పోయెనా నాయనా మాయమైనట్టి గోపాలురు
న్నీపరీవారమాయేమి నా స్వామి యేమయ్య నీమాయ
మాయామహోపాయ నీమాయ గుర్తింపగాలేని
నా భర్త నిన్నిట్లు భర్త్సించెబో భూతభర్తా జగద్భర్త
కల్గించెబో బాధ నీకున్ దురాబాధ తా నిప్పు డిట్లౌట
కున్ కారణమ్మేమి నిష్కారణా యీతడేకారణ
మ్మైనవే మిమ్మహాపుణ్యవేళ న్ని రాహారమై దీప
సంభారమై నిండుజాగారమై నీ వ్రతమ్మున్సమగ్రమ్ము
కావించి నీ భక్తుడై నాడుగా భక్తిలోకావనా త్వత్కృ
పాపాత్రుడై నాడుగా భూరికారుణ్యపీయూష
పాత్రీకృతాలోకనా వీనిమన్నించి రక్షించవే
దీనరక్షా విరూపాక్ష నీపట్ల నీపాపమున్ చేసి యీ పట్టు
నందింక మేముండగా చాల మీనేలకు న్మాకు
తీఱెన్ ఋణమ్మేగపాలైతిమెందేని డెందమ్ము
నన్నిన్ను సంధించి చక్షుశ్శ్రవోభూషణాపేక్షణా త్ర్యక్ష

యీ భర్తృభిక్షార్థిని న్నన్ను పాలించవే యాది
భిక్షూ దయాచక్షు నా జీవితస్వామి
మ్రానాపాటు తప్పించవే శైలజాజీవితస్వామి
శ్రీశంకరా శూలి శంభూ శివా శర్వ సర్వజ్ఞ
శ్రీకంఠ భర్గా భవా భీమ భూతేశ భద్రేశ యీశా
మహేశా హరా వ్యోమకేశా గిరీశా మృడా రుద్ర
మృత్యుంజయా వామదేవా మహాదేవ శ్రీనిర్మమేశా
నమస్తే నమస్తే నమః. 267

సీ. తులసికావించు నిస్తులితాభినుతి దయా
నిచితాత్ముడై విన్న నిర్మమేశు
రక్తాక్తచారుమూర్ధమ్ముపైనొక త్రుటి
కదలాడె నతిసితకాంతిరేఖ
కాలుసేతులు వచ్చి లీల నూపిరి పీల్చి
కదలాడె హృతమదగ్రంథి గోపు
డతివ వేచనుదెంచి మతివిభ్రమముగొన్న
పతికేలు తనకేలపట్టి సావ

ధానముగ నంతయును చెప్పుదాన నిచట
తడయ రాదింకమనమొండుదరికి వేగ
నరుగవలె నిప్పుడంచు హెచ్చరికమెఱయ
వాని నడిపించుకొంచు నెందేని జనియె. 268

సీ. పొర్లెనో గంగమ్మ పొంగెనో నవగంగ
భవుమేను స్నానశుభ్రమ్మొనర్చె
డాసెనో గిరిజపైట చెఱంగు విరిసెనో
తడియొత్తెనభవుగాత్రమ్ము వెలుగ
సాగెనో గిరికపెల్లూగెనో పెను బొజ్జ
గణపయ్యవాకిట కాపువెట్టి
తోలెనో బలుఱంకెవ్రాలెనో శివుముందు
బసవయ్య వాహన ప్రభవెలార్చె.

పొదిలె జనముల చిరతపఃపుణ్యఫలము
నిఖిలభక్త నిర్మోక్ష నిర్ఛిద్ర పథమ్ము
జగదవన దివ్యతేజఃప్రసన్నమై వె
లింగె శ్రీ నిర్మమేశ్వర లింగమూర్తి. 269

మంగళమహాశ్రీ.

శ్రీగళుల కర్ధశశిశేఖరున కాభరణ శిక్షితభుజంగునకు గంగా
రాగమయ జీవనతరంగ విచలత్సుమ పరాగరమణీయ ఘనజూటా
భోగునకు వామతనుభూషితశివాప్రణయ ముగ్ధునకు దీనజనరక్షో
ద్యోగునకు నిర్మమున కూర్జితకృపాంచితపయోదునకు మంగళమహాశ్రీ.

మ. నయవిద్యాపర ధర్మమార్గచర శాంతద్యోతితాకార అ
న్వయకీర్తీశ్వర సాధుసజ్జనహృదానందప్రదాచార ఆ
వ్యయవాత్సల్యవినీతసోదర దయావ్యాపార ధీసార ఆ
ద్వయనిత్త్యైకపదీగ వేషకవరా తత్త్వామృతాప్తాంతరా 271

కం. పరిణత విషయనిగదనా
సరిత్ప్రవాహోపమానచతుర మధురవా
క్స్వరుచిరగభీరవదనా
వరగుణమణినికరకాంతిభరహృత్సదనా. 272

మాలిని. పరమశివపదాబ్జప్రాపితారూఢభక్తి
స్థిర విషయసమూహోద్రిక్త దుర్వారవాంఛా
విరత నిరతయత్నావిష్కృతాత్మీయవంశా
దరభరిత చరిత్రా ధ్యానసంవత్పవిత్రా. 273

కం. నాయని సుబ్బరాయక
వీయమ్మ జన్మభూమి నిది పరమశివా
మేయాద్భుత లీలా సం
ఖ్యేయము శివఖండ మమితహృద్యము పొలుచున్. 274

----- 0 -----

# బాలకేళీఖండము

శ్రీలలిత లలిత బృందా
పాలిత మధురాతి మధుర బాల క్రీడా
లోల యశోదాసుత చలి
తాలోల పదాబ్జమధులిహా నరసింహా. 1

ఒక పేరె పెక్కు గ్రామము
లకు నండుట కలదదెట్టి లక్షణమో యిం
కొక యూరు పొదిలె నామ
ప్రకటీకృత మగుట కానరాదెచ్చోటన్. 2

అట్టి పొదిలె వెలసినట్టి దైవతముల
దివ్య గాథ లెల్ల తెలిసినంత
వట్టు సహజ సిద్ధభావబంధురముగా
నేర్చి నట్టు పేర్చి కూర్చినాడ. 3

ఇంక పొదిలె తల్లి యంకతలమ్మున
చీకు చింతలేని చిన్ననాట
కెరలు వొడుచు బాల కేళీవిలాసవై
భవము కొంత కొంత పలుకువాడ. 4

కాలపు ముండ్ల గాయములు
కాంచని చిన్ని యెడంద లచ్ఛతా
వేలములై యమాయికత
వెల్గెడు నవ్వు లకల్మషత్వసు
శ్రీలలితమ్ములై వెలయు
చిన్నరి పల్కులు కందళించు న
బ్బాల విహార వైభవవి
భావన డెందము నూపు నిప్పుడున్. 5

తీయని యస్మద్బాల
ప్రాయపు టాటలకు ప్రథమ రంగస్థలమై
మాయింటి ముందు కుడి దెస
ఛాయా తరురాజ మొకటి సంశోభించున్ 6

వేయి పుల్గులు రేయి విదిత నిద్రాముద్ర
నంకించి సుఖియించు టెంకి పట్టు
పగటి యెండకు తాపభరితాంగములు వసి
వాడు పాంథుల కెల్ల నీడ పట్టు
వంగవోల్ సరుకుల బండ్లకు మరలి పో
యెడు వేళ యగు దాక విడిది పట్టు
చుట్టు పట్టుల నుండు బొట్టెల కానంద
మను పదమ్మును పంచు నాట పట్టు

క్రమ్మి నంత మేరయు నింగిఁ గప్పి పుచ్చు
దట్టపుం జొంపముల తోడ నిట్టు నట్టు
గాలి కూగాడు కొమ్మలై కొంచు వారి
మనము లలరించు నా పెద్ద మఱ్ఱి చెట్టు. 7

పండ్ల కెంపులు నాకుల పచ్చలును చి
గుళ్ల పగడాలు పండు టాకులను దర్శ
నీయ గోమేధి కములు నై నిత్య రత్న
మండనాంచిత మా పెద్ద మఱ్ఱిచెట్టు. 8

పండు వెన్నెల యందారు బయట పవ్వ
ళించి నడిరేయి మెలకువ గాంచి తెఱచు
నయనముల నది భాసించు నాయనమ్మ
చెప్పు కథలోని రతనాల చెట్టు వోలె. 9

ఇంత పెద్ద వృక్ష మెట్లు రూపొందెనో
నలుసు వంటి విత్తనమ్ము నుండి
యనుచు సృష్టి మర్మమరయంగలేని మా
పిల్ల యెడద లొందు వెఱగు పాటు. 10

వివిధ జటలు విరిసి విశ్వతో ముఖముగ
నజ్జటాల మొప్పు నవ్యయాత్మ
రూపు దెంద మందు కాపురమ్ముగ విని
శ్చల సమాధి నుండు జటి విధాన. 11

ఈ బహుపొత్తు నెవ్వరిట
నెప్పుడు నాటిరొ పీనదీర్ఘ శా
ఖాబహుళమ్ముగా దళని
కాయనిరాకృతనీలకాంతిరే
ఖాబహుళమ్ముగా పెరిగి
కాలము తీర్చిన వృద్ధయయ్యు శో
భా బహిరంగ సత్వధృతిఁ
బాయక నిల్చు సహస్రమూలమై. 12

దిగెడు నూడ లెల్ల దిగినేల లోన వే
ళ్ళూనకుండ వాని యొగరు కొనలు
త్రెంపి వెంట వెంట తినుచు నున్నను నరు
లధ్రువమ్ము గాద యాధ్రువమ్ము. 13

అవసరమ్మని తోచి నపుడెల్ల కొమ్మలు
కఱకు గొడ్డళ్ళతో నఱకుచున్న
విస్తళ్ళకని యెల్ల వేళల నేచి యా
కులను దోటుల తోడ కోయు చున్న
దంత ధావనకు నుత్తమములం చెగబడి
చేసేత నూడలు చీల్చుచున్న
వైద్యమ్మునకు పాలు వలె నంచు కత్తులు
పెట్టి బోదెకు గాట్లు పెట్టుచున్న

నడరు వడక పరోపకారార్థ మీ శ
రీరమని పూని తను వెల్ల చూఱ లిచ్చు
మనుజులకు వితరణ గుణ మాననీయ
విమలతర కీర్తి న్యగ్రోధ వృద్ధమూర్తి. 14

(అసంపూర్ణము)